తెలుగు అకాడమి ప్రచురణలు (ఎం.ఏ) - 45

చరిత్ర

# ప్రతిమాలక్షణశాస్త్రం


రచయిత

**డా. కె. సత్యమూర్తి**

లెక్చరర్, చరిత్రశాఖ,

ఎస్.డి.జి.ఎస్. కళాశాల

హిందూపురం.

సంపాదకుడు

**ఆచార్య ఎస్.ఎస్.రామచంద్రమూర్తి**

శాఖాధిపతి, భారతీయ సంస్కృతి,

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం,

తిరుపతి





**తెలుగు అకాడమి**

**హైదరాబాదు**

**1998**

M.A., Pratimalakshana Saastram (Iconography); **Author**: Dr. K Satyamurthy, **Editor:** Prof. S S.Ramachandra Murthy, First Edition : 1998 pp. viii + 140.



First Edition : 1998
Copies : 1000

Published by Telugu Akademi, Hyderabad-500 029 (Andhra Pradesh) under the Centrally sponsored scheme of production of books and literature in Regional language at the University level in the Ministry of Human Resource Development, Government of India, New Delhi.



Price : Rs. 30 = 00

Printed in India
Laser Typeset at M/s. Aswani Graphics, Hyderabad,
Printed at M/s Sai Srinivasa Printers, Hyderabad,
Andhra Pradesh.

# భూమిక

1968 లో తెలుగు అకాడమి స్థాపన జరిగిన నాటినుంచి ఉన్నత విద్యాస్థాయిలో బోధనభాషగా తెలుగు కుదురుకోవడంలో తెలుగు అకాడమి నిర్వహిస్తున్న పాత్ర అందరికీ విశదమైనదే. ఎన్నో రకాల ఇబ్బందులను అధిగమిస్తూ అత్యల్ప కాలవ్యవధిలో పాఠ్య, పఠనీయ, అనువాద, పరామర్శ గ్రంథాలను, శాస్త్రి నిఘంటువులను, జనరంజక గ్రంథావళిని, వృత్తివిద్యలకు సంబంధించిన గ్రంథాలను ప్రచురించి అకాడమి విద్యారంగానికి సముచితమైన సేవ చేయగలిగింది. పునరభ్యసన గోష్ఠుల ద్వారాను, విద్యార్థులు, అధ్యాపకులు మిగుల ఆసక్తితో చేస్తున్న సూచనల ద్వారాను, ఎప్పటికప్పుడు గ్రంథాలను మెరుగు పరచడంలో కృషి కూడా జరుగుతూనే వచ్చింది. వీటితోబాటు పి.జి. స్థాయి గ్రంథాలు ప్రచురించే కార్యక్రమం కూడా తెలుగు అకాడమి తన సామాజిక బాధ్యతగా చేపట్టింది.

చరిత్ర-పురావస్తుశాస్త్రానికి సంబంధించి స్నాతకోత్తర స్థాయికి (పి.జి. స్థాయి) ఉపకరించే విధంగా ప్రస్తుత గ్రంథం తయారు చేయడం జరిగింది. తెలుగులో ఆయా పాఠ్యాంశాల మీద విస్తృతాధ్యయనం చేయగోరే వారికి ఇలాంటి గ్రంథాలు ఉపకరించగలవని మా విశ్వాసం

గ్రంథ ప్రచురణ కార్యక్రమంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, అకాడమి పాలక వర్గం, ఉద్యోగులు, రచయితలు, సంపాదకులు, ముద్రాపకులు మాకు అందిస్తున్న సహాయ సహకారాలకు మేము సదా కృతజ్ఞులం.

ఈ గ్రంథం కూడా మా పూర్వ ప్రచురణల వలెనే అందరి ఆదరాభిమానాలు సంపాదించగలదని విశ్వసిస్తున్నాం.



# ప్రవేశిక

భారతీయ సంస్కృతి, చరిత్రలను స్నాతకోత్తర స్థాయిలో అధ్యయనం చేసే విద్యార్థులకు ప్రధానమయిన పాఠ్యాంశాలలో 'ప్రతిమాలక్షణశాస్త్రం' ముఖ్యమయినది. ప్రతిమలు లలితకళలకు చెందిన విశిష్టమయిన భాగాలుగా మాత్రమే కాక భారతీయ ఆధ్యాత్మిక జీవనానికి , మంగళదాయకమయిన మతాచారాలకూ ఇవి అద్దం పట్టేవి. 'దేవుడు' అనే భావనలోని సర్వవ్యాపిత్వాన్ని విష్ణువు ద్వారా రుజువు చేస్తే, శివత్వాన్ని, అనగా శుభం కలిగే భావాన్ని శివునిద్వారా చూపారు. అందుకే 'శతరుద్రీయం'లో శివుని గూర్చి 'శివాయ' (మంగళం కొరకు), 'శివతరాయచ' (మరింత మంగళాన్ని కల్గించే వాని కొరకు) అని చెప్పబడింది ఆ దేవ స్వభావానికే పుంస్త్వాన్ని గాక, స్త్రీత్వాన్ని ఆపాదించినపుడు ఆమెనే 'సర్వమంగళ' అన్నారు. శివ విష్ణువుల మధ్య, పార్వతీరమల మధ్య ఏకత్వాన్ని చూపిన ప్రయత్నంలో 'శ్రీయన గౌరినాఁబరగు చెల్వకు చిత్తము పల్లవింప భద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపము దాల్చి విష్ణు రూపాయ నమశ్శివాయ' అని కవి బ్రహ్మ తిక్కన సోమయాజి 13వ శతాబ్దంలో తన 'నిర్వచనోత్తర రామాయణం'లో పేర్కొన్నాడు. ఈ రకమైన ప్రతిమలు కేవలం హిందూ ఆచారాలలోనే గాక ప్రేమాహింసలను ఒకే మూసలో కలిపి ప్రజా జీవనంలో పాలు, నీళ్ళలా కలవడానికి తోడ్పడ్డ బౌద్ధమత, జైనమత సాంప్రదాయాలలో కూడా ఎంతో పేరు పొందాయి.

సంప్రదాయాలను బట్టి ప్రతిమలలో వైవిధ్యాలు ఏర్పడ్డాయి. ఇవి సాత్త్వికతను, తమోభావాన్ని, వేర్వేరు రకాల అభిప్రాయాలను వేర్వేరు స్థాయిలలో సూచిస్తాయి. ప్రతిమలన్నీ ముందు ప్రకృతికి, మానవునికి, భగవంతునికి, భక్తునికి మధ్యగల సంబంధాలను ఆధారంగా ఊహించి ఏర్పరచినా, రానురాను ప్రతిమల లక్షణాలను నిరూపించే అనేక శాస్త్రాలు ఆవిర్భవించాయి. వాటినే ఈ శాస్త్రపరంగా 'ఆగమాలు' అని పిలుస్తారు ఇవి మాత్రమే కాక ప్రసిద్ధ శిల్ప గ్రంధాలయిన 'సమరాంగణ సూత్ర ధరము' 'మానసారము', 'రూప మండనం' చిత్రలేఖన గ్రంధాలయిన 'విష్ణు ధర్మోత్తరం' వంటివి ఆవిర్భవించాయి. ఈ రకమయిన ఆగమాలు, శిల్ప శాస్త్ర గ్రంధాలు ప్రధానంగా శ్రుతి (వేదాలు); స్మృతి (ధర్మాలు); పురాణ (స్కాందపురాణం, వాయుపురాణం వంటివి), ఇతిహాసా (రామాయణ, మహాభారతాలు) లలో చెప్పబడిన ఆచారాలను, ఆశయాలను, ఊహలను ఆధారంగా కలిగినవే.

అందువల్లనే ప్రతిమాలక్షణశాస్త్ర అధ్యయనం చరిత్ర, సంస్కృతి, పురావస్తు శాస్త్ర విద్యార్థులకు మాత్రమేగాక, ఇతర జిజ్ఞాసువులకు (తెలిసికోవాలనుకొనేవారు) కూడా ఎంతో జ్ఞానాన్ని, సౌందర్యతత్త్వాన్ని, ఆహ్లాదాన్ని చేకూర్చగలదు.

# విషయసూచిక

# 1.
# పరిచయం

## 1 : 1:నిర్వచనం :

ప్రతిమా లక్షణ శాస్త్రం అంటే ప్రతిమలను గూర్చి తెలియజెప్పే శాస్త్రం అని శబ్దార్థం వ్యాకరణ సాంప్రదాయం ప్రకారం 'శాస్త్రం' అంటే "శాసతాంత్రాతయతి ఇతి శాస్త్రం'.. అంటే శాసించేది; రక్షించేది అంటే ఈ సందర్భంలో ఈ శాస్త్రం ప్రతిమల రూపాలను శాసించేది; రక్షించేది శాసించడం వల్ల ఈ రకమైన ప్రతిమ ఈ విధంగానే ఉండాలి అని నియమించడం. రక్షించడం వల్ల ఆయారకాలైన రూపాలను శిల్ప రూపంలోగాని, చిత్ర రూపంలోగాని, అక్షర రూపంలోగాని వ్యక్త పరచినపుడు ఆ రూపానికి ఏ రకమైన వైరుధ్యం కలగకుండా కాపాడటం. ఈ రెండు పనులు.. శాసించడం, రక్షించడం అనేవి – ప్రతిమలను గూర్చి జరిగేవి.

**1:1:1** ప్రతిమ అంటే? దీనినే ఇంగ్లీషులో ఐకాన్ (Icon) అని, దానిని గూర్చిన శాస్త్రాన్ని 'ఐకానో గ్రఫీ' (Iconography) అని వ్యవహరిస్తారు. ఇంగ్లీషు భాషలో చివర వాడిన 'గ్రఫీ' (Graphy) అనే మాట వస్తు విశ్లేషణలోగల 'వర్ణానాత్మకత'కు ప్రాముఖ్యతను సూచిస్తుంది. అంటే ఈ శాస్త్రంలో ప్రతిమలను వర్ణనాత్మకంగా విశ్లేషించడం జరుగుతోంది అని తెలుస్తోంది.

**1:1:2:** ప్రతిమలన్నీ స్థూలంగా మత పరమైన రూపాలనే సూచిస్తాయి ఈ రకమైన సూచన రెండు రకాలు. మొదటి తరహాకు చెందిన ప్రతిమలను అర్చామూర్తులని వ్యవహరిస్తారు వీనినే 'బేరమూర్తు'లని, 'బింబమూర్తు'లని, 'ప్రతిమామూర్తు'లని కూడా వ్యవహరిస్తున్నారు మనుస్మృతి ప్రకారం యీ ప్రతిమలన్నీ తొలిరోజులలో లోహంతో చేయబడేవి. ఇవి 'ఛల బేరత్వాన్ని కూడా కలిగి ఉండేవి. 'ఛలబేరత్వం' అంటే వాటిని ఒక చోటనుంచి వేరొక చోటుకి తీసుకొనిపోవడానికి వీలైనవి. ఈ రకమైన మూర్తులు ఆవాహన (దైవభావాన్ని ఆపాదిస్తూ దైవత్వాన్ని ఆరోపించడం), ప్రాణప్రతిష్ఠ (ప్రతిమలలో దేవుని భావాన్ని జీవ పరంగా ఏర్పరచడం) అచల బేరత్వం (కదలడానికి వీలుకాని స్థితి) కల్గించడం ద్వారా పూజయోగ్యాలయి దేవాలయంలో ఉంచబడి నిత్య పూజ కార్యక్రమాలలో లక్ష్యాలవుతున్నాయి

**1:1:3** రెండవ తరహాకు చెందిన ప్రతిమలు శిల్పాలవలెనే దేవాలయాలలో వెలుపలి, లోపలి భాగాలలో అలంకరణ వస్తువులుగా మిగిలాయి

**1:1:3:1** మొదటి తరహా ప్రతిమలు 'అర్చామూర్తు'లయి పొడుగు, వెడల్పు, మందం ప్రధానంగా కలిగినవి రెండవ తరహా ప్రతిమలు కేవలం పొడుగు, వెడల్పు మాత్రమే కలిగి ద్విగుణాత్మకత (Two dımensionalısm) ను అభివ్యక్తం చేస్తున్నవి ఏ విధంగా పరమాత్మను త్రిగుణాతీతుడని అభివర్ణించారో అర్చామూర్తులలో త్రిగుణాత్మకత ఆభాసించి పరమాత్మకు మాధ్యమం (Medium) గావ్యవహరిస్తున్నవి కాని రెండవ తరహా రూపాలు కేవలం ద్విగుణాత్మకత (Two dımensıonlısm) ను కలిగి ఈ మాయా ప్రపంచంలోని రంగుల అలల్లో తాము కూడా ఒకటి అవుతున్నాయి.

**1:1:3:2:** దీని దృష్ట్యా, ప్రతిమాలక్షణశాస్త్రం కేవలం మత ప్రోక్తాలైన దేవ, దేవతామూర్తులను, వాని లక్షణాలను నిర్వచించి, సమన్వయపరచే శాస్త్రం అని గ్రహించవచ్చు.

**1:2: పరిధి :**

ఈ శాస్త్రం పరిధి కేవలం వేర్వేరు మతాచారాలలో చెప్పబడిన దేవ, దేవతా మూర్తుల వరకే పరిమితం ఈ రకమైన మూర్తులు ప్రయోజనం (Function) దృష్ట్యా మూడురకాలు ఆవిమూల -మూర్తులు, పార్శ్వమూర్తులు, పరివారమూర్తులు. మూలమూర్తులు అంటే నిత్యపూజాకార్యక్రమాలలో తొలుత చలబేరత్వం కలిగి ఉన్నా, ఆవాహన ప్రాణ ప్రతిష్ఠల ద్వారా అచల బేరత్వం పొంది ఆధ్యాత్మిక శక్తికి మూలమైనవి పార్శ్వమూర్తులు వివిధదేవ, దేవతారూపాలకు సమీపవర్తులైనవి. ఉదాహరణకు గరుత్మంతుడు విష్ణుమూర్తికి, విఘ్నేశ్వర స్కందులు శివునికి పార్శ్వదేవతలు ఆయాదేవ, దేవీ ప్రాంగణాలలో వ్యవహరించే మూర్తులు పరివార మూర్తులు. జయవిజయులు విష్ణువునకు, వీరభద్ర, భైరవులు శివుడికి పరివారమూర్తులు

**1:2:1:** కాబట్టి, ప్రతిమా లక్షణ శాస్త్ర పరిధి మూల మూర్తులకు, పార్శ్వ మూర్తులకు, సంచార మూర్తులకు పరిమితమైంది. ఈ శాస్త్రంలో కేవలం మతాచారాలకు చెందిన ప్రజా మూర్తులకే ప్రాముఖ్యం ఉంది. లకులీశుడు మొదలైనవారు ప్రవక్తలేగాని మూలమూర్తులు కాదు.

**1:2:2:** పై రకం మూర్తులే భంగిమల దృష్ట్యా ఆసీన మూర్తులు, శయనమూర్తులు, ఉత్థానమూర్తులు అని మూడు రకాలకు చెందినవి. ఆసీనమూర్తులంటే కూర్చున్న భంగిమ కలవి వీనిలో పద్మాసనం, వీరాసనం, భద్రాసనం, సుఖాసనం, ఉత్కుటికాసనం, స్వస్తికాసనం, వజ్రాసనం, పర్యంకాసనం అర్థపర్యంకాసనం (వీని వివరాలకు పారిభాషిక పదకోశం చూడుడు) మొదలైనవి ఉన్నాయి. ఈ రకమైన ఆసనాలు- "కరచరణాది సంస్థానావిశేషం" అంటే, చేతులు, కాళ్ళు మొదలైనవానిని ఉంచే విధానానికి చెందినవని వ్యవహరించబడుతున్నాయి. అంతేకాక కూర్చొన్న పీఠం ఆధారంగా, అనంతాసనం, సింహాసనం, యోగాసనం, విమలాసనం, మంత్రాసనం, స్నానాసనం,అలంకారాసనం, భోజనాసనం, యాత్రాసనం, అని చెప్పబడ్డాయి. వీని వివరాలు 'సుప్రభేదాగమం', 'నారదీయసంహిత', 'ప్రశ్న సంహితలలో ఉన్నాయి. స్నానాసనం మొదలైనవి ఉపచారాసనాలు. ఇవి దేవునికి సేవచేసే విధాన్ని అనుసరించి ఉంటాయి

**1:2:2:1:** శయనమూర్తులు అంటే పవళించిన భంగిమలో గల అనంతశయనుడు మొదలైనవి.

**1:2:2:2:** ఉత్థాన మూర్తులు అంటే నిలబడిన మూర్తులు. వీనిలో ఐదు రకాలున్నాయి. అవి స్థానకమూర్తులు; ద్విభంగిమమూర్తులు; త్రిభంగిమ మూర్తులు, ఆలీఢమూర్తులు, నృత్యమూర్తులు స్థానకమూర్తి అంటే శరీరంలో ఏ రకమైన వంపు లేక సరిగా నిలబడి ఉండటం. ద్విభంగిమఅంటే కేవలం తల పాదాల దగ్గర వంపు ఉండటం. త్రిభంగిమ అంటే తల, కటి, పాదాల దగ్గర మూడు వంపులు ఉండటం నృత్యమూర్తులు అంటే లాస్యంగాని, తాండవంగాని నిర్వహించే మూర్తులు. లాస్యం అంటే సొగసయిన, శృంగార రసభరితమైన నాట్యం. తాండవం అంటే భీషణ భావాలను, రౌద్రస్ఫూర్తిని అందజేసే నాట్య విశేషణం ఇవి మాత్రమే కాక కొన్ని ధావన్మూర్తులున్నాయి 'ధావన్మూర్తి' అంటే పరుగెత్తుతున్నట్లు వ్యక్తం చేయబడినవి. ఇవి మొత్తం మీద అరుదైన శిల్పాలు. ఈ రకమైన మూర్తులన్నీ దేవాలయావరణాలలో ప్రతిమా రూపంగాగాని, శిల్ప రూపంగాగాని ఉంటాయి.

**1:3: పఠనావశ్యకత :**

ప్రతిమాలక్షణ శాస్త్రంలో వివిధ దేవతామూర్తులను గూర్చి చెప్పడం జరుగుతుంది. సాధారణంగా ఈ రకమైన సాంప్రదాయంలో మూడు భాగాలున్నాయి. అవి మంత్రం, తంత్రం, యంత్రం. మంత్రం అంటే ఆయాదేవతా మూర్తులను తలచివానికి అక్షర రూపం ఇచ్చేది. తంత్రం అంటే అక్షర రూపం ద్వారా తెలియవచ్చే దేవతా మూర్తులను ఆవాహన, ప్రాణ ప్రతిష్ఠ చేసే ప్రక్రియ మంత్రం కేవలం భావాత్మకమై ఉచ్చారణ రూపమైనది. కాగా, తంత్రం ప్రక్రియాత్మకమై లక్ష్యం లక్షణసమన్వయ సాధన పరమార్ధంగా కలిగినది. యంత్రం స్థానాత్మకమై ఆయా దేవతల ఆవాహన తరవాత, ప్రతిష్ఠాపన చేసేటపుడు అనువయినది. ఈ రకంగా మంత్రం, యంత్ర, తంత్రాల మధ్య సమన్వయం హైందవ, బౌద్ధ సాంప్రదాయాలలో ప్రధానంగా విలసిల్లింది. ఈ రకమైన అర్చన, ఆరాధన, భావన సాంప్రదాయాలు కేవలం వానిని అభివ్యక్తం చేసే ప్రతిమల ద్వారా తెలుసుకోవచ్చు ఇది ప్రతిమాలక్షణ శాస్త్రాన్ని చదవడం ద్వారా సాధించదగిన పరమప్రయోజనం. అంతే కాక, మతాచారాలలో అనేక కాలానుగుణమైన మార్పులు జరిగాయి. లకులీశుడు పాశుపత సాంప్రదాయాన్ని బోధించడం, బసవన్న వీరశైవ సాంప్రదాయం, బోధించడం ఉదాహరణలుగా చెప్పవచ్చు. ఈ రకమైన పరిణామం మతాచారాలలోనే కాక, ఆరాధనా మూర్తుల రూపాలలో కూడా పరిణామానికి అవకాశం కలిగించింది ఆ రకమైన మతపరమైన స్థానిక పరిణామాలు ఈ శాస్త్రం చదవడం ద్వారా తెలుసుకోవచ్చు.

**1:4: ఆధారాలు :**

ప్రతిమలను గూర్చి తెలుసుకోడానికి ప్రధానమైన ఆధారాలు ఆగమాలు. ఆగమం అంటే సమగ్రంగా ఏర్పరచబడి, సాంప్రదాయికంగా తెలియజేయబడిన జ్ఞానం. ఈ ఆగమాలు దేవతామూర్తుల పరంగా శైవాగమాలని, వైష్ణవాగమాలని, శాక్తేయాగమాలని, జైనాగమాలని, బౌద్ధాగమాలని ఐదురకాలు. ఈ ఆగమాలు, విషయం దృష్ట్యా, వైదికాలని, అవైదికాలని మరిరెండురకాలు. వైదికాగమాలు వేదప్రోక్తమైన అర్చనా విధానాన్ని సమర్థిస్తున్నాయి. అవైదికాగమాలు ఆ విధానాన్ని నిరసిస్తున్నాయి వీనిలో బౌద్ధ, జైనాగమాలు అవైదికాగమాలని వ్యవహారం.

**1:4:1 ఆగమతత్వం :**

సామాన్యంగా ఈ ఆగమాలన్నింటిలోను జ్ఞాన, యోగ, క్రియా, చర్యా పాదాలని నాలుగు భాగాలున్నాయి జ్ఞానం ఆయాదేవతల తత్వానికి చెందినది యోగం ఆధ్యాత్మిక సాధనలకు చెందినది. క్రియ మంత్ర, తంత్ర, యంత్రాలకు చెందినది. చర్య భక్తులదైనందిన జీవనానికి చెందినది.

**1:4:2:1: శైవాగమాలు :**

శైవాగమాలు ఇంచుమించు 125 పైన ఉన్నాయి . వీనిలో కొన్ని సౌమ్యాగమాలని, కొన్ని రౌద్రాగమాలని ఉన్నాయి

**1:4:2:1: సౌమ్యాగమాలు :**

ఇవన్నీ శివుని చేత తన రూపాలయిన ప్రణవుడు, సుధుడు, దిప్రుడు, కరణుడు, సంశివుడు,

ఈశుడు, సూక్ష్ముడు, కాళుడు, దిశేశుడు అనేవారి అంశాలకు చెందినవిగా చెప్పబడ్డాయి. అవి కామికాగమం, యగాజాగమం, అచింత్యాగమం, కారణాగమం, దీప్తాగమం, సూక్ష్మాగమం, సహస్రాగమం, సుప్రభేదాగమం, అంశుమద్భేదాగమం అనేవి అనగా సౌమ్యాగమాలు శివుని అంశతత్వాన్ని మాత్రమే వివరిస్తాయి.

**1:4:2:2: రౌద్రాగమాలు :**

ఇవి స్వయంగా శివుడు ఉపదేశించినవి ఈ ఉపదేశాన్ని పదునెన్మిది (18) మంది రుద్రులు పొందారు. వారు అనాది, దశార్ణ, నిధాన, వ్యోమ, తేజ, బ్రహ్మేశ, శివ, సర్వాత్మ, అనంత, ప్రశాంత, శూలి, ఆలయ, బిందు, శివనిష్ఠ, సోమదేవ, శ్రీదేవ, దేవతార్క్ష్య, శివేశ అనే పేర్లు గలవాళ్ళు. రౌద్రాగమాలలో ముఖ్యమైనవి విజయాగమం; నిశ్వాసతంత్రం, స్వాయంభువాగమం, అనలాగమం, వీరాగమం, రౌరవాగమం, మకుటాగమం, విమలాగమం, చంద్రజ్ఞానాగమం, సిద్ధాగమం, సంతానతంత్రం, నృసింహతంత్రం, పరమేశ్వర తంత్రం, కిరణాగమం, వాతులాగమం, అనేవి ఇవి కాక మరి కొన్ని సంహితలు కూడా ఉన్నాయి.

**1:4:2:2:1** ఈ రెండు రకాలైన సౌమ్య, రౌద్రాగమాలు శివుని మూడు శిరస్సులయిన శివ, సదాశివ, మహేశ రూపాలను సూచిస్తాయి. అంతే కాక సదారూపియైన శివుని అమూర్తిగాను, మూర్తిగాను, కర్తృభావంగాను తెలియచేస్తాయి.

**1:4:3: వైష్ణవాగమాలు :**

వైష్ణవాగమాలలో వైఖానసాగమం, పాంచరాత్రాగమం అనే రెండు ముఖ్యమైనవి

**1:4:3:1: వైఖానసాగమం :**

ఇది అతిప్రాచీనమైంది. దీనిని విఖనసుడు అనే ఋషి చెప్పడం వల్ల వైఖానసాగమం అనే పేరు వచ్చింది. దీనిలో తాంత్రిక, వైదిక మార్గాల అను సంధానత్వం ఉంది ఇది మూర్తిమంతుడైన విష్ణుని ప్రధానమూర్తిగా పూజిస్తూ యజుర్వేదంలో యజ్ఞాధికారంలో ఎంతో ప్రాశస్త్యాన్ని పొందింది ఈ ఆగమంలోని అంశాలను మరీచి, భృగువు, అత్రి, కాశ్యపుడు అనే నలుగురు ఋషులు బోధించారు. ఇవి కేవలం క్రియా బంధాన్ని మాత్రం కలిగిఉన్నాయి వీనిలో జ్ఞాన, యోగ భావాలు లేవు ఈ ఆగమంలో సమూర్తారాధన (విష్ణువును రూపంతో పూజించడం), అమూర్తారాధన (విష్ణువును రూపం లేకుండా పూజించడం) అనే రెండింటిని చెప్పడం జరిగింది. అమూర్తిగా విష్ణుని కుంభ, మండల, హోమాగ్ని, బిందు రూపాలలో పూజిస్తారు. కాని సమూర్తారాధనే ప్రశస్తమైనదని వారి భావం

**1:4:3:2: పాంచరాత్రాగమం :**

ఈ ఆగమం విష్ణువు ఔన్నత్యాన్ని ప్రతిపాదిస్తుంది ఈశ్వరసంహిత, విహగేంద్రసంహిత, నారదపాంచరాత్రం, పాంచరాత్రరాక్షసం అనే వివిధ సంహితలు ఈ ఆగమంలోని వైరుధ్యాలను సూచిస్తున్నాయి ఈ సంహితలు దివ్యం, ఆర్షం, మానుషం అని మూడు రకాలు. దివ్యాలు అంటే భగవంతుడు స్వయంగా చెప్పినవి ఆర్షాలు ఋషులు చెప్పినవి. మానుషాలు మనుష్యులు

ప్రవచించినవి. ఈ ఆగమాలలో జ్ఞాన, యోగ, క్రియా, చర్యా, పాదాలుసూచితమైనాయి.

**1:4:4: శాక్తేయాగమాలు :**

శాక్తేయాగమాలు శక్తిని గూర్చి తెలియబరుస్తాయి. శివుడు, శక్తి అభేదాలని, లయకారకుడైన శివుడు తన కార్యక్రమాలను కేవలం శక్తితో కలవడం వల్లనే నిర్వహిస్తాడని శాక్తేయ సాంప్రదాయంలో శక్తి ఔన్నత్యం సూచించడం జరిగింది అటువంటి ప్రక్రియల్లోనే 'భవతారిణి కాళి' (యీ మూర్తి కలకత్తా వద్దగల దక్షిణేశ్వరంలో ఉన్నట్లు చిరంతనానందవారు తెల్పారు) మొదలైన శక్తిరూపాలు చెప్పబడ్డాయి ఈ రకమైన రూపాలు తంత్ర ప్రోక్తాలు శైవాగమం, దేవ్యాగమం, వాతులాగమం, వీరశైవాగమాలలో శక్తి సాంప్రదాయం సూచించడం జరిగినా, శైవసిద్ధాంతాలలో శక్తి సాంప్రదాయం సూచించడం జరిగినా శైవసిద్ధాంతంలో ప్రత్యేకించి శక్తికి ప్రాశస్త్యం ఇవ్వడం జరుగలేదు. కాని అధర్వ వేదంలోని 'సౌభాగ్య కాండం' మొదలైనవి శక్తి ప్రాశస్త్యాన్ని చెప్పాయి తర వాతి కాలంలో తంత్ర గ్రంధాలయిన రుండమాలా తంత్రం మొదలైనవి స్త్రీకి, జగజ్జనని ఐన శక్తికి గల ప్రాధాన్యతను ఉటంకిస్తున్నాయి. ఇంచుమించు 327 శాక్తేయగమాలు సూచితమైనాయి. శక్తిని మంత్ర శక్తి, కుండలినీశక్తి, విద్యాశక్తి అని మూడు రకాలుగా ఆరాధించడం జరుగుతున్నది. ప్రతిమలకు చెందిన శక్తిని విద్యాశక్తి అంటారు

**1:4:5: శిల్పశాస్త్ర, వాస్తు శాస్త్ర గ్రంధాలు :**

పైన చెప్పిన ఆగమాలు మాత్రం కాక ప్రతిమాలక్షణాలను గూర్చి అనేక శిల్ప శాస్త్ర వాస్తు శాస్త్రగ్రంధాలు చెపుతున్నాయి. వానిలో "అపరాజితపృచ్ఛ", "మానసోల్లాసం', "అంశుమద్భేదాగమం," "రూపమండనం," "విష్ణుధర్మోత్తరపురాణం," "శిల్పరత్నం", ఈశాన గురుదేవ పద్ధతి" ముఖ్యమైనవి.

**1:4:5:1:** ఈ రకాలైన ఆధారాలు వివిధ దేవ, దేవతామూర్తుల లక్షణాలను తెలుపుతున్నాయి ఇవన్నీ ప్రాధమికమైనవి అదేవిధంగా వేర్వేరు దేవాలయాలలోని ప్రతిమ, శిల్ప రూపాలను ఉదాహరించడం ద్వారా సిద్ధాంతానికి వ్యవహారానికి గల దగ్గరతనాన్ని లేదా దూరాన్ని తెలుసుకోగలం ఈ రకంగా వ్యవహారంలోగల ప్రతిమారూపాలన్నింటినీ కూడా మనం ప్రాథమికాధారాలుగా నే వ్యవహరించాలి.

**1:5: శిల్పానికి ప్రతిమాలక్షణాశాస్త్రానికి గల భేదం :**

ప్రతిమలన్నీ శిల్పాలే. కాని, శిల్పాలన్నీ ప్రతిమలు కావు. శిల్పాలలో ప్రధానంగా స్థల, రూప, భావాలనే మూడు అంశాలమధ్య సమన్వయం చూడగలం కాని ప్రతిమలలో స్థలం అనే అంశం ప్రముఖమైంది కాదు. అవి కేవలం ప్రధానంగా రూప భావ సమన్వయం కలవి. కాని ప్రతిమలలో పొడుగు, వెడల్పు మందం అనే మూడు అంశాలుండి అవి వైయక్తికత్వాన్ని కలిగి ఉండటానికి వీలుంది. కాని శిల్పాలు విడిగా వ్యవహరించబడడానికి అవకాశంలేదు. ప్రతిమలన్నీ కేవలం మతాచారాలకి చెందినవి కాని శిల్పాలు మతేతరమైన, లౌకిక, ప్రాకృతికాంశాలను కూడా సమన్వయపరుస్తాయి. శిల్పాలలో శిల్పికి స్వేచ్ఛ ఉంటుంది. అతడు శిల్పాన్ని తీర్చి దిద్దడంలో

కాని, శిల్ప సందర్భాన్ని అలంకరించడంలో కాని సంపూర్ణమైన అధికారం కలిగి ఉంటాడు. కాని ప్రతిమ ఏరకమైన స్వేచ్ఛను శిల్పికి ఇవ్వదు. అతడు సాంప్రదాయంలో ఇదమిద్ధంగా( ఇదం-ఇత్థం: ఇది ఇది అని ) చెప్పబడ్డ రూపాన్ని యధాతధంగా శిలలో అనువదించాలి. శిల్పాలలో ఆలంకారికమైనవి, కధాకథనపరమైనవి అనే రెండు ప్రధాన రకాలున్నాయి కుంభపంజరాలు, లతాలతికాది అలంకరణలు, యాళులు (వరుసలుగా చెక్కిన జంతు, పక్షి, మానవ శిల్పాలు), అప్సరసలు మొదలైనవి ఆలంకారికమైనవి వివిధ భక్తుల వృత్తాంతాలు, పౌరాణికమైన గాధలు మొదలైనవి చెప్పే శిల్పాలు కథాకథన పరమైనవి. కాని ప్రతిమలలో ఈ రకమైన వైవిధ్యంలేదు ప్రతిమలన్నీ ఏకీకృత మతాత్మకసాంప్రదాయానికి గుర్తులు కాగా, శిల్పాలన్నీ అభివ్యక్తం చేయబడ్డ శిల్పి ప్రతిభా విశేషాలకు గుర్తులు. శిల్పాలలో మనం కళాత్మకమైన పరిణామాలను, విపర్యయాలను చూడగలం. కాని, ప్రతిమలలో అది అసాధ్యం శిల్పాలు కావ్యాల వంటివి ఏ విధంగా కావ్యం కాంతాసమ్మితమని చెప్పబడి వ్యంగ్య వైభవాన్ని కలిగి ఉంటుందో, శిల్పంలో శిల్పి తన చాతుర్యంతో శిలలో వ్యంగ్య భావానికి స్ఫూర్తినిస్తాడు. కాని మతాలకు గుర్తులైన ప్రతిమలు వేదాల వంటివి. ఏ రకంగా వేదాలు ప్రభుసమ్మితాలని చెప్పడం జరిగిందో, ఆ రకంగా ఆగమాలలోను, పురాణాలలోను చెప్పిన ప్రతిమా లక్షణాలు తిరస్కరించడానికి గాని, వక్రీకరించడానికిగాని, ధిక్కరించడానికిగాని అవకాశంలేదు.

## 1:6: ప్రతిమాలక్షణ శాస్త్రానికి, ఇతర శాస్త్రాలకు గల సంబంధం :

**1:6:1** ప్రతిమాలక్షణ శాస్త్రం ప్రధానంగా దేవాలయ వాస్తువుతోను, చిత్రలేఖనంతోను సంబంధం కలది. ప్రతిమలను గూర్చి చెప్పే విష్ణుధర్మోత్తర పురాణం చిత్రలేఖన విధానాలను గూడ వివరించింది. చిత్రలేఖనంలో వర్ణాలను, రేఖలను, పరిమాణాన్ని సమన్వయపరచి చిత్రకారుడు భావాన్ని ఉద్దీపింప చేస్తాడు ఈ రకమైన భావోద్దీపకత కేవలం ప్రతిమలలో కష్టసాధ్యం. ప్రతిమలలో చెప్పబడిన అనుగ్రహమూర్తులు, ఘోరమూర్తులు మొదలైనవిచిత్రకారుని కుంచెలో ప్రాణం పోసికొని నాన్యతోసాధ్యమైన (ఇంకొక విధంగా సాధించలేని) రీతిలో భావాలను వెలువరిస్తాయి. ఈ రకమైన భావపరిణామం సంపూర్ణతను పొందడానికిచిత్రలేఖకుడుప్రతిమాలక్షణం లోని రహస్యాలను, స్వారస్యాలను గమనించాలి.

**1:6:2** అదే విధంగా దేవాలయ వాస్తువులో ప్రతిమాలక్షణం ప్రాముఖ్యత గొప్పగా చెప్పదగింది. ఐదు ఆవరణలతోను, ఏడు ఆవరణలతోను గల వేర్వేరు దేవాలయంలో వివిధ మూర్తులను ఉంచడం జరిగింది. ఈ రకమైన మూర్తులు అన్నీ మూల మూర్తి అంశభావంగా పరిణమించే దేవాలయంలో గల ఆగమ ప్రోక్తమైన శక్తిని ఇబ్బడి ముబ్బడిగా (రెండింతలు, మూడింతలుగా) చేస్తాయి. అంతేకాక శిల్పులు అనుసరించే ఆలంకారిక శిల్పంలో మత శిల్పం అతి ప్రధానమైంది. మత శిల్పం అంతా కేవలం ప్రతిమాలక్షణ శాస్త్రం ఆధారంగా కలదే. ప్రతిమల స్వరూపస్వభావాలన్నీ చరిత్ర గతిలో వేర్వేరు దశలలో పరిణామాన్ని పొందాయి ఆ పరిణామం దేవాలయ వాస్తుపరిణామంతో సరిగా ఉంటుంది.

•••

# 2.

# భారతీయ ప్రతిమా పరిణామం —ఒక విశ్లేషణ

## 2:1: ప్రతిమా రూపాలు

**2:1:1:** ప్రతిమాలక్షణ శాస్త్రంలో చెప్పిన ప్రతిమలన్నీ ఏదో ఒక రూపాన్ని కలిగినవే. ఆ రూపం పురుష రూపంగాని, స్త్రీ రూపంగాని, మిశ్ర రూపంగాని కావచ్చు. ఈ రకమై రూపాలనే మూర్తి అని కూడా అంటారు. ఈ రకమైన మూర్తులతో పాటు జంతువులు, పక్షులు, సరీసృపాలు మొదలైనవి కూడా ఉండవచ్చు.

**2:1:2:** దీనికి ప్రధాన కార్ణం ప్రతిమలు ఏ రకంగా ఏర్పడుతున్నాయో తెలుసుకోవడం ద్వారా అర్థం అవుతుంది ఈ ప్రతిమలు మట్టితో కాని (మృణ్మయ మూర్తులు), కొయ్యతోగాని (దారుమయ మూర్తులు) రాతితోగాని (శిలామయమూర్తులు), బంగారం, వెండి, రాగి, కంచు, పంచలోహాలు (లోహమూర్తులు) మొదలైనవానితో కాని చేయడం జరుగుతోంది. ఈ రకమైన రూపాలన్నీ ఏర్పడడానికి ఒక విధానం ఉంది

## 2:2: ప్రతిమాపరిణామం పై తొలి సాహిత్యాధారాలు :

**2:2:1:** పతంజలి తన 'యోగసూత్రాలలో' తాను చూసిన మూర్తిని లేదా మానవుని లేదా జంతువుల, వృక్షాల స్వభావ సహితమైన రూపాన్ని మనసులో నిల్పుకోవడాన్ని యోగం అని వివరించాడు. ఈ రకంగా నిల్పుకోవడాన్ని ధారణ అంటారు అంటే కళ్ళ ద్వారా గాని, ఇతర జ్ఞానేంద్రియాల ద్వారా గాని గ్రహించిన దానిని ఏ మార్పు లేకుండా తన శరీరంలో గాని, మనసులోగాని ఉంచుకోవడం. పతంజలివాడిన "యోగానుశాసనం" .అనే మాటల ద్వారా ఈ విధానం కేవలం పతంజలి ఏర్పరచింది కాదని, అది కేవలం అనుసరణగా రూపొందిన అనుశాసనం మాత్రమేనని తెలుస్తుంది ఈ యోగం అనే సాంప్రదాయాన్ని పతంజలికి ముందుగానే హిరణ్యగర్భుడు, వార్షగణ్యుడు, యజ్ఞ వల్క్యుడు మొదలైన వేదాంత వేత్తలంతా సూచించినట్లు తెలుస్తుంది. పతంజలి క్రీ పూ. 2 వ శతాబ్దానికి చెందినవాడిగా పరిగణిస్తున్నారు. అంటే మిగిలినవారు క్రీ.పూ. 2శతాబ్దం కన్నా ముందు వారేననీ, యోగసాంప్రదాయం కూడా 2వ శతాబ్దికన్న ముందుగా ఏర్పడ్డదేనని తెలుస్తుంది కాని ఎంతముందుగా యోగం ఆచారణీయంగా రూపొందిందో తెలుసుకోవడానికి ఇదమిత్థమైన ఆధారాలులేవు.

**2:2:2:** కాని వ్యాకరణవేత్తలయిన పాణిని తన "అష్టాధ్యాయి"లో 'ప్రతికృతి' అనే మాటను ఉపయోగించాడు 'ప్రతికృతి అంటే బదులుగా చేయడం. దీనిలో 'కృతి' అనే మాట "కృకరణే", చేయడం లో అనే ధాతువునుంచి ఆవిర్భవించగా, ప్రతిఅనే ఉపసర్గవల్ల తిరిగి అని కాని, బదులుగా అని కాని, అర్థం వస్తుంది. అంటే తాను చూసిన, విన్న, గ్రహించిన ఏ రూపాన్నయినా

మనసులోగాని, మాటలలోగాని తీర్చిదిద్దడం ప్రతికృతి మాటలలోని వర్ణననేమనం 'మంత్రం' అనే దాని ద్వారా సూచించగా, మనసులోని 'ప్రతికృతి' సాధించడానికి మార్గం 'యోగం'.

**2:2:2:1:** ప్రతిమలన్నీ ప్రతికృతులే అయినా ప్రతికృతులన్నీ ప్రతిమలుకావు. ఎందువల్లనంటే, ప్రతిమ ప్రధానంగా భౌతిక రూపంద్వారా గాని, మాధ్యమం ద్వారాగాని ఒక రూపాన్ని చూపడం. కాని ప్రతికృతి మంత్రాలలోవలె అక్షర రూపంలోగాని, యోగంలోవలె స్ఫూర్తిరూపంలోగాని ఉంటుంది కాని ప్రతిమకు పూర్తిగా భౌతికలక్షణాలుంటాయి.

## 2:3: తొలిపురావస్త్వాధారాలు :

**2:3:1:** భారతీయ సాంప్రదాయంలో ఋగ్వేదంలో ఏరకమైన ప్రతిమలకు నిరూపణ జరగలేదు. కాని పురుషసూక్తం మొదలైన వాని ద్వారా అక్షరపరమైన రూపకల్పన కన్పిస్తుంది. పురావస్త్వాధారాలన్నీ తొలిదశలో ఋగ్వేద కాలంకన్నా ముందరివే సింధునాగరికత కాలంలో ప్రతిమలను పోలిన ప్రతికృతులను చూడగలం. మట్టిని తడిపి, ఒకానొక ఆకారంలో ముద్దగా చేసి, కాల్చిన ముద్రలపై కన్పిస్తున్న పశుపతి అనే రూపం ప్రతికృతులను సూచించడంలో గొప్పది కాగా కంచుతో చేసిన నాట్యగత్తె బొమ్మ ప్రతిమలలో తొలిది

**2:3:2:** కాలమానం ప్రకారంగా ఈ రకమైన ప్రతిమలను, ప్రతికృతులను ఏర్పరచడం ఎంతముందరిది అనే ప్రశ్న సహజంగా తలెత్తగలదు సింధు నాగరకతాకాలాన్ని క్రీ.పూ. 2,700-1,500 మధ్య నిర్ణయించడం జరిగింది దీనికి ముందుగా కొన్ని చోట్ల దీనికి సమకాలీనంగా దక్కనులోను, అనేక ఆధారాలున్నాయి. ఇది కొత్త రాతియుగపు నాగరికత ఉనికిపట్లలోను, వాటిముందుగా పాతరాతియుగం తుది దశలలోను దొరుకుతున్నాయి

**2:3:3:** ఆ ఆధారాలు ఎక్కువగా కొండగుహలలోగాని, కొండ చరియలవద్దగల 'రాక్ షెల్టర్ (Rock-Shelter) లలో గాని లభ్యమవుతున్నప్పుడు అక్కడ గోడలమీద, కప్పులమీద రంగులతో చిత్రించబడ్డ జింకలు, దుప్పులు, ఎద్దులు, ఆవులు మొదలైన అనేక జంతువుల ప్రతికృతులన్నీ కనిపిస్తున్నాయి ఈ రకమైన ప్రతికృతులన్నీ ఇదమిత్థమైన ప్రయోజనం కలిగినవి కానందువల్ల, ఎక్కువ మంది శాస్త్రజ్ఞులు తమ విశ్లేషణలలో లౌకిక ప్రయోజనాన్ని సూచిస్తున్నారు. కాని ప్రతిమలన్నీ మతపరమైన ప్రయోజనం కలవే. దీని దృష్ట్యా ప్రతిమలకు, ప్రతికృతులకు గల ప్రధానమైన బేధంవ్యక్తమవుతున్నది. ప్రతిమలన్నీ కేవలం మతపరమైన ప్రాముఖ్యతను కలిగిఉండగా, ప్రతికృతులు మతపరమైనవేకాక, లౌకికమైన ప్రాముఖ్యతను కూడా కలిగి ఉన్నాయి.

## 2:4: బౌద్ధులలో ప్రతిమల పరిణామం :

**2:4:1:** భారతదేశంలో మత పరమైన ప్రాముఖ్యంగల ప్రతిమలను మనం బౌద్ధసాంప్రదాయాలలో కూడా చూడగలం. బౌద్ధయుగంలో తొలుత హీనాయాన మతం వ్యాప్తిలోకి రాగా, బుద్ధుణ్ణి ఆరాధించడం, బుద్ధుని మహాపరినిర్వాణం తరువాత బుద్ధునికి చెందిన శారీరక(శరీరానికి చెందినవి) పారిభోజిక (బుద్ధుడు ఉపయోగించిన పాదుకలు వంటివి), ఔద్దేశిక (బుద్ధుని సూచించే ఏనుగు, సింహం, ధర్మచక్రం వంటివి) అవశేషాలను పూజించడం జరిగింది ఈమూడు అవశేషాల ఆరాధన ప్రతిమాసాంప్రదాయానికి ఏమాత్రం చెందింది కాదు.

**2:4:2:** ఈ యుగంలో, మౌర్యవంశపు రాజయిన అశోకుని కాలంలో ఏర్పరచిన లౌరియానందన్‌ఘర్ మొదలయిన చోట్ల గల యక్షిణుల శిల్పాలను ప్రత్యక్షమైన ప్రతిమామూర్తులు అనడానికి అవకాశం తక్కువ

**2:4:3:** కాని, మహాయాన కాలంలో కుషాణుల వంశానికి చెందిన కనిష్కుని కాలంలో అభివృద్ధి పొందిన గాంధార కళలో ప్రప్రథమంగా బౌద్ధ దేవతా ప్రతిమలను తీర్చి దిద్దడం జరిగింది. ఈ గాంధార కళ తక్షశిల కేంద్రంగాను, మధుర కేంద్రంగాను రెండు సాంప్రదాయాలుగా రూపొందింది. దీనిలో తక్షశిల సాంప్రదాయంలో బౌద్ధ ప్రతిమలు బుద్ధుని గొప్పవాడుగా తీర్చిదిద్దడానికి గ్రీక్-రోమన్ సాంప్రదాయాలలోని ప్రమాణాలను ఆధారంగా చేసుకొన్నారు అందువల్లనే ఆ ప్రతిమలలో బుద్ధుని శారీరక పరమైన ఔన్నత్యానికి ప్రాముఖ్యం ఇవ్వడం జరిగింది. ఆ తరువాత, మధుర సాంప్రదాయానికి చెందిన బౌద్ధ మూర్తులలో జీవ కారుణ్యం, సాత్త్వికత రూపుదిద్దుకొన్న ఒక మహాప్రవక్తలోని గొప్పదనాన్ని చూపడం జరిగింది. ఈ రకమైన మహాయాన ప్రతిమా పరిణామ దశలో ఏర్పడ్డ ప్రతిమలు బుద్ధుని గొప్పదనాన్ని ప్రవక్తగా మాత్రం సూచించాయి.

**2:4:4:** బుద్ధుని ప్రతిమలను ఒకదశగా పరిగణిస్తే ఆ తరువాత కాలంలో శివుడు, విష్ణువు మొదలయిన దేవతా ప్రతిమలెన్నో వచ్చాయి. బౌద్ధ ప్రతిమలకు, తరువాత వచ్చిన ప్రతిమల కు ఒక తేడా ఉంది. బుద్ధుడు ఒక ప్రవక్త అయినా, అతడు మానవుడే, కేవలం మానవుడే అనే సూచన ఆ ప్రతిమలలో వ్యక్తమవుతుంది. కాని, శివుడు, విష్ణువు వంటి వారి ప్రతిమల్లో ఏ కోశానా వారు మానవులే అనే భావన లేదు వాళ్లకు గల ఎక్కువ చేతులు, తలలు, కళ్ళు వంటివి ఆ మూర్తులకు గల దివ్యత్వాన్నే కాక, ఆధి, భౌతిక, ఆతీంద్రియ శక్తులనుకూడా సూచిస్తున్నాయి.

## 2:5: ప్రతిమలలో భావ పరిణామం :

**2:5:1:** ఈ సందర్భంగా సామాన్యంగా తలయెత్తే ప్రశ్న : కేవలం మానవుడే అనే భావననుంచి దివ్యత్వంతప్ప ఇంకేమీ కాదు అనే భావనకు ఏ పరిస్థితులు దోహదం చేశాయో గ్రహించాలి ఆ పరిస్థితులే ప్రతిమా పరిణామంలో అనేక రూపాల అవతరణకు దోహదం చేశాయి.

## 2:5:1: ప్రతిమలలో మత పరిణామాలు :

మత పరిణామాలను పరిశీలిస్తే తొలిదశలో సంకేతాత్మకమైన మతాలే ఉండేవి. వీనినే ఇంగ్లీషులో టోటెమిక్ (Totemic) మతాలు అంటారు టోటెమ్ (Totem) అంటే గుర్తు, అంటే ఒక ప్రాంతంలో నివసించే మానవులు తమలోని బలహీనతలను మాపుకొని, గొప్పదనాన్ని పెంచుకోవడానికి గుర్తులుగా అనేక సాంప్రదాయాలు పెంచుకున్నారు. అలాటివాటిలోనే ఉదాహరణలుగా మనం భ్రమరం (తుమ్మెద) ద్వారా సూచింపబడిన భ్రమరాంబ, ఇంగిలీకం అనే చెట్టు ద్వార సూచింపబడిన హింగుళాంబ వంటి వానిని చెప్పవచ్చు. దీనికి తోడుగా, అభివృద్ధి పొందినది. జంత్వారాధాన. ఈ రకమైన జంత్వారాధననే ఇంగ్లీషులో ఏనిమిజం అనీ, జుమార్ఫిజం అని అంటారు. వేర్వేరు తెగలు తమకు గల మతభావాలను జంతువుల ద్వారా సూచించారు. ఆవు, నంది, ఏనుగు, సింహం వంటి జంతువులు వేర్వేరు స్థాయిలలో ప్రధానమైన జంతు పరమైన సంకేతాలుగా ఉండి, మానవుని పోలిన దేవతా ప్రతిమలు ఏర్పడేనాటికి ఆజంతువులన్నీ

వాహనాలుగా మారి ఉంటాయనే ఆలోచన ఏ మాత్రం అతిశయోక్తి అవదు. మూడవ దశ చెట్లు, జంతువుల తరువాత, ప్రకృతి శక్తుల ఆరాధనకు చెందినవి. ఆ ప్రకృతి శక్తుల ఆరాధనలోని తొలిదశ మనం భారతదేశంలో ఋగ్వేద కాలంలో చూడగలం. "అగ్నిం మిత్రం యమంవరుణమాహురథోస సుపర్ణో గరుత్మాన్, ఏకం సద్వి ప్రాబహుధావదం త్యగ్నిం మిత్రం యమం వరుణ మాతరిశ్వానమాహుః" (అగ్ని, మిత్రుడు, యముడు, వరణుడు, సుపర్ణుడు, గరుత్మంతుడు అనే వేర్వేరు పేర్లతో పిలువబడిన అతడు ఒక్కడే. ఈ రకంగా అనేకంగా చూపబడ్డ వేర్వేరు మూర్తులుగా ఒక్కడే అయిన అగ్ని మిత్ర, యమవరుణులను ఆహ్వానించుచున్నాం) వరుణుడు, గరుత్మంతుడు వీరందరూ నిప్పును, సూర్యుని, చావును , నీటిని, వేగవంతమైన పక్షులను పూజించడం అనే ఆచారం ఉందని సూచిస్తున్నారు అంతేగాక నిప్పు , ఎండ, చావు, నీరు (వరదలు) పక్షులు మొదలైవన్నీ లొంగనివి, అదుపులో ఉండనివి, భయంకలిగించేవి,అందువల్లనే వీటన్నిటికి ఆనాటి మానవులు భయ పడ్డారు. వీటన్నిటినీ కేవలం ఒక విరాట్పురుషునికి మాధ్యమంగా భావించి, ఆవిరాట్పురుషుని వేయి తలలతోను, వేయి కన్నుల తోను, వేయి పాదాలతోను (సహస్ర శీర్షాపురుషః సహస్రాక్షః సహస్రపాత్) అని పురుష సూక్తంలో వర్ణించడం జరిగింది. ఈ రకమైన ప్రతి కృతిని పోలిన వర్ణనే మనం ప్రతిమా పరిణామంలో పౌరుషేయమైన (మానవులను పోలిన) రూపాలను ఇవ్వడానికి తొలి యత్నంగా చూడవచ్చు.

**2:5:1:2:** అదే విధంగా, కుషాణుల కాలానికి ముందుగా గల శాసనాలలో కొన్ని ఉదాహరణలు చూడగలం. నాగనికమహారాణి నానేఘాట్ శాసనంలో "యమవరుణ కుబేర వాసవానాం చ త్రితుణ్ణంచలో కపాలానాంఖంధ సూరానాం మహిమావతానం" అని వర్ణించడంలో లోకపాలు రయిన యముడు, వరుణుడు, కుబేరుడు, వాసవుడు (ఇంద్రుడు) అను వారిని, మహిమతో కూడిన సూర్యచంద్రులను గుర్తింపవచ్చు.

**2:5:1:3:** ఈ రకంగా వైదిక వాఙ్మయంలోను, హైందవ (ఇది వైదిక మతానికి పర్యాయపదంగా సమకాలీన రచనలు ఎక్కువగా వాడుతున్న శబ్దం) మతానుయాయులకు చెందిన శాసనాలలోను, వైవిధ్యంగల దేవ దేవ తామూర్తులను, వివిధ ప్రకృతి శక్తులను చూపడం జరిగింది.

**2:5:1:4:** కాని, సంపూర్ణ ప్రతిమా రూపాలు బౌద్ధ యుగంలో మాత్రం ముందుగా లభ్యం కావడం వల్ల, వారి మూర్తులలో మానవత్వాన్ని, భావాలలో ప్రవక్తలకు సమానమైన జీవకారుణ్య భావాన్ని చూపగలిగారు. కాని, దివ్యమయిన శక్తిమత్వానికి బౌద్ధ జైన ప్రతిమలలో మెండైన ఆధారాలు లేవు. హైందవ మత వ్యాప్తితో పాటే వివిధ దేవ, దేవతా మూర్తులకు చెందినపౌరుషేయమైన భావన వారి స్వభావానుగుణమైన రూపురేఖలను ప్రతిమా పూర్వకంగా చూపడానికి తోడ్పడింది

**2:5:1:5:** శక్తిని విద్యాశక్తిగాను, ధనశక్తిగాను, పరాశక్తిగాను చేసి సరస్వతి, లక్ష్మి. పార్వతులను చూపడం జరిగింది. అదేవిధంగా సృష్టి, స్థితి, లయ కారక స్వభావాలను బ్రహ్మ, విష్ణు మహేశ్వర రూపాలలో చూపడం జరిగింది. అదేకాక, వివిధ దేవతామూర్తులకు పార్శ్వ, పరివార దేవతలను ఏర్పరచడం జరిగింది. జయుడు, విజయుడు, విష్వక్సేనుడు, నారదుడు విష్ణువునకు పరివార దేవతలు కాగా, లక్ష్మి, గరుత్మంతుడు పార్శ్వ దేవతలు. శివునకు నంది, భృంగి, భైరవుడు, వీర

భద్రుడు, పరివార దేవతలు కాగా, పార్వతి, గణపతి, స్కందుడు (కుమారస్వామి) పార్శ్వ దేవతలు.

**2:5:1:6:** అంతేగాక, శాక్తేయ సాంప్రదాయాలలో శక్తిని మూల విరాట్టుగా అర్చిస్తూ, సప్తమాతృకలలో చండి, కాళి, భైరవి, చాముండి మొదలైన మూర్తులను పార్శ్వ, పరివార దేవతలుగా తీర్చి దిద్దడం జరిగింది.

**2:5:1:7:** ఈ రకమైన ప్రమాణాలతో కూడుకున్న పరిణామాలన్నీ ప్రధానంగా శివుడికి, విష్ణువుకు, శక్తికి జగద్రక్ష కర్త్వానికి, జగత్ సృష్టికి, జగద్వినాశనానికి సంబంధించిన రూపాలే. అందువల్లనే ఈ రకమైన రూపాలలో సంహారమూర్తులలో క్రౌర్యాన్ని, కల్యాణ మూర్తులలో రజోభావాన్ని, జ్ఞాన మూర్తులలో సత్త్వభావాన్ని చూడగలం.

**2:5:1:8:** ఈ ప్రతిమా పరిణామాన్ని వేద, పురాణేతిహాసాలు మాత్రమే కాక వివిధ ఆగమాలు అభివర్ణించాయి. (చూ. 1 వ అధ్యాయంలో ఆగమాలు-వివరాలకు) ఈ ఆగమాలన్నీ వివిధ మూర్తులకు మూర్తి మత్వాన్ని కలిగించగా, ఆచరణలలో అనేక మూర్తులు ఏర్పడ్డాయి. చారిత్రక పరమైన గతంగల అన్ని హిందూ దేవాలయాలలోను అనేకమూర్తులను చూడగలం.

**2:5:1:9:** మొత్తం ప్రతిమలను, హైందవ సాంప్రదాయం ప్రకారం, శివుని మూర్తులు, విష్ణుని మూర్తులు, శక్తిమూర్తులు, పార్శ్వ పరివార దేవతలు అని వర్గీకరించవచ్చు. అదేవిధంగా బౌద్ధ జైన సాంప్రదాయాలకు చెందిన ప్రతిమా మూర్తులను హైందవేతర సాంప్రదాయ పరంగా వర్గీకరించవచ్చు వీని మొత్తం సమీక్షయే భారతీయ ప్రతిమల పరిశీలన.

●●●

# 3.

# హైందవ ప్రతిమలు – విష్ణువు

## 3:1: ఉపోద్ఘాతం

**3:1:1:** భారతదేశ ప్రతిమ పరిణామంలో తరువాతవే అయినా, బౌద్ధ ప్రతిమలకన్న హైందవ ప్రతిమలే ఎక్కువ జనాదరణను, పరివ్యాప్తిని పొందినవి. వేర్వేరు దేవాలయాలు, వివిధ శాసన శ్లోకాలు ఈ రకమైన ప్రతిమల స్వరూపాన్ని వర్ణించి వానికి గల చారిత్రక పరమైన గతాన్ని రుజువు చేస్తున్నాయి.

**3:1:2:** హిందు వులలో తప్పు చేస్తే, రామ, రామ అనుకోనివాడు, ఏ చిన్న పూజాపురస్కారం చేసినా కేశవ నామాలు చెప్పుకోని వాడు కొంచెం సాంప్రదాయం తెలిసినవాడు భారతదేశంలో అరుదు అని చెప్పవచ్చు. ఇవన్నీ సర్వవ్యాపి అయిన (విష్ణువు) జ్ఞానాత్మకుడైన (నారాయణుడు) ఉద్ధర ణాత్మకుడైన (ఆదివరాహమూర్తి), సత్యవర్తనకు తావైన (రఘురాముడు), ధర్మసంస్థాపన చేసిన (శ్రీకృష్ణుడు) ఒకే భగవత్తత్వాన్ని సూచించేవే

"యథాయధా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం"

– అనే పేరు పొందిన గీతా కారుని వాక్యాలలో భూమిలో గ్లాని (ధర్మగ్లాని) సంభవించినప్పుడు అధర్మంనుండి ధర్మాన్ని నేను ఉద్ధరింపచేస్తాను. అని అన్న మాటలు విష్ణువు పాశ్రస్త్యాన్ని సూచించేవే. ఈ విష్ణువునకు కృష్ణుడు బలరాముడు (సంకర్షణుడు), ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు,సాంబుడు వ్యూహామూర్తులుగా ఉండేవారని, ఈ రకమైన వ్యూహమూర్తుల పూజ విధిగా ప్రచారంలో తమిళదేశంలో చాలాకాలంగా ఉందని శిలప్పాధికారం వంటి సాహిత్యాధారాల వల్ల తెలుస్తుంది అలాగే విష్ణువునకు మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, రఘు రామా, శ్రీకృష్ణ, బుద్ధ, కల్కి అనే అవతారాలు ప్రశస్తమైనవిగా అందరికీ తెలిసినవే కాని "రామో రామశ్చ రామశ్చ" (రాముడు, మరియు రాముడు, మరియు రాముడు ) అనే సాంప్రదాయక వాక్యం ప్రకారం బలరాముని (పై మాటలలో మూడవ వాడు. మొదటివాడు , రెండవవాడు పరశురాముడు, రఘురాముడు ) మాత్రం అవతారంగా గుర్తించాలని, శ్రీ కృష్ణుని పూర్ణ రూపునిగా గుర్తించాలని అనేకమంది అభిప్రాయం. అలాగే బుద్ధుని విషయంలో అవతారంగా స్వీకరించడానికి అనేక అభిప్రాయాలున్నాయి ఐనా దశావతార మూర్తులన్నీ విష్ణు మూర్తికి గల ప్రాశస్త్యాన్ని ,ధర్మరక్షకత్వాన్ని సూచించేవే ఈ రకమైన వ్యూహమూర్తులు, అవతారమూర్తులు మాత్రమే కాక ప్రధానంగా కొన్ని రూపాలు విష్ణువునకు మాత్రం చెందినవి ధ్రువబేర మూర్తులుగా అన్నింట పేరు పొందినవి ఈ క్రింది విధంగా ఉన్నాయి.

### 3:2: ధ్రువ బేరమూర్తులు :

ఈ రకమైన ధ్రువబేరమూర్తులు, యోగ, భోగ, వీర, అభిచారికాలనే నాలుగు రకాలున్నాయి. యోగులు యోగమూర్తిని, భోగవాంఛలు కోరేవారు భోగమూర్తులను, శౌర్యాన్ని కోరేవారు వీరమూర్తులను, విజయాన్ని కోరేవారు అభిచారక మూర్తులను పూజించాలని సాంప్రదాయం. ఈ మూర్తులను పరివేష్టితులయిన పార్శ్వ పరివార సమూహాలలోని వైవిధ్యాన్ని బట్టి ఉత్తమ, మధ్యమ, అధమ మూర్తులని తిరిగి వర్గీకరించడం జరిగింది. అదే విధంగా స్థానక, ఆసన, శయన మూర్తుల భేదాలు (నిలచున్న, కూర్చున్న, పవళించిన ప్రతిమల రూపాలు) కూడా ఉన్నాయి.

### 3:2:1: యోగస్థానకమూర్తి :

కృష్ణ వర్ణంలో, చతుర్భుజాలను కలిగి కుడిపై చేతిలో చక్రం, ఎడమ చేతిలో శంఖం ఉంటాయి. కుడి కింది చేయి అభయ (చేతి వేళ్ళు పై కుండున్నట్లు గా చూపి రక్షిస్తున్నట్లు చూపే ముద్ర) లేదా వరద (చేతి వేళ్ళు కింది వైపు ఉన్నట్లుగా చూపి ధారపోస్తున్నట్లుగా చూపే ముద్ర) ముద్రలో ఉండగా, ఎడమ కింది చేయి కట్యావలంబితముద్ర (నడుము పై చేయి వేసుకొని నట్లుండడం) లో ఉంటుంది. భృగుమహర్షిని మార్కండేయ మహర్షికి కుడి ఎడమలుగా నమస్కరిస్తున్నట్లు చూపడంగాని, భూదేవిని కుడివైపు మార్కండేయుని ఎడమవైపు చూపడంగాని జరుగుతుంది. కాగా, శివుని బొమ్మ దక్షిణాభిముఖంగా ఉత్తరపు గోడమీద చెక్కబడి ఉంటుంది దక్షిణపు గోడమీద ఉత్తరాభిముఖంగా చతుర్భుజుడైన బ్రహ్మను అక్షమాల (రుద్రాక్షపూసలతో చేసిన మాల) కమండ లువు (కొమ్ము కలిగిన చెంబు) లను ధరించినట్లు చూపాలి. ఈ మూర్తి బ్రహ్మ, శివులు లోపించిన చో మధ్యమమూర్తిఅని, అందరూ లేనట్లైతే అధమమూర్తినఅని, ఋషుల చేత, దేవతల చేత పరివేష్టితుడై తే ఉత్తమమూర్తి అని తెల్పడం జరిగింది.

### 3:2:2: భోగస్థానక మూర్తి :

చతుర్భుజుడైన విష్ణువు పై కుడిచేతిలో చక్రాన్ని పై ఎడమచేతిలో శంఖాన్ని ధరిస్తాడు. కిందికుడిచేయి అభయముద్రలోగాని,వరదముద్రలుగాని ఉండగా కింది ఎడమ చేయి కట్యావలంబిత ముద్రలుగాని, కటకముద్ర (ఉంగరంపై వేలు కిందకు మడచి, మిగిలిన వేళ్ళను పైకి చూపుతూ అరచేతి (చేతిని ఉంచడం)లో గాని ఉంటుంది. విష్ణువునకు కుడివైపున కొంచెం ముందుకు వంచిన ఎడమ కాలితో శ్రీదేవిని (లక్ష్మి ని) చూపడం జరుగుతుంది ఆమె ఎడంచేతిలో పద్మాన్ని దాల్చి (పద్మహస్తం అంటారు) బంగారు రంగులో ఉంటుంది. ఎడమ వైపు భూదేవి ఎడమ చేతిలో నీలి కలువను ధరించి ఇంచుమించు శ్రీదేవి (లక్ష్మి) లాగానే ఇతర స్వభావాన్ని కలిగి ఉంటుంది. విష్ణువునకు కుడిఎడమల భృగువు మార్కండేయులు (కుడివైపున భృగువు, ఎడమ వైపుమ మార్కండేయుడు) మోచేతిమీదనుంచుని నమస్కరిస్తున్నట్లు గాని, ఉత్కుటికాసనం (ఎడమ కాలు కుడివైపుకి కుడికాలు ఎడమ వైపుకి మడచి కూర్చున్నప్పుడు మోకాళ్ళవద్ద యోగపట్టము కలిగి ఉండడం) లో గాని చూపడం జరుగుతుంది. విష్ణువు నకు

పై భాగంలో మాయా, సంహ్లాదినీ, కామినీ, వ్యాజనీ వంటి దేవతలు,నారద తుంబురులు, కిన్నెరలు, యక్షులు, గంధర్వులు, సనక, సనత్కుమార ఋషులు, సూర్యుడు, చంద్రుడు అనే వారిని చూపడం జరుగుతుంది. ఉత్తరపు గోడల మీద శివుని దక్షిణ పు గోడమీద బ్రహ్మను చూపడం యోగస్థానక మూర్తి రూపంలో వలెనే జరుగుతుంది. యక్షులు, విద్యాధరులు, నారద, తుంబురులు చూపిస్తే దీన్ని మధ్యమరకానికి చెందిందని, వానితో బాటుగా సనకుడు, సత్కుమారుడు, సూర్యుడు, చంద్రుడు, ఇతర పూజకమునులు కూడా లేనట్లైతే అధమ రకానికి చెందినదని, అన్నింటితో కూడినదని ఉత్తమ రకానికి చెందిందని అంటారు.

**3:2:3: వీరస్థానక మూర్తి :**

ఈ మూర్తిలో శంఖ, చక్రధారి అయిన విష్ణువు హస్తాల ప్రయోజనాన్ని గూర్చి ఏ శిల్ప గ్రంథం చెప్పడంలేదని గోపీనాధ రావు వ్యాఖ్యానించారు. ఈ మూర్తిలో విష్ణువును, బ్రహ్మ, శివుడు, భృగువు, మార్కండేయుడు, కిష్కిందుడు, సుందరుడు, సనకుడు, సనత్కుమారుడు, సూర్యుడు, చంద్రుడు పరివేష్టించి ఉంటారు. ఇది ఉత్తమ మైన వీరస్థానక మూర్తి. మధ్యమ వీరస్థానక మూర్తిలో కిష్కిందుడు, సుందరుడు, సనకుడు, సనత్కుమారుడు ఉండరు. అధమ వీరస్థానక మూర్తిలో సూర్యచంద్రులు, పూజకమునులు కూడా ఉండరు.

**3:2:4: అభిచారిక స్థానక మూర్తి :**

ఈ మూర్తిలో ఉండే విష్ణువు కృష్ణ వర్ణంలో, పేలవమైన ముఖం చిరునగవు లేని ముఖంతో రెండు లేదా నాలుగు చేతులును కలిగినల్లని అంగ వస్త్రం ధరించి ఉంటాడు. ఈ మూర్తిని ఏ రకమైన దేవతలు, ఋషులు పరివేష్టించి ఉండరు. పైశాచపదం లేదాపైశాచం అనే దేవాలయంలో ఈ మూర్తిని స్థాపించాలి. ఈ రకమైన అభిచారిక మూర్తులను కృష్ణపక్షానికి చెందిన పాడ్యమి, చవితి, సప్తమి, దశమి వంటి తిధులలో, ఆర్ద్రా (ఆరుద్ర అని అంటారు) వంటి అశుభనక్షత్రాలలో చరలగ్నాలైన మేష, కర్కాటక, తుల, మకర లగ్నాలలో ప్రాణ ప్రతిష్ఠ చేసి స్థాపించాలి అని ఆగమాల నియామకం .

**3:3: ఆసనమూర్తులు :**

కూర్చున్నట్లుగా చూపబడే విష్ణువు ధ్రువబేరమూర్తులను ఆసనమూర్తులు అంటారు. ఇవి యోగాసన మూర్తి, భోగాసన మూర్తి వీరాసన మూర్తి అభిచారికాస నమూర్తి అని నాలుగు రకాలు.

**3:3:1:** యోగాసన మూర్తి : ధవళ (తెల్లని) దేహంతో చతుర్భుజుడైన ఈ మూర్తి బ్రహ్మాసనం లేదా పద్మాసనం (కూర్చొన్నప్పుడు కాళ్ళను కుడిఎడమలుగా మడచి, పాదాలను లోపలివైపుకు ఉంచడం.. ఇది బ్రహ్మ అనుసరించడం చేత బ్రహ్మాసనం అని, ముడిచిన పాదాలు పద్మపు రేకుల్లా ఉండడం వల్ల పద్మాసనం అని అంటారు), లో ఉంటాడు. ముందు రెండు చేతులు యోగముద్ర (వేళ్ళను పైగా ఉంచి బొటన వేలిని చూపుడు వేలుకు తాకుతున్నట్లు చూపాం దీనినే చిన్ముద్ర అని కూడా అంటారు) లో ఉంటాయి. శంఖ చక్రాలను విధిగా చూపనవసరం

లేదు. ఈ మూర్తికి పసుపుపచ్చని అంగవస్త్రాన్ని తెల్లని ఉత్తరీయాన్ని ఏర్పరుస్తారు. యజ్ఞోపవీతం (జందెం) హారాలు, కుండలాలు (చెవికి ఆభరణాలు) కేయూరాలు, ( దండ కడియాలు మోచేతికి పైన భుజానికి కిందగా ధరించే ఆభరణాలు) యోగాసన మూర్తికి ఉంటాయి. శివుని దక్షిణాభిముఖంగాను, బ్రహ్మను ఉత్తరాభిముఖంగాను యోగాసన మూర్తి (3:2:1:) రూపంలో లాగానే చూపాలి. వెనక గల పడమటిగోడల మీద చంద్రుడు, సూర్యుడు, సనక, సనత్కుమారులను, ప్రతిమకు రెండువైపులా బృగు మార్కండేయులను కాని, భూదేవి, మార్కండేయులను గాని చూపాలి ఈ రకమైన మూర్తి ఉత్తమ తరగతికి చెందినది. చంద్రుడు, సూర్యుడు, సనక, సనత్కుమారులు లేనట్లైతే మధ్యమ తరగతికి చెందినవి. భృగువు మార్కండేయుడు కూడా లేనట్లైతే అధమ తరగతికి చెందినవి యోగాసన మూర్తి జటామకుటాన్ని (కిరీటంలాగ జడలను పైకి చుట్టి నట్లుగా ఉండడం) తప్పక కలిగి ఉంటాడు.

**3:3:1:** వాచస్పతి కోశంలో చెప్పిన సిద్ధార్థ సంహిత ఆధారం ప్రకారం యోగాసన మూర్తి అర్థనిమీలితనేత్రుడై ఉంటాడు. ఆమూర్తికి రెండువైపులా పద్మాన్ని గదను చెక్కాలి.

### 3:3:2: భోగాసనమూర్తి :

కుడివైపు లక్ష్మి, ఎడమవైపు భూదేవిలతో ఈ మూర్తి సింహాసనం మీద ఆసీనుడై ఉంటాడు. ఈ మూర్తికి నాలుగు చేతులుంటాయి కుడిపై చేతిలో చక్రం ఉండగా, కింది చేయి వరద ముద్రలోగాని, అభయముద్రలోగాని ఉంటుంది ఎడమపై చేతిలో శంఖం ఉండగా, కింది ఎడమ చేయి కట్యవలంబితంగా గాని, సింహ కర్ణముద్రలోగాని ఉంటుంది. ఇతడు కృష్ణ వర్ణుడు.కుడి ఎడమల లక్ష్మి, భూదేవులను వరుసగా ఎడమ, కుడి కాళ్ళను పీఠంపై మడిచి, కుడి, ఎడమ కాళ్ళను వేలాడిస్తూ చూపాలి. లక్ష్మి ఎడమ చేతిలో పద్మాన్ని భూదేవి కుడిచేతిలోనీలోత్పలాన్ని ధరించి ఉంటారు వారి మిగిలిన చేతులను సింహాసనం మీద ఉంచడంగానికటకముద్రలో ఉంచడం గాని, , వారి తొడపై ఉంచుకొనడం గాని చేయాలి.బ్రహ్మ, శివ, మార్కండేయ, భృగువులను యోగస్థానక మూర్తి రూపంలో లాగానే ఉతరాభిముఖం గాను, దక్షిణాభిముఖంగాను, మొక్కుతున్నట్లు గాను చూపాలి. ఈ మూర్తికి వెనువెంటనే వెనుక ఉన్న గోడపై మాయ, సంహ్లాదినీ అనే దేవతలను, నారద తుంబురలను,కిన్నరుల జంటను, యక్ష విద్యాధరులను, సనక సనత్కుమార ఋషులను, చంద్ర సూర్యులను చూపాలి. వీటన్నిటితో బాటు కల్పవృక్షాన్ని కూడా చూపాలి. ఈ మొత్తంగా చూపిన మూర్తిని ఉత్తమ భోగాసన మూర్తి అని అంటారు. కిన్నరులు నారద తుంబురులు యక్ష విద్యాధరులు లేనట్లయితే మధ్యమ యోగాసన మూర్తి అని అంటారు సనకసనత్కుమారులను సూర్యచంద్రులు కూడా లేకపోతే అధమ యోగాసన మూర్తి అని అంటారు భోగాసన మూర్తి ప్రతిమలను బాదామి, కంచి, ఎల్లోరా మొదలైన చోట్ల చూడవచ్చు.

### 3:3:3: వీరాసన మూర్తి :

ఈ మూర్తిని సింహాసనం మీద ఉన్నట్లు వీరాసనం (కూర్చొన్నప్పుడు కుడి కాలిని ఎడమ

కాలిమీదుగా ఎడమ వైపుకు వేసి వేలాడుతున్నట్లుండం)లో చూపాలి. నేలమీద లక్ష్మిని, భూదేవిని మొక్కుతున్నట్లు చూపాలి ఈ మూర్తికి గల కుడిపై చేతిలో చక్రం ఉండగా, ఎడమ పై చేతిలో శంఖం ఉంటుంది కుడికింది చేయి అభయ ముద్రలోగాని, వరదముద్రలో గాని ఉండగా, ఎడమ కింది చేయి సింహకర్ణముద్రలో ఉంటుంది. ఈ మూర్తికి కుడివైపున బ్రహ్మ, మార్కండేయులు ఉంటారు ఎడమ వైపున శివుడు, భృగువు ఉంటారు. కామిని, వ్యాజని అనే ఇద్దరు అప్సరస స్త్రీలు ఇరువైపులా చామరాలు వీస్తున్నట్లు చూపించాలి. అలాగే సనక, సనత్కుమార ఋషులు, నారదతుంబురులు, సూర్య చంద్రులను కూడా చూపాలి. ఈ రకమైన మూర్తిని ఉత్తమ వీరాసన మూర్తి అంటారు. నారద తుంబురులు, కామినీ వ్యాజని అనే అప్సరసలు, సనక, సనత్కుమార ఋషులు లేకపోతే మధ్యమ వీరాసన మూర్తి అంటారు. బ్రహ్మ, శివుడు, లక్ష్మి, భూదేవి, సూర్యుడు, చంద్రుడు, కూడా లేనట్లైతే అధమ వీరాసన మూర్తి అని అంటారు అయ్‌హోల్ శిల్పాలలో. అధమ వీరాసన మూర్తిని చెక్కడం జరిగింది.

**3:3:4: అభిచారికాసన మూర్తి :**

ఇతడు తామస గుణ ప్రధానుడు వేదికా సనం మీద కూర్చొని ఉంటాడు రెండు లేక నాలుగు చేతులు కలిగి ఉంటాడు. ఇతడు కృష్ణ వర్ణుడు. నల్లని అంగ వస్త్రం కలిగినవాడు ఈ మూర్తికి పార్శ్వ, పరివార వర్తులైన దైవ, మానుష వ్యక్తులను చూపడం జరుగదు. ఆర్ద్రా (ఆరుద్ర) నక్షత్రం వంటి అశుభ తారలతో కూడిన, కృష్ణ పక్ష అష్టమి వంటి అశుభ తిథులలో నే యీ మూర్తిని ప్రతిష్ఠ చేయాలి.

**3:4: శయన మూర్తులు :**

స్థానిక, ఆస్థాన మూర్తుల వలనే శయనమూర్తులు కూడా యోగాశయన మూర్తి, భోగశయన మూర్తి, వీరశయన మూర్తి, అభిచారిక శయన మూర్తి అని నాలుగు రకాలుగా ఉంటారు.

**3:4:1: యోగశయన మూర్తి :**

అనంతాసనం( ఆదిశేషువును పోలిన సర్పం అనంతుడు) మీద ఉన్న ఈ మూర్తికి ఒకింత లేచినట్లుండి, మిగిలిన శరీరమంతా పడుకొన్నట్లే ఉంటుంది. ఈ మూర్తికి కేవలం రెండు చేతులు మాత్రం ఉంటాయి. కుడిచేతిని కిరీటం తాకేటట్లుగా ఉంచి, ఎడమ చేతిని కటక ముద్రలోగాని, లేదా, తొడను తాకేటట్లు శరీరానికి సమాంతరంగా ఉంచడం గా ని చేయాలి. ఈ మూర్తి అర్ధనిమీలిత నేత్రుడై అనేక అలంకరణలను కలిగి ఉంటాడు. ఈ మూర్తి రంగు నలుపు, పసుపు రంగుల మిశ్రమంగా ఉండాలి ఈ మూర్తికి పక్కన భృగువును, మార్కండేయుని, పాదాల దగ్గర మధుకైటభులను చూపాలి. నాభిపద్మంలో బ్రహ్మను కూడా చూపాలి. ఈ మూర్తికి వెనుక గోడ నైపు గరుడుడు విష్వక్సేనుడు అనే ఆయుధ పురుషులను ( వీరినేవేత్రహస్తులనీ అంటారు. వీరు చేతిలో బెత్తం ధరించి విష్ణువు పరివారానికి చెందినవారు) సప్తర్షులను అంజలి ముద్రలను (నమస్కరిస్తున్నట్లు) చూపాలి. దక్షిణ పు గోడమీద బ్రహ్మను, ఉత్తర పు గోడమీద శివుని ఆసన స్థితిలో చూపాలి. ఈ మొత్తంతో కూడిన మూర్తిని ఉత్తమ

యోగశయనమూర్తి అని అంటారు వీరిలో విష్వక్సేనుడు, సప్తఋషులు లేనట్లైతే మధ్యమ యోగశయనమూర్తి అని అంటారు. పూజక మునులు, మధు, కైటుభులు కూడా లేనట్లైతే అదమ యోగశయన మూర్తి అని అంటారు. మధ్యమ యోగశయన మూర్తిని మహాబలిపురంలో చూడవచ్చు.

### 3:4:2: భోగశయన మూర్తి :

పడుకొన్న స్థితిలో ఉన్న ఈ మూర్తి కూడా యోగ శయన మూర్తిలాగానే ఉంటుంది. కాని, ఎడమ కాలిని కొంచెం ముడిచి, కుడికాలిని తిన్నగా చూచినట్లు ఈ మూర్తిని చూపాలి. రెండుకాళ్ళకు మధ్యదూరం 20 అంగుళాలు, రెండు మడమలకు మధ్యదూరం 4 అంగుళాలు, రెండు మోకాళ్ళకు మధ్యదూరం 14 అంగుళాలు ఉండాలని శాస్త్రసాంప్రదాయం ముఖానికి మధ్యగా 3 అంగుళాల బ్రహ్మసూత్రాన్ని చూపాలి. తలవైపున లక్ష్మిని, ఇంచుమించు ఈ మూర్తి భుజాలను తగిలేటట్లు చూపాలి. లక్ష్మి కుడిచేతిలో పద్మం ఉండగా, ఎడమ చేయి కటక ముద్రలోను, విధిగా ఉండాలి. ఎడమ కాలిని తగిలేటట్లు నీలోత్పలాన్ని ధరించిన భూదేవిని చూపాలి. ఆమె ఎడమ చేతిని, లక్ష్మిదేవికి వలెనే, కటక ముద్రలో చూపాలి. కుడివైపున మార్కండేయుని, ఎడమవైపున భృగువును, దక్షిణపు గోడపై బ్రహ్మను ఉత్తరపు గోడపై శివుని, చూపించాలి. వీరందరు ఆసన స్థితిలోనే ఉంటారు. వీనికి తోడు దక్షిణపు గోడమీద ఒక గణేశ ప్రతిమను, ఉత్తరపు గోడమీద దుర్గను విధిగా చూపించాలి ఈ మూర్తి పాదాల దగ్గర మధు, కైటుభులనుక్రోధోద్విగ్నతతో చూపించాలి. బ్రహ్మను నాభిపద్మంనుండి ఆవిర్భవిస్తున్నట్లు చూపాలి. బ్రహ్మకు కుడివైపున ఐదుగురుఆయుధ పురుషులనుగరుడుని, గరుడునికి పైన కుడివైపున సూర్యుని చూపాలి. బ్రహ్మకు ఎడమవైపున ఆశ్వినీ దేవతలను బాల్యస్థితిలో ఉన్న నారద తుంబురులును, చంద్రుని చూపాలి వీరికితోడు అన్ని దిక్కుల అష్ట దిక్పాలకులను, అప్సర స్త్రీలను చూపించాలి. ఈ మొత్తం దేవదేవాంగనలతో కూడిన భోగశయన మూర్తిని ఉత్తమ భోగశయన మూర్తి అని అంటారు. (చూడుడు స్కెచ్) నారదతుంబురులు, దిక్పాలకులు లేనట్లైతే మధ్యమ భోగశయన మూర్తి అంటారు.

→

### 3:4:3: వీరశయన మూర్తి :

ఈ మూర్తికి నాలుగు చేతులుంటాయి. ఒక కుడి చేతిని తల కిందుగా ఉంచగా, వేరొక చేతిలో చక్రం ఉంటుంది. ఒక ఎడమ చేతిలో శంఖం ఉండగా, వేరొక ఎడమ చేయి దేహం మీద సమాంతరంగా ఉంటుంది. పాదాల వద్ద మధు, కైటభులను, రెండు వైపులా లక్ష్మి, భూదేవులను చూపాలి. కౌతుక బేరమునకు కుడివైపున మార్కండేయుని, ఎడమ వైపున భృగువను చూపాలి బ్రహ్మను నాభికమలం నుంచి వెలువడుతున్నట్లుగా చూపాలి. వెనుక గోడమీద ఐదుగురు ఆయుధ పురుషులను, గరుడని, సూర్యచంద్రులను, సప్తర్షులను ద్వాదశాదిత్యులను, ఏకాదశ రుద్రులను, అప్సరసలను, తుంబుర నారదులను, ఇద్దరు కిన్నరులను, సనకసనత్కుమారులను, బ్రహ్మను, శివుని విధిగా చూపించాలి ఈ మొత్తంతో కూడిన మూర్తిని ఉత్తమ వీర శయన మూర్తి అని అంటారు రుద్రులు, ఆదిత్యులు, అప్సరసలు, సప్తర్షులు లేకపోతే ఆ మూర్తిని మధ్యమ వీరశయన మూర్తి అని అంటారు. వీరితోబాటుగా కిన్నరులు, సనకసత్కుమారులు, పూజకమునులు కూడా లేనట్లైతే అధమ వీర శయన మూర్తి అని అంటారు.

### 3:4:4: అభిచారిక శయన మూర్తి :

రెండు పడగల ఆది శేషుని తల్పం మీద నేల మీద పడుకొన్నట్లు ఈ మూర్తిని చూపాలి. ఈ మూర్తి కృష్ణ వర్ణంలో రెండు లేదా నాలుగు భుజాలు కలిగి ఉన్మత్తుడై తల్పం పై పడుకొని ఉంటాడు. ఈ మూర్తి నల్లని వస్త్రాన్ని ధరించి ఉంటాడు. పార్శ్వ పరివార దేవతలు ఉండరు. ఈ తరహామూర్తిని ఉత్తమ అభిచారిక శయన మూర్తి అంటారు ఒకే పడగ గల పాము ఒక చుట్టు చుట్టుకొన్నట్లుంటే మధ్యమ అభిచారిక శయన మూర్తి అంటారు. సర్పతల్పం లేక పోతే అధమ అభిచారిక శయన మూర్తి అని అంటారు.

**3:4:5:** ఈ రకమైన ధ్రువ బేరమూర్తులో మూడు తరగతులకు చెందిన ఆసన, స్థానక, శయనమూర్తులకు ద్వీపకల్ప ప్రాంతంలో ఎక్కువ పరివ్యాప్తి ఉంది కాని ఆసన శయన మూర్తులు ఉత్తర భారతదేశంలో అరుదు అని చంపకలక్ష్మి గారి పరిశీలన

### 3:5: అవతార మూర్తులు :

**3:5:1:** విష్ణుని ప్రతిమలలో దశావతారాలు, చతుర్వింశతి మూర్తులు, పంచవీరులు ఎక్కువగా పేరుపొందినవి. దశావతారాలలో వరాహ, నారసింహ, వామన, రామ, కృష్ణావతారాలు ఎక్కువగా పేరుపొంది వివిధ ప్రతిమారూపాలను సంతరించుకొన్నాయి మత్స్య, కూర్మ అవతారాలు మధ్య యుగ ఉత్తర భాగంలోనే ప్రాశస్త్యాన్ని పొందినట్లు చంపక లక్ష్మి అభిప్రాయం. మిగిలినవైన పరశురామ, బుద్ధ, కల్క్యవతారమూర్తులు పరిమితమైన ప్రాచుర్యాన్ని మాత్రం కలిగినవి. విష్ణువు నకు గల ఈ పది ప్రధానావతారాల్లోను కృష్ణావతారం జన బాహుళ్యంలో అధికమైన ఆదరణ పొందింది శ్రీ కృష్ణుని బాల్య క్రీడలు ఎక్కువ మంది శిల్పుల ఆసక్తిని పొంది రమణీయ శిల్పాలుగా రూపొందాయి. నవనీత నర్తనమూర్తి, బాలగోపాలమూర్తి, గోవర్ధన గిరిధారి, కాళియమర్దనమూర్తి మొదలైనవి అటువంటి బాల్యమూర్తులలో కొన్ని కాగా,

రాధామాధవ ప్రణయం నిర్మలమైన మధుర భక్తికి గుర్తుగా మిగిలిపోయింది. తమిళదేశంలో వీరినే మాయోన్, పిణ్ణై అనివ్యవహరిస్తారు. ఈ రకమైన వ్యవహారం ఈ అవతార భావానికి గల జానపదగీతానికి ఒక ప్రధానాధారం అని విమర్శకుల అభిప్రాయం. అదేవిధంగా పరశురాముని తల్లి రేణుకను ప్రాంతీయ దేవతగా కొలవడం, పరశురామునికి, క్షత్రియుడైన, కార్త్యవీర్యార్జునుకి గల వైరం బ్రహ్మక్షత్రియ వైర భావమేనని, క్షత్రియులను అణచి బ్రాహ్మణులు తమ ఔన్నత్యాన్ని నిలబెట్టు కోవడానికి చేసిన కృషియే పరశురామావతారమని డి డి. కోశాంబి అభిప్రాయం. అంతే కాక రేణుకాదేవి పూజ ఒకప్రత్యేక శక్తి పూజగా రూపొందడం కూడా జరిగింది ఈమెనే 'ఎల్లమ్మ'-అని పూజించడం ఆంధ్రదేశంలో జరిగింది. 'ఎల్లమ్మ' నే ఏకవీర అన్నారు 'కాకతమ్మకు సైదోడు ఏకవీర" అనే, వల్లభరాయుని వాక్యాన్ని ప్రమాణంగా తీసికొన్నట్లైతే కాకతి జైన దేవత గనుక, ఏకవీర అని పిలవబడ్డ ఎల్లమ్మ లేక రేణుక కూడా జైన మతంతో కొద్దోగొప్పో సంబంధాన్ని కలిగి ఉంటుంది అని ఊహించడం అతిశయోక్తి కాదు. కాని, ఏరకంగా ప్రాంతీయమైన ప్రధానమైన హిందూమతం లోన నమ్మకాల వరవడిలో ఎప్పుడూ సమ్మేళనం ఎలా ఏర్పడిందో తెలియచెప్పే ఇదమిద్ధమైన ఆధారాలు లభ్యం కావడంలేదు. కాని విష్ణువు దశావతారమూర్తులలో శివుడికి గల జానపద ప్రామాణికతగాని మూఢనమ్మకాలపునాదిగాని లేదని ఘంటాపథంగా చెప్పవచ్చు ఎటొచ్చీ, గోపాలకృష్ణుని మూర్తి ఒకానొక గోపాలుర వర్ణాధిక్యతను పరశురాముడు కేవలం బ్రాహ్మణుల ఆధిక్యతను, చూపుతన్నారా? దానితో బాటుగా వివిధ సంస్కృతుల సమ్మేళనానికి (Acculturation) ఈ రకమైన మూర్తులు సంకేతాలు- అనే విమర్శకుల అభిప్రాయం - సబబా, బేసబబా అని నిర్ణయించడానికి తగ్గ ఆధారాలు ఇదమిత్థంగా లేవు.

**3:5:2: అవతారాలపూర్వాపరాలు :**

దేవుని ( ఈ సందర్భ లో విష్ణువు) మూర్తులు మూడు రకాలు అవి అవతారం; ఆవేశం, అంశ. యావజ్జీవితం దివ్యశక్తితో ఉన్న మానుష జీవనాన్ని సూచించేది అవతారం. రాముడు, కృష్ణుడు ఈ కోవకు చెందినవారు. తాత్కాలికమైన దివ్యావేశాన్ని కలవారు. ఆవేశమూర్తులు. పరాశురాముడు ఈ కోవలోనివాడు. విష్ణువు శంఖ చక్రాల అంశద్వారా జన్మించారని పేరుపొందిన ఆళ్వారులు అంశమూర్తులు వీటన్నిటిలోను అవతారమూర్తులు అతి బలమైనవి. స్థిరమైన భక్తి ప్రవత్తులను చూరగొన్నవి.

**3:5:2:1:** విష్ణువు ఎందుకు అవతరించవలసి వచ్చింది? దీనికి పురాణాల్లోనే కొన్ని రకాల సమాధానాలున్నాయి. మత్స్యపురాణం ప్రకారం భృగుమహర్షి శాపం వల్ల విష్ణువు ఈ అవతారాలు ధరించవలసి వచ్చినట్లు తెలుస్తుంది అదే పురాణంలో, వివరిస్తూ, దేవాసురసంగ్రామం జరిగినపుడు ఒకసారి రాక్షసులు ఓడిపోగా శుక్రుడు శివుడి దగ్గరకు బృహస్పతి నీతికన్న బలమైన నీతి పొందడానికి వెళతాడు అప్పుడు ఇంద్రుడు విష్ణుని సహాయంతో రాక్షసుల పైదండెత్తుతాడు శుక్రుని తల్లి ఇంద్రుణ్ణి భస్మం చేస్తానని బెదిరిస్తుంది విష్ణువు ముందుగానే ఆమెను చంపమని ఇంద్రుని హెచ్చరిస్తాడు. కాని ఇంద్రుడు వెనకాడడం వల్ల

విష్ణువు సుదర్శనంతో ఆమె తల తెగనరుకుతాడు. అప్పుడు శుక్రుడు విష్ణువుని ఏడు పర్యాయాలు మానవుడుగా జన్మించాలని శపిస్తాడు. ఆ శాపం వల్ల విష్ణువు ధర్మగ్లాని జరిగినప్పుడు జన్మించి అధర్మాన్ని అణచివేయడం జరిగింది. 'కలౌ వేంకట నాయకః' అని పేరుపొందిన శ్రీ వేంకటేశ్వరుని శాపంలో కూడా భృగువు దే ప్రధాన పాత్రగా ఉండడం మరవరాని అంశం. ఆ ఏడు అవతారాలు దత్తాత్రేయడు, మాంధాత, పరశురాముడు, రాముడు, వేదవ్యాసుడు, బుద్ధుడు, కల్కి, కాని భాగవత పురాణంలో 22 అవతారాయలను పేర్కొనడం జరిగింది. అవి : 1 పురుష 2 వరాహ 3 నారద 4. నర నారాయణ5కపిల 6 దత్తాత్రేయ 7.యజ్ఞ 8 ఋషభ 9. పృధు 10 మత్స్య 11. కూర్మ 12,13, ధన్వంతరి 14. నరసింహ 15. వామన 16 పరశురామ 17 వేదవ్యాస 18. రామ 19,20 బలరామ, కృష్ణులు, 21. బుద్ధుడు 22 కల్కి. విష్ణుని అవతారాలు అపరిమితాలు అనే ప్రధ హిందూ సాంప్రదాయంలో ఉంది. వీటన్నింటిలోను, మత్స్యం, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ రఘురామ కృష్ణ, బుద్ధ, కల్క్యవతారాలు పేరొందినవి వీనిలో కల్క్యవతారం భవిష్యత్తును సూచిస్తుంది. ఆ అవతారాల మూర్తులను గూర్చి ఈ క్రింది విధంగా తెలియవచ్చు.

**3:5:3: మత్స్యావతారమూర్తి :**

ఈ మూర్తిని గూర్చిగాధలు శతపధ బ్రాహ్మణంలోను, భారతంలోను, భాగవతంలోను ఉన్నాయి. హయగ్రీవుడనే రాక్షసుడు వేదాలను దొంగిలించగా విష్ణువు మత్స్యరూపియై హయగ్రీవుని చంపి వేదాలనుద్ధరించి బ్రహ్మ వశం చేశాడు హయగ్రీవుడికి బదులుగా సోమకుడు అనే రాక్షసుని పేర్కొనడం కూడా కొన్ని చోట్ల జరిగింది. ఈ అవతారాన్ని గూర్చి అగ్ని పురాణంలో వశిష్ఠునికి అగ్ని చెప్పిన ఇంకొక కథకూడా ఉంది. కల్పాంతంలో ఒకసారి వైవస్వతమనువు తపస్సు చేస్తూ కఠిన దీక్షలో ఉండి కృతమాలా నదిలో అర్ఘ్యం విడవడానికి వెళ్ళగా, ఒక్క చిన్న చేప అతని రక్షణ కోరి వచ్చి మరింతగా త్రివిక్రమస్ఫూర్తితో పెరుగుతుండగా మనువు దానిని నారాయణాంశంగా గుర్తిస్తాడు. అపుడు మత్స్యరూపుడైన ఆ నారాయణుడు, అప్పటికి ఏడవ రోజున జల ప్రళయం వస్తుందని, సప్తర్షులతో కలిసి, నవధాన్యాలను చేతిలో ఉంచుకొని ఒక ప్రత్యేకమైన పడవమీద ఉండి బ్రాహ్మీముహూర్తంలో ఒక పెద్ద పాముతో ఆ పడవను తన కొమ్ముకు ముడివేయమని ఆదేశించి అదృశ్యుడౌతాడు. ఆ తరువాత విష్ణువు మనువుకు మత్స్య పురాణం చెప్పి దాని తరువాత హయగ్రీవుడే రాక్షసుణ్ణి చంపుతాడు. ఈ అవతార మూర్తిగాధజల ప్రళయాన్ని సూచించే వరదల గాథలకు చెందిన ఒక ఐతిహ్యం అని చెప్పే చంపక లక్ష్మి వర్ణన ఎంతో సముచితం

**3:5:3:1:** ఈ మూర్తిని రెండు రకాలుగా చూపుతారు. ఒక రకంగా కేవలం చేపను చూపడం. రెండవ రీతిలో సగభాగం చేపగాను, సగభాగం మానవునిగాను చూపడం. సాధారణంగా పై భాగం మానవుని పోలి కిరీటమకుటాన్ని కలిగినాలుగు చేతులతో ఉంటుంది. రెండుచేతులలో శంఖ చక్రాలనుంచి, మిగిలిన రెండు చేతులను అభయ, వరద ముద్రలలో చూపాలి.

### 3:5:4: కూర్మావతారమూర్తి :

దేవతలు అమృతం కోసం పాలసముద్రాన్ని చిలికేటప్పుడు కవ్వంగాచేసికొన్న మంధరపర్వతాన్ని మోయడానికి గాను విష్ణువు కూర్మావతారాన్ని ధరించడం జరిగింది. భాగవత పురాణంలో యీ అవతారాన్ని గూర్చి వర్ణన ఉంది

**3:5:4:1:** ఈ మూర్తిలో పై భాగం మానవునిగాను, దిగువ భాగం తాబేలుగాను చూపడంజరుగుతుంది. కిరీటమకుటం, నాలుగు చేతులు, పై రెండు చేతులలో శంఖ, చక్రాలు, దిగువ రెండు చేతులు అభయ, వరదముద్రలలోను ఉంటాయి.

### 3:5:5: వరాహావతారమూర్తి :

హిరణ్యాక్షుడు అనే రాక్షసుడు భూమిని చాపగా చుట్టడానికి యత్నించగా హిరణ్యాక్షుని చంపి భూమిని రక్షించడానికి విష్ణువు వరాహరూపాన్ని ధరించాడనేది ప్రాచుర్యంలో ఉన్న కథ. ఈ కథలో భూమి బల్లపరుపుగా ఉండేది అనే ఒకానొక ప్రాచీన దృక్పథం కూడా గోచరిస్తున్నది.కాని విష్ణు పురాణం, లింగపురాణం, గరుడ పురాణం బ్రహ్మను భూమి ఉద్ధారకుడుగా అభివర్ణించాయి. శతపధ బ్రాహ్మణంలో ఏ ముషుడనే వరాహం భూమిని ఉద్ధరించినట్లు చెప్పబడింది. కాగా తైత్తిరీయ ఆరణ్యకంలో విష్ణువు నూరుచేతులు గల పంది ఆకారంలో భూమిని ఉద్ధరించాడని , చెప్పడం జరిగింది. తరవాతి కాలం దైన రామాయణంలో బ్రహ్మభూమి ఉద్ధారకుడని చెప్పడం జరిగింది. అంటే ఈ అవతారానికి గల నేపథ్యంలో అసమరూపత ఉండడంవల్ల, ఈ మూర్తి ఆవిర్భవించడానికి తోడ్పడ్డ పరిస్థితులు ఒకటే అయినా, బ్రహ్మ లేదా విష్ణువు తమ భక్తుల చేత విడిగా భూమిని ఉద్ధరింప చేసినట్లుగా అభివర్ణించడం జలరిగింది

**3:5:5:1:** ఈ రకమైన మూర్తిని వివిధ శాసనాలలో కూడా అక్షర రూపంలో అర్చించడం జరిగింది. ఒక శాసనం (ఎపిగ్రాఫియా ఇండికా 24వ సంపుటం పుటలు 255-263లో "జయతి ధరణ్యుద్ధరణే

ఘన ఘోణాఘాత ఘూర్ణితమ హీద్రః

దేవో వరాహమూర్తి స్త్రైలోక్యమహగృహస్తంభః"

అని పేర్కొనడం జరిగింది. వరాహమూర్తిని దిద్దడంలో మూడు ప్రధాన రూపాలుగా తీర్చారు. అవి 1. ఆదివరాహమూర్తి లేదా భూవరాహమూర్తి 2. యజ్ఞవరాహమూర్తి 3 ప్రళయ వరాహమూర్తి. వీటి స్వరూపాలు ఈ క్రింది విధంగా ఉంటాయి.

### 3:5:5:2: ఆదివరాహమూర్తి లేదా భూ వరాహమూర్తి :

వైఖానసాగమంప్రకారం ఈ మూర్తి మానవ దేహంతోను,వరాహముఖంతోను , ఉంటుంది. నాలుగు చేతులలో కుడి ఎడమల చక్రశంఖాలుంటాయి కుడి కాలు కొంచెం ముందుకు వంగి ఆదిశేషుని పడగపై ఉంచాలి. ఎడమ చేయి భూదేవికి ఆసరా ఇస్తున్నట్లు చూపాలి. ముఖాన్ని ఎత్తి ఆమె వక్షాన్ని స్పృశిస్తున్నట్లు చూపాలి. భూదేవిని అంజలి ముద్రలో చూపాలి. ఆమెను నల్లనిరంగులో, పూలను, ఉచితమైన నగలను ధరించట్లు చూపాలి. ఆమె మోములో

సిగ్గుతో కూడిన ఆనందాన్ని చూపాలి ఆమె శిరస్సు వరాహమూర్తి వక్షం వరకు ఉండాలి. అందుకోసం ఆమె మూర్తిని పంచతాళమానం (వివరాలకు ఉపసంహారంలో) లో తీర్చి దిద్దాలి ఈ మూర్తినే 'శిల్పరత్నం' లో వర్ణిస్తూ, అతడు గదను, పద్మాన్ని ధరించి, భూదేవిని వక్షంపై ధరించినట్లు చూపాలి, అని చెప్పబడింది భూదేవి నీలోత్పలాన్ని ధరించి కళ్లలో ఆశ్చర్యాన్ని అభివ్యక్తం చేయాలి. ఈ మూర్తి చేతులలో ఒకటి కటిపై ఉండాలి. భూదేవిని ఎడమ మోచేతిపై ఉన్నట్లు చూపించాలి. ఇంచుమించు ఈ రూపాన్నే అగ్ని పురాణం, విష్ణుధర్మోత్తరపురాణాలలో కూడా చెప్పడం జరిగింది. శిల్ప రత్నం ప్రకారం ఈ మూర్తిని పూర్తిగా వరాహ రూపంలోనే చెక్కవచ్చు

**3:5:5:3: యజ్ఞవరాహమూర్తి :**

తెల్లని శరీరకాంతితో నాలుగు చేతులు గల ఈ మూర్తిని సింహాసనం మీద కూర్చొన్నట్లు చూపాలి ఎడమ కాలును పీఠం మీద ఉంచి కుడికాలుని వేలాడదీయాలి (దీనినే సుఖాసనం అని అంటారు ) ఈ మూర్తిని పసుపు పచ్చని బట్టలలో చూపించాలి. కుడివైపున స్వర్ణకాంతితో మెరిసే లక్ష్మిని చూపించాలి ఆమె ఎడమ చేతిలో పద్మాన్ని ధరించి, కుడిచేతిని సింహాసనం మీధ ఉంచాలి ఈ మూర్తికి ఎడమ వైపున నల్లని రంగులో,కుడి చేతిలో నీలోత్పలాన్ని ధరించిన భూదేవిని చూపించాలి.

**3:5:5:4: ప్రళయవరాహమూర్తి :**

నాలుగు చేతులు గల ఈ మూర్తి సింహాసనస్థుడు శంఖచక్రాలను పై రెండు చేతులతో ధరించి, కుడికింది చేతిని అభయముద్రలో చూపి, ఎడమచేతిని ఎడమ తొడమీద ఆన్చినట్లు చూపించాలి. కుడివైపు న నల్లని రంగుగలిగి, నీలోత్పలాన్ని ధరించిన భూదేవిని చూపించాలి.

**3:5:4:1:** మహాబలిపురం, బాదామి, నాగలాపురం, మొదలైన చోట్ల పేరుపొందిన ఈ మూర్తి శిల్పాలున్నాయి.

**3:5:5:5:** ఆగమాలలో వరాహమూర్తి ప్రతిమలలో జటామకుటాన్నిచెప్పక పోయినా, ఇంచుమించు అన్ని శిల్పాలు వరాహమూర్తిన్ని జటామకుటంతోనే చూపుతున్నాయి. అలాగే భూదేవిని నియతంగా వరాహమూర్తి పక్కనే ఉంచనవసరంలేదు. మహాబలిపురంలోని ఒక ఉదాహరణలో ఈమెను (అనగా భూదేవిని) వరాహమూర్తి అరచేతిలో చూపడం జరిగింది.

**3:5:5:6:** పద్మపురాణం, వాయుపురాణం వరాహమూర్తి యజ్ఞపురుషునికి సంకేతమని, వరాహమూర్తి ధ్వని సామఘోషయని, నాలుగు కాళ్ళు నాలుగు వేదాలు అని, బాహువులు యూపస్తంభమని, (బాహువులు స్తంభాలు అనాలి; కాని యజ్ఞవేదికలో ఉండేది ఒకేయూపస్తంభం అందువలన ఏకవచనం యూపస్తంభం అంటే యజ్ఞాన్ని ప్రారంభించబోయేముందు, దేవాలయంలో, ధ్వజస్తంభంలాగా యజ్ఞవేదికప్రాంగణంలో నాటే యూపము అనే చెట్టు స్తంభం నాలుక యజ్ఞాగ్ని అని, రోమాలు దర్భలుఅని, శిరస్సు బ్రహ్మకు, కక్షలు ఉద్గాతకు, జననేంద్రియాలు హోతకు సంకేతాలని వానిని సంతృప్తిపరచవలసిందని రెండు కళ్ళు రేయింబవళ్ళకు సూచన అని, చెవికి గల ఆభరణాలు వేదాంగాలని, పీల్చినగాలి అంతరాత్మఅని, ఎముకలు మంత్రాలని,

రక్తం సోమరసమని వివరించాయి.

**3:5:6: నరసింహమూర్తి :**

కూర్మపురాణం, వాయుపురాణం, పద్మపురాణం, భాగవతపురాణం, నరసింహమూర్తి ఆవిర్భావాన్ని గూర్చి వివరించాయి. కశ్యప, దితులకు జన్మించిన రాక్షసుడు హిరణ్య కశిపుడు. ఇతడు తపోబలం వల్ల పగలుకాని, రేయికాని కానపుడు, మానవులు జంతువులుకానివారిచేత, జీవించి, మరణించిన సాధనాలచేత, కింద, పైన కాని సంస్థితిలో మాత్రం మరణంపొందే స్థితిని వరంగా పొందుతాడు. అప్పుడు విష్ణువు నరసింహ రూపాన్ని ధరించి తన తొడల మీద పెట్టి, సంధ్యాసమయంలో గోళ్ళతో చీల్చి చంపినట్లు ఐతిహ్యం వరాహమూర్తిచే చంపబడిన హిరణ్యాక్షుని సోదరుడే హిరణ్యకశిపుడు

**3:5:6:1:** నరసింహ మూర్తి ప్రతిమలలో నాలుగు ప్రధాన రకాలున్నాయి అవి. 1. గిరిజానరసింహమూర్తి లేక కేవల నరసింహమూర్తి 2. స్థాణ నరసింహమూర్తి 3. యానక నరసింహమూర్తి. 4. లక్ష్మీ నరసింహమూర్తి. ఈ ప్రతిమలను గూర్చి ఈ క్రింది విధంగా వివరించవచ్చు,

**3:5:6:2:1: గిరిజా నరసింహమూర్తి :**

ఈ రూపాన్నే కేవల నరసింహమూర్తి అని కూడా పిలుస్తారు. ఈ రూపంగల మూర్తి ఉత్కుతి కాసనంతో పద్మంమీద కూర్చొన్నట్లు గాని, పద్మాసనం లో ఉన్నట్లుగాని చూపబడతాడు. కాళ్లకు ముందు వెనుకల యోగపట్టబంధం ఉంటుంది. ఈ మూర్తికి రెండు లేదా నాలుగు చేతులుంటాయి. నాలుగు చేతులున్నప్పుడు కుడిచేతిలో చక్రం, పై ఎడమ చేతిలో శంఖం ఉండగా మిగిలిన రెండు చేతులు మోకాళ్లమీద ఆన్చి ఉండడం జరుగుతుంది. ఈ మూర్తిని వర్ణిస్తూ 'శిల్పరత్నం'లో మిగిలిన రెండు చేతులలో గదా, పద్మాలను చూపాలని చెప్పబడింది. ఒక్కొక్కసారి ఈ మూర్తిని సింహాసనం మీద కూర్చుండినట్లు చూపుతారు. అప్పుడు కుడికాలు వేలాడుతుండగా ఎడమ కాలు పీఠంమీద మడిచి ఉంటుంది. రెండుచేతులలో శంఖ చక్రాలు ధరించి, ఒక చేయి (ముందుకుడిచేయి) అభయ ముద్రలో ఉండగా, ఎడమ చేయి కట్యవలంబితముద్రలో ఉంటుంది ఈ మూర్తి శిరస్సు పై కరండమకుటం. ఉండడం సాంప్రదాయం. ఈ మూర్తినే యోగనరసింహమూర్తి అని కూడా పిలుస్తారు. ఎడమ వైపున నీలోత్పలాన్ని ధరించిన భూదేవిని, కుడివైపు పద్మాన్ని ధరించిన లక్ష్మిని చూపాలి. భూదేవిని నల్లని రంగులోను, లక్ష్మిని బంగారు పచ్చరంగులోను చూపాలి.

**3:5:6:3: స్థాణ నరసింహమూర్తి :**

స్తంభం నుండి నరసింహుడు ఆవిర్భవించడం వల్ల ఈ మూర్తిని స్థాణ నరసింహమూర్తి అంటారు ఎంతో కోపాన్ని చూపడం వల్ల ఉగ్రనరసింహమూర్తి అనీ అంటారు. (చూడుడు ఫోటో 6 ఉగ్రనరసింహమూర్తి) సింహాసనం మీద కూర్చున్న ఈ మూర్తి తన నాలుగు చేతులలో పై రెండు చేతులలో శంఖ, చక్రాలు ధరించ, కుడిచేతిని అభయ లేక వరద ముద్రలో చూపాలి. ఎడమ చేతిని తొడపై ఆన్చాలి ఎర్రని వస్త్రాన్ని ధరించిన ఈ మూర్తి

తెల్లని శరీరం కలవాడు కాని వేరొక వైఖానసాగమ ప్రతిమలో ఈ మూర్తి 12 లేక 16 చేతులండి త్రిభంగిమలో ఉండడం, ఎడమతొడపై హిరణ్యకశిపుని చీలుస్తున్నట్లు చూపాలని చెప్పడం జరిగింది. దీనిలో కేవలం ఎనిమిది చేతులుంటే నాలుగింటిలో శంఖ, గద, చక్ర, పద్మాలను చూపి, రెండు చేతులలో హిరణ్యకశిపుని కడుపు చీలుస్తున్నట్లు చూపాలి. మిగిలిన రెండు చేతులలో శరీరం నుంచి లాగిన పేగులను మాలలుగా దాల్చాలి. ఈ మూర్తిని బంగారు పచ్చరంగు లోగాని, పసుపు గోధుమ రంగులోగాని, నీలంరంగులోగాని చూపాలి. విష్ణుధర్మోత్తర పురాణం ప్రకారం ఈ మూర్తినీలిరంగు అంగవస్త్రం ధరించి, ఆలీఢఆసనంలో ఉండాలి. ఈ నరసింహుడు పరమాత్మ వికాసాన్ని కలగచేస్తాడని విష్ణుధర్మోత్తర ప్రవచనం

**3:5:6:4: యానక నరసింహమూర్తి :**

ఈ మూర్తిని గరుడుడుగాని, ఆదిశేషుడుగాని మోస్తున్నట్లు చూపాలి నాలుగు చేతులు గల ఈ మూర్తి పై ఎడమ, కుడి చేతులలో శంఖ, చక్రాలు ధరించాలి నరసింహుని శిరస్సుపై ఐదుపడగల ఆదిశేషుని గొడుగులాగ చూపాలి కాని ఈ రకమైన యానక నరసింహమూర్తిప్రతిమ అతి అరుదైనది.

**3:5:6:5: లక్ష్మీనరసింహమూర్తి :**

ఈ మూర్తిని పద్మాసనంలో ఆసీన స్థితిలో చూపాలి. ఎడమ తొడమీద లక్ష్మిని ఉంచి ఆమె పాదాలను ఒక పద్మం తాకేలా తీర్చాలి పైని ఎడమ, కుడి చేతులు శంఖ, చక్రాలు ధరించగా కింది కుడిచేయి అభయ ముద్రలోను, ఎడమ చేయి లక్ష్మిని కౌగిలించుకొంటున్నట్లు చూపాలి లక్ష్మి కుడిచేతిని నరసింహుని వీపు మీద ఉంచగా, ఎడమ చేతితో పద్మాన్ని ధరించి ఉంటుంది ఆలీఢాసనంలో ఉన్న గరుడుని కూడా ఎప్పుడైనా చూపవచ్చు.

**3:5:6:5:1:** నరసింహ మూర్తి భావనలో ఒక స్తంభారాధన, ఒక సంకేతారాధన (టోటెమిజం/ టోటెమిక్ కల్ట్) మిళితమై ఉన్నాయని చంపక లక్ష్మి వ్యాఖ్య లక్ష్మీనరసింహుని ప్రతిమలలో హాలీబీడు, బాదామి, ఎల్లోరా, దాడికొంబు మొదలైన చోట్ల గలవి పేరు పొందాయి. వరాహలక్ష్మి నృసింహుని వంటి మూర్తులు (ఇది సింహాచలంలో ఉన్నది) కేవలం అసాంప్రదాయకమైన కోవకు చెందినవే అనవచ్చు లక్ష్మీ నరసింహుడు ఓజస్సును, కీర్తిని, బ్రహ్మ జిజ్ఞాసను కలిగిస్తాడు. ఇతడు అనేక మంది ఉపాసించిన దైవమూర్తి.

**3:5:7: వామనమూర్తి :**

వామనమూర్తి విష్ణువుఐదవ అవతారం ప్రహ్లాదుని మనుమడయిన బలి చక్రవర్తి ఔన్నత్యాన్ని అణచివేసి ఇంద్రుడి కి స్వర్గాధిపత్యాన్ని నిరాటంకం చేయడానికి గాను విష్ణువు వటువు (బ్రహ్మచారి) రూపంలో బలిచక్రవర్తి యజ్ఞశాలలను సమీపించి అతనిని తనకు కేవలం మూడడుగల నేలను దానం ఇమ్మని అదే తనకు ముల్లోకాలతో సమానమని చెప్పాడు. బలి చక్రవర్తి గురువు, పురోహితుడు అయిన శుక్రుడు వామనుని విష్ణ్వంశగా గుర్తించి బలిని దానం ఇవ్వవద్దని ఆదేశిస్తాడు. కాని ఆడిన మాట తప్పనని బలి గురువు ఆజ్ఞను ధిక్కరించి

వామనుడికి మూడడుగుల నేల దానం చేస్తాడు. అప్పుడు, వామనుడు త్రివిక్రముడై ఒక అడుగుతో నేలను, ఒక అడుగుతో ఆకాశాన్నిఆక్రమించి, ఇంకో అడుగు ఎక్కడ పెట్టమంటావని బలిని అడగగా, తన తలపై పెట్టమని కోరతాడు. వామనుడు అప్పుడు బలిని పాతాళానికి అణగదొక్కి తనను బలికి కావలి వానిగా నియమించుకొంటాడు భాగవత పురాణంలో వామనావతార వృత్తాంతాన్ని ఎంతో మనోహరంగా చిత్రించడం జరిగింది.

**3:5:7:1:** వామన వృత్తాంతాన్ని ఋగ్వేదకాలంనాటికి సమన్వయించడానికి ఆధారాలున్నా, మొట్టమొదటిసారిగా వామనుని గూర్చి శతపథ బ్రాహ్మణంలో చెప్పబడింది దానిలో వామనుడికి, యజ్ఞానికి అభేదాన్ని చూపడం జరిగింది. ఈ వృత్తాంతాన్ని మత్స్య పురాణం, అగ్ని పురాణం, విష్ణుధర్మోత్తర పురాణం,వైఖాన సాగమం, రూపమండనం, శిల్పరత్నాలు కూడా అభివర్ణించాయి.

**3:5:7:2:** వామన మూర్తిని పంచతాళమానం ప్రకారం 56 అంగుళాలు మించకుండా చెక్కాలని శాస్త్ర సాంప్రదాయం. ఈ మూర్తి రెండు చేతులు కలిగి ఉంటాడు. ఒక చేతిలో కమండలును,ఇంకొక చేతిలో గొడుగును ధరించి ఉంటాడు కర్ణ కుండలాలు కృష్ణాజినం, యజ్ఞోపవీతంతో ఉన్న ఈ మూర్తిని కేవలం అంగవస్త్రాన్ని మాత్రం ధరించినట్లు చూపాలి. ఉంగరపు వేలికి పవిత్రాన్ని ( పవిత్రం అంటే యజ్ఞ దీక్ష పొందేముందు వేలికి పెట్టుకునే దర్భలతో చేసిన ఉంగరం వంటి విశేషం) ధరించినట్లు చూపాలి వైఖాన సాగమంలో గల ఈ రూపానికి అసమ రూపత ను ప్రతిపాదించే మరికొన్ని ప్రాంతీయ రూపాలు కూడా ఉన్నాయి. ఈ రూపాలలో వామనుని బాలునిగాగాక, అసమ రూపతతో కూడిన దేహం గలవానిగా చెక్కడం జరిగింది.

**3:5:7:3:** వామనుడితో పాటుగా త్రివిక్రముణ్ణికూడా చూపడం పద్ధతి. ఈ త్రివిక్రముని చెక్కడంలో మూడు పద్ధతులున్నాయి ఈ మూడుపద్ధతులలో ఎడమ కాలిని ఎత్తుతున్నట్లు చూపాలి. ఒక దశలో కుడి మోకాలి వరకు, రెండవ దశలో నాభివరకు , మూడవ దశలో పాలభాగం వరకు ఈ కాలిని ఎత్తి బలిని అణచివేస్తున్నట్లుచూపాలి. త్రివిక్రముని ప్రతిమను ఉత్తమ దశతాళ ప్రమాణంలో 124 అంగుళాల ఎత్తు ఉండేటట్లు చూపాలని శాస్త్ర సాంప్రదాయం. ఈ మూర్తికి నాలుగు లేదా ఎనిమిది చేతులను చూపాలి. నాలుగు చేతులంటే పై రెండిటిలోను శంఖ చక్రాలను చూపి, ఒక కుడిచేతిని అభయ లేక వరద ముద్రలో చూపి, ఒక ఎడమచేతిని కాలికి సమాంతరంగా ఉంచాలి ఎనిమిది చేతులున్నట్లయితే ఐదు చేతులలో శంఖం, చక్రం, గద, శార్ఙం,హలంను చూపి, మిగిలిన చేతులలో రెండింటిని అభయ, వరదముద్రల లో చూపాలి. ఇంకొకదానిని కాలికి సమాంతరంగా ఉంచాలి. ఈ మూర్తిని కృష్ణ వర్ణంలో ఎర్రని వస్త్రాన్ని ధరించినట్లు చూపాలి. కానీ "శ్రీ తత్వ నిధి" ప్రకారం త్రివిక్రముని ఛత్రాన్ని ధరించిన ఇంద్రుని, రెండువైపులా చామరాలు, ధరించిన వరుణ, వాయువులను చూపాలి. పై భాగంలో కుడి వైపు సూర్యుని, ఎడమ వైపు చంద్రుని విధిగా చూపాలి. వీరికి సమీపంలో సన్యాస, సనక, సనత్కుమారులను చూపాలి త్రివిక్రముని పాదాన్ని బ్రహ్మ తన చేతిలోని కమండలువులోని నీటితో కడిగినట్లు చూపాలి. ఆ విధంగా పారిన నీరే గంగ అని

ఐతిహ్యం ఈ కడిగిన నీరు తెల్లని మంచు వంటి రంగులో ఉండాలి. త్రివిక్రముని నాభి స్థాయిలో అంజలి ముద్రలో ఉన్న శివుని చూపాలి త్రివిక్రముని మోకాలి వరకు భూలోకమని, నాభివరకు అంతరిక్షలోకమని, శిరస్సువరకు స్వర్గలోకమని తలవడం వల్ల శివుని నాభికి, పాల భాగానికి మధ్యన చూపడం జరుగుతున్నది. త్రివిక్రముని పాదం వద్ద నముచి అనే రాక్షసుని అంజలి ముద్రలో చూపాలి. ఎడమ వైపున గరుత్మంతుని, రాక్షస గురువైన శుక్రుని పట్టుకొన్నట్లు, చూపాలి. త్రివిక్రముడికి కుడివైపున దానం స్వీకరించడానికి సిద్ధపడ్డవామనుని, అతని కెదురుగా బలిని చూపాలి. త్రివిక్రముని శిరస్సుపై దేవతల సంతోషాన్ని ప్రకటిస్తూ భేరిని మోగిస్తున్న జాంబవంతుని చూపాలి "విష్ణుధర్మోత్తరం" ప్రకారం త్రివిక్రముడు దండం, పాశం, శంఖం, చక్రం, గద, పద్మాలను ధరించినట్లు చూపాలి. శిల్ప రత్నం ప్రకారం త్రివిక్రముడు ఎడమ కాలిమీద నిలబడి, కుడికాలిని అంతరిక్షంలోకి చాచినట్లు చూపాలి.

**3:5:7:4:** త్రివిక్రముని మూర్తికి ఉదాహరణలను మనం, బాదామి, మహాబలిపురం, ఎల్లోరా, బేలూరు, మొదలైన చోట్ల చూడగలం

**3:5:8: పరశురామమూర్తి :**

విష్ణుని అవతారాలలో ఆవేశభావంగా చెప్పబడిన పరశురాముడు బ్రాహ్మణ క్షత్రియ సామాజిక సంబంధాలకు దైవత్వాన్ని ఆపాదించడం అనే ప్రయత్నానికి చక్కని ఉదాహరణ. పరశురాముని గూర్చి అగ్ని పురాణం, విష్ణు పురాణం, భాగవత పురాణం తెలియపరుస్తున్నాయి.

**3:5:8:1:** విష్ణు పురాణం పరశురాముని చరిత్రను గూర్చి వివరంగా తెల్పుతుంది. భృగు వంశానికి చెందిన రుచీకుడనే మహర్షిగాథిఅనే రాజుకుమార్తె అయిన సత్యవతిని వివాహమాడగోరతాడు గాధి తనకు తెల్లని దేహం, కలిగి, ఒక చెవి మాత్రం నీలిరంగులో ఉండే వేయి అశ్వాల గుంపు శుల్కంగా ఇమ్మని రుచీకుడిని అడుగుతాడు. వరుణుని ఉపాసించి, రుచీకుడు అశ్వ తీర్థం వద్ద ఆ గుర్రాలను పొంది, గాధికి ఇచ్చి సత్యవతిని పెళ్ళి చేసుకుంటాడు.

**3:5:8:2:** రుచీకుడు సత్యవతికి, తన అత్తగారికి సంతానం కోసం రెండు రకాలైన భక్ష్యాలు సిద్ధపరచి వారిని తినమంటాడు. సత్యవతి తనకు నిర్దేశించిన దానిని తల్లికిచ్చి, తల్లికోసం ఏర్పరచిన దానిని తాను తింటుంది రుచీకుడు విషయం తెలుసుకొని, భార్యపై కోపగించి ఆమెకు క్రూరవర్తనం గల కొడుకు పుడతాడనీ, అతడు నెత్తుటిని పారజేస్తాడని శపించబోగా, ఆమె తన భర్తను కోరి, తన కొడుకు కాక మనుమడు ఆ రకంగా అయ్యేటట్లు దిద్దమని వేడుకొంటుంది ఆమెకు కలిగిన వాడే జమదగ్ని సత్యవతి తల్లికి గలిగన వాడు విశ్వామిత్రుడు. ఈ జమదగ్ని కుమారుడే హైహయవంశాన్ని విచ్ఛిన్నం చేసి క్షత్రియులను అంతం చేసిన పరశురాముడు. ఇతడు తన తండ్రి ఆజ్ఞ ప్రకారం తల్లిని కూడా చంపినవాడు. మరల తండ్రి ఆదేశం మేరకు తల్లిని పొందగలిగాడు ఈ మే రేణుకాదేవి. ఎల్లమ్మఅని, ఏకవీర అని అనేక మందిచే ప్రాంతీయ దేవతగా పూజింపబడుతున్నది. ఈ పరశురాముడు కూడా ఈ నాటికీ మహేంద్ర పర్వత ప్రాంతంలో చిరంజీవిగా ఉన్నాడని శాస్త్ర వచనం.

**3:5:8:3:** వైఖాన సాగమం ప్రకారం పరశురాముని ప్రతిమను మధ్యమ దశతాళమానం ప్రకారం 120 అంగుళాలు పొడవు ఉండేటట్లు చూపాలి రెండు చేతులు గల ఈ మూర్తికి కుడి చేతిలో పరమశివును, ఎడమ చేతిని సూచీముఖ హస్తంలోను చూపాలి. శిరస్సుపై జటామకుటం, శరీరం పై యజ్ఞోపవీతం విధిగా చూపాలి. తెల్లని వస్త్రాలలో నున్న ఈ మూర్తి ఎర్రనివాడు అగ్నిపురాణం ప్రకారం పరశురాముడు నాలుగు చేతులు కలిగి వానిలో పరశు, ఖడ్గ, బాణ, ధనస్సులను ధరించి ఉండాలి. కాని నాలుగు చేతులతో ఉన్న పరశురామ మూర్తి ప్రతిమలు అరుదే అని చెప్పాలి

**3:5:9: రఘురామమూర్తి :**

ఆది కావ్యమైన రామాయణానికి నాయకుడు, భారతదేశంలో ధర్మనిష్ఠకు, సత్యవ్రతానికి ఆదర్శప్రాయుడైన శ్రీరాముడు రఘువంశానికి చెందిన, సూర్యవంశ క్షత్రియుడు కావడం వల్ల క్షత్రియ ప్రాబల్యాన్ని మత సాంప్రదాయాలలో సూచించడానికి తోడ్పడ్డ రఘురాముడు అనేక దేవాలయాలలో మూల విరాట్టుగాను, శిల్పంగాను కన్పిస్తుంటాడు. రామాయణంలోని ఉత్తర కాండ రామావతార వివరాలను చెప్పగా, రామోపనిషత్తులు రామావతార తత్వాన్ని, రాముని అవతార తత్త్వ రహస్యాలను వివరిస్తున్నాయి

**3:5:9:1:** సామాన్యంగా రామప్రతిమను విడిగా చూడం అతని ధర్మపత్ని అయిన సీత, అతని పార్శ్వ వర్తి అయిన లక్ష్మణుడు, అతని సేవకు డైన హనుమంతుడు, ఒక్కొక్కసారి అతని ఇతర సోదరులైన భరత, శత్రుఘ్నులు కూడా కలిసే ఉంటారు.

**3:5:9:2:** ఈ ప్రతిమ అతిమానుష స్వభావాన్ని అభివ్యక్తం చేస్తూ రెండే చేతులు కలిగి ఉంటుంది. కుడిచేతిలో బాణాన్ని ఎడమ చేతిలో ధనుస్సును చూపాలి. మధ్యమదశ తాళమానం ప్రకారం ఈ ప్రతిమ 120 అంగుళాలకన్న ఎత్తుగా ఉండకూడదు ఈ మూర్తి త్రిభంగిమలో ఉన్న స్థానక మూర్తి. ఎర్రని వస్త్రాలలో, నల్లని రూపం గల మూర్తి, రామునికి కుడివైపున నవార్థ (9½) తాళమానంలో చేసిన సీతాప్రతిమను ఉంచాలి. ఆ ప్రతిమ, సమభాగంలో, రాముని భుజాల వరకు వచ్చేటట్లు ఉండాలి ఆ ప్రతిమ బంగారు రంగులో చిలుకాకుపచ్చ వస్త్రాలను కలిగి ఉండాలి రాముని తల మీద కిరీట మకుటం, సీత తలమీద కరండ మకుటం ఉండాలి సీత తన ఎడమ చేతిలో నీలోత్పలాన్ని ధరించి, కుడిచేతిని జారవిడిచినట్లు చూపాలి.

**3:5:9:3:** రాముడికి ఎడమ వైపున 116 అంగుళాలు మించిన లక్ష్మణుని ప్రతిమ ఉడాలి. ఆ ప్రతిమ రాముని భుజాల వరకు లేదా చెవుల వరకు ఉండాలి, నల్లని వస్త్రాలలోని బంగారు పసుపు పచ్చని ఈ మూర్తి అన్ని విధాలా రాముని పోలి, ధనుర్బాణాలు ధరించి ఉండాలి.

**3:5:9:4:** రాముడికి ఎదురుగా కొంచెం కుడివైపున 84 అంగుళాలు మించని రెండు చేతులు గల హనుమంతుని ప్రపత్తితో చూపాలి. ఒక చేతిని నోటిమీద ఉంచుకొని వేరొక చేతిని జార విడిచినట్లు చూపాలి. విష్ణుధర్మోత్తరం ప్రకారం భరత శత్రుఘ్నుల ప్రతిమలు కూడా చూపాలి. కాని ఈ ప్రతిమలలో, రామునికి మినహా ఏ మూర్తికి, కిరీటమకుటాలంకరణ ఉండదు.

**3:5:9:5:** వైష్ణవాలయాల్లో ఆగ్నేయ దిశలో రామాలయాన్ని నిర్మిస్తారు. రామునితో పాటు భరతుడికి కూడా శ్రీ వత్స చిహ్నం, కౌస్తుభాలంకరణ చూపడం జరుగుతున్నది. వైఖానసాగమం ప్రకారం సీతాదేవి ఎక్కువగా కుడికాలిమీద నిలబడి, ఎడమ కాలిని కొంచెం వంచినట్లు చూపాలి.

**3:5:9:6:** అనేక శిల్పాలు, కంచుప్రతిమలు రాముడికి గల ప్రాచుర్యాన్ని, రామార్చనకు గల ప్రాశస్త్యాన్ని తెలుపుతున్నాయి మహాబలిపురం, రామేశ్వరం త్రివేంద్రం మొదలైన చోట్ల ప్రసిద్ధ రామ ప్రతిమలు ఉన్నాయి.

**3:5:9:7:** రాముడు వీరాసనంలో ధ్యానంలో ఉండి నల్లని మేఘ కాంతితో ఉంటాడని,చేయి జ్ఞాన ముద్రలో ఉంటుందని, పార్శ్వంలో విద్యున్నిభ అయిన సీతరాముని వీక్షిస్తుంటుందని కూడా ఒక వర్ణన ఆమెకు సరోరుహల వంటి చేతులుంటాయి

## 3:5:10: శ్రీ కృష్ణావతారమూర్తి :

హిందూసాంప్రదాయంలో కేవలం అవతారమని కాకుండా పూర్ణపురుషుడుగా, తన అన్న అయిన బలరాముని నిగ్గను కూడ కప్పివేసేటంత గొప్పదనాన్ని కలిగి, శిశువుగాను, బాలుడుగాను, యువకుడుగాను, వృద్ధునిగాను అందరి సమ్మానాలు పొంది, మధుర భక్తి సాంప్రదాయానికి కేంద్ర ప్రాయమైన నవాడు శ్రీ కృష్ణుడు. ఈ అవతారం ద్వాపర యుగానికి చెందినది హరివంశం, భాగవత దశమస్కందం, మహాభారతం ఈ అవతార ప్రాశస్త్యాన్ని వివరాలను ఉగ్గడిస్తున్నాయి. వటపత్రశాయిగా, నవనీత నర్తన మూర్తిగా, కాళియమర్దనమూర్తిగా, వేణుగోపాలుడుగా, మదన గోపాలుడుగా, రాజగోపాలుడిగా, పార్థసారధిగా అనేక రూపాలతో అనేక భక్తుల ప్రపత్తిని పొందినవాడు శ్రీ కృష్ణుడు. ఇతడు కాళీయ మర్థన మూర్తిగా తనకు ముందుగల సర్పపూజను అణచివేశాడనే గోపీనాథరావు వ్యాఖ్య శ్రీకృష్ణ తత్వాన్ని లౌకిక ప్రమాణంలో అర్థచేసుకోవడానికి జరిపిన కొన్ని ప్రయత్నాలు శ్రీకృష్ణుడికి 'మాయోన్' అనే తమిళ జానపద దేవుడికి గల సంబంధం నిశితవిమర్శకు లోనై 'మాయోన్ శ్రీ కృష్ణుడికి, శ్రీ కృష్ణ తత్వానికిగల తొలిదశను సూచిస్తున్నట్లు విమర్శకుల అంగీకారం కాని శిల్ప శాస్త్ర, ఆగమ గ్రంథాలలో ఎక్కడా శ్రీకృష్ణుడికి ఇన్ని రకాలైన ఇదమిత్థమైన రూపాలుండాలని చెప్పబడలేదు దానివల్లనే శ్రీ కృష్ణుడికి గల నేపధ్యం అగాథమైందని అర్థమవుతోంది. రాముని అవతారం పాలకులలైన వారి ఔన్నత్యాన్ని సూచించగా, శ్రీ కృష్ణుని అవతారం, అతని తోటి వారయిన బలరామ (సంకర్షణ) ప్రద్యుమ్న అనిరుద్ధ, సాంబులు రాచరికాన్ని హక్కుగా లేని క్షత్రియ వంశస్థుల సామాజిక ఔన్నత్యానికి చక్కని ఉదాహరణ సభాపర్వంలో శిశుపాలుడు శ్రీ కృష్ణుడు చేసిన నిందలు కృష్ణునిలోని సామాజికమైన అనేకలోపాలను ఎత్తిచూపినా, "శూరుల జన్మంబు సురల జన్మంబును ఏరుల జన్మంబు నెఱుగనగునే", అనే ఆర్యోక్తి ప్రకారం శ్రీ కృష్ణుని గొప్పదనాన్ని అందరూ అంగీకరించినట్లు విశదమౌతోంది. శ్రీకృష్ణుని ఆవిర్భావానికి 'మాయోన్‌లో ఒకానొక జానపద నేపథ్యం ఉండి ఉంటుంది. అనే భావన సాంప్రదాయకుల దృష్ట్యా ప్రశ్నార్థమే అయినా, నవీన శాస్త్ర విశ్లేషణల దృష్ట్యా కొంతవరకు

సమంజసమే అనాలి.

**3:5:10:1: బలరాముడు :**

శ్రీ కృష్ణుని తో బాటుగా బలరాముని మూర్తికి కూడా ప్రాచుర్యం వచ్చింది. వాస్తవానికి బలరాముని ప్రతిమ మధ్యమదశ తాళమానం ప్రకారం 120 అంగుళాలు మించకుండా చేయాలి. రెండు చేతులతో ఈ మూర్తి కుడిచేత ముసలాన్ని (రోకలిని), ఎడమ చేతహలాన్ని(నాగలిని) ధరించి ఉండాలి. ఎర్రని వస్త్రాలలో గల తెల్లని ఛాయవాడితడు. బృహత్సంహిత ప్రకారం ఇతని కన్నులు మత్తుతో ఉండాలి. అగ్ని పురాణం రెండు చేతులుగల, నాలుగు చేతులు గల రెండు బలరామ ప్రతిమలను సూచిస్తున్నది రెండు చేతులుంటే రెండింటిలో గదను, హలాన్ని ధరించినట్లు చూపాలి నాలుగు చేతులుంటే కుడి పై చేయి ముసలాన్ని ఎడమ చేయి హలాన్ని, కుడి కింది చేయి చక్రాన్ని, ఎడమ కింది చేయి శంఖాన్ని ధరించినట్లు చూపాలి. బలరాముడికి కుడివైపున రేవతీదేవిని పుష్పవస్త్రంలో చూపాలి. ఆమె కుడి చేత పద్మాన్ని ధరించి, ఎడమ చేతిని జార విడుస్తుంది

**3:5:10:1:1:** బృహత్సంహిత ప్రకారం బలరామ, కృష్ణులకు మధ్య రెండు లేక నాలుగు లేక ఎనిమిది చేతులు గలదుర్గాదేవిని స్థానకమూర్తిగా చూపాలి.

**3:5:10:2: శ్రీ కృష్ణుడు :**

వైఖానసాగమం ప్రకారం ఈ మూర్తి 120 అంగుళాల కన్న హెచ్చు ఉండరాదు నల్లనిరంగుతో, ఎర్రని వస్త్రాలతో వివిధ ఆభరణాలు ధరించి ఉంటాడు. శిరస్సుపై కిరీటమకుటంగాని, జటాబంధంగాని చూపాలి కుడిచేతిని చేగోల ధరించినట్లు, ఎడమ చేతిని మోచేతి దగ్గర మడచినట్లు చూపాలి. ఈ చేతిలో శంఖం కూడా ఉండవచ్చు. శ్రీకృష్ణుని కుడివైపున రుక్మిణిని చూపాలి. ఈమె బంగారు ఛాయలో ఉంటుంది శ్రీకృష్ణుని ఎడమ వైపున నల్లని రంగులో ఉన్న సత్యభామను చూపాలి. ఈమెకుడిచేతిలో ఒక అలంకార సుమాన్ని ధరించాలి ఈ దేవేరు లిద్దరూ కరండ మకుటాన్ని కలిగి ఉండాలి అని ఇతర ఆధారాలలో నిరూపించబడినట్లు వైఖాన సాగమంలో చెప్పబడింది

**3:5:10:1:** కాని విష్ణుధర్మోత్తర పురాణంలో వీరి వర్ణన ఇంకోక విధంగా ఉంది. శ్రీకృష్ణుడు ఒక చేత చక్రాన్ని ధరించి, ఇంకొకచేతిలో అభయాన్నివ్వాలని, రుక్మిణి ఒకచేత పద్మాన్నిగాక, నీలోత్పలాన్ని ధరించాలని పేర్కొనడం జరిగింది

**3:5:10:2:2:** కేవల శ్రీ కృష్ణమూర్తులలో నవనీత నృత్తమూర్తి వేణుగోపాల మూర్తి, మదనగోపాల మూర్తి పార్థసారథి, కాళీయ మర్ధనమూర్తి, గోవర్ధన ధారి ప్రశస్తమైనవి. దీనిలో వేణుగోపాలమూర్తిని గోవులచేత, గోపాలుర చేత చుట్టుబడి త్రిభంగిమలో గాని, విషమ భంగిమలో గాని వేణువు వాయిస్తున్నట్లుచూపడం జరుగుతుంది. మదనగోపాలమూర్తి ఇంచుమించు వేణుగోపాలమూర్తిలానే ఉంటుంది. ఇతడు పద్మం, పరాశువు, చక్రం, పాశం, శంఖం, ఇక్షుకోదండం (చెరకువిల్లు) కలిగి ఉండాలి ఈ మూర్తితోకూడా శ్రీకృష్ణుని వేణుగాన లోలుడుగానే చూపిస్తారు. కాని మన్మధుని చిహ్నాలైన చెరకువిల్లు ఉండడం వలన శ్రీతత్వనిధిలో ఈ మూర్తిని మదన

గోపాల మూర్తిగా అభివర్ణించడం జరిగింది.

**3:5:10:2:3:** కాళీయ హ్రదంలోని కాళీయుడనే సర్పాన్ని అణచివేసిన మూర్తిని కాళింగ మర్థన మూర్తి (చూడుడు ఫోటో 7 కాళీయ మర్థనమూర్తి)లో చూడవచ్చు కుడిచేత అభయం ఇస్తూ ఎడమ చేత సర్పం తోకను పట్టుకొని, ఎడమ కాలిని పడగమీద ఉంచి, కుడికాలిని కొంచెం ఎత్తినట్లుగా చూపే ఈ ప్రతిమ బాలకృష్ణుణి అందాలు చెప్పే రమ్యమైన శిల్పం. గోవర్థనగిరిధారి ప్రతిమ ఇంద్రుని రాళ్ళ వాన నుంచి గోవులను, గోపాలురను రక్షించిన శ్రీ కృష్ణుని పోలినది. పార్థసారథి జ్ఞాన స్వరూపుడైన శ్రీకృష్ణునిది.

**3:5:10:2:4:** వీనికి తోడు బాల కృష్ణుడు, వట పత్రశాయి, సంతానగోపాలుడు అనే రూపాలుకూడా ఎక్కువ ప్రాశస్త్యాన్ని పొంది, తరచుగా రాయి దంతం , కంచులోహాలలో లభ్యమౌతున్నాయి లేపాక్షి వీర భద్రేశ్వర స్వామి ఆలయం సభామండపం కప్పంలో గల అనేక వర్ణచిత్రాలలో సమ్మోహనకరుడైన వటపత్రశాయి చిత్రాన్ని కూడా గమనించవచ్చు. ఈ రకమైన కృష్ణుణి అవతారం ఎంతగొప్పదో, అతని మూర్తులు అంతే ఎక్కువ, పేర్కొన నలవికానివి అనే వైఖానసాగమంలోని ప్రకటన ఈ అవతారంలోని ఔన్నత్యాన్ని వైవిధ్యాన్ని గుర్తించడానికి ఒక సూచన.

**3:5:11: బుద్ధావతారమూర్తి :** బుద్ధావతారంగాఅంగీకరించడానికి పౌరాణిక వాఙ్మయంలోనే ఒకే అభిప్రాయంలేదు. విష్ణుపురాణం బుద్ధుని అవతారంగా గుర్తించింది కాని మిగిలిన కొన్ని పురాణాలు బుద్ధుని అవతారంగా గుర్తించలేదు అగ్ని పురాణం బుద్ధుడు జినుని కుమారుడని పేర్కొంది. విష్ణు పురాణంలో పరాశరుడికి, మైత్రేయునికి మధ్య జరిగిన సంభాషణలో బౌద్ధులనే నగ్నులని పేర్కొనడం జరిగింది త్రిపురాసుర సంహార సందర్భంగా శివుడిపై త్రిపురాసురలకు గల భక్తిని పోగొట్టడానికి విష్ణువు అవతరించి నాస్తిక, అవైదిక భావాలను ప్రోత్సాహించి ప్రచారం చేశాడని ఒక ఐతిహ్యం. బృహత్సంహిత, అగ్ని పురాణం, విష్ణు ధర్మోత్తర పురాణాల్లోని బుద్ధుని ప్రతిమకు ఇదమిత్థమైన స్వరూపం నిరూపింపబడింది. బుద్ధుడు పద్మాసనంలో కూర్చున్నట్లు చూపాలి. పాదాలపైన అరచేతులపైన పద్మచిహ్నాలు ఉండాలి. శరీరం నాజూకుగా, హుందాగా, కారుణ్య భావన కనబడేటట్లుంటాలి ఇతడు కాషాయ వస్త్రాన్ని ధరించి భుజం మీద వల్కాని (ఉత్తరీయం వంటివస్త్ర విశేషం) కలిగి ఉండాలి. చేతులు వరద, అభయముద్రలలో ఉండాలి ఈ రకమైన వర్ణన కేవలం ధ్యాని బుద్ధునికి చెందింది.

**3:5:111** వాస్తవానికి బుద్ధుని చెక్కిన చోట్ల అతడిని ధ్యానస్థుడుగా చూపడం, అతని చేతులను యోగముద్రలో ఉంచడం, అతని శిరస్సువద్ద ప్రభావళిని తీర్చిదిద్దడం జరిగింది

### 3:5:12: కల్క్యవతారమూర్తి :

విష్ణు పురాణం ప్రకారం కలియుగంలో యమనియమాలు, వైదికాచారాలు పూర్తిగా అంతరించి, జనం నరకంవైపు పోతుండగా, 'శంభం' గ్రామానికి చెందిన విష్ణుయశుడనే బ్రాహ్మణునికి కుమారుడుగా విష్ణువు అవతరిస్తాడు. అనేక దివ్యశక్తులు గల ఈ మూర్తి అధర్మాన్ని అణచి ధర్మాన్ని స్థాపిస్తాడు ఈ అవతామూర్తి నాలుగు చేతులలో శంఖం, చక్రం, ఖడ్గం, ఖేటకాలను

ధరించి, అశ్వాన్ని ఎక్కినట్లు చూపాలి ఈ మూర్తిలో ఒక విలక్షణమైన క్రోధభావాన్ని, భీకరత్వాన్ని అభివ్యక్తం చేయాలి అగ్ని పురాణం విష్ణు ధర్మోత్తరపురాణం కూడా కల్క్యవతార మూర్తిని గురించి ఒకే రకంగా వివరంగా వర్ణించాయి.

**3:6: చతుర్వింశతి మూర్తులు :**

విష్ణు మూర్తి ప్రతిమలలో అవతారమూర్తుల తరువాత ప్రాముఖ్యం పొందినవి చతుర్వింశతి మూర్తులు ఇవి అన్నీ ప్రధానంగా శంఖ, చక్ర, గదా, పద్మాలను ధరించినా, ఆ ధోరణిలో ఉండే వ్యత్యాసం ఈ మూర్తుల వ్యక్తిగత లక్షణాలకు గుర్తు 'రూపమండనం'లో ఈ 24 మూర్తులను నిరూపించడం జరిగినట్లు గోపీనాథరావు తెలియపర్చారు. ఆ ఇరవైనాలుగు మూర్తులు కేశవుడు నారాయణుడు, మాధవుడు, గోవిందుడు, విష్ణువు, మధుసూదనుడు, త్రివిక్రముడు, వామనుడు, శ్రీధరుడు, హృషీకేశుడు, పద్మనాభుడు, దామోదరుడు, సంకర్షణుడు, వాసుదేవుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, పురుషోత్తముడు, అధోక్షజుడు, నరసింహుడు, అచ్యుతుడు, జనార్థనుడు, ఉపేంద్రుడు, హరి, శ్రీకృష్ణుడు, ఈ మూర్తులు ఇరవై నాల్గింటిలోను కృష్ణుడు సంకర్షణుడు (బలరాముడు) ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు పంచవీరారాధనలో ప్రధానులని, వీరు కాక సాంబుడు లేక సాత్యకి కలసి వృష్ణి వంశస్థులైన పంచవీరులని తెలుస్తున్నది. వీరిలో జ్ఞానానికి, బలానికి సంకర్షణుడిని, ఐశ్వర్యానికి,వీర్యానికి ప్రద్యుమ్నుడిని, శక్తికి, తేజస్సుకు అనిరుద్ధుడిని అధిపతులుగా చెప్పడం జరిగింది. వీరిలో సంకర్షణుడు శ్రీకృష్ణుని అన్న, ప్రద్యుమ్నుడు కుమారుడు, అనిరుద్ధుడు పౌత్రుడు ఈ రకమైన పంచవీరారాధనతో బాటుగా ఇరవైనాలుగు రూపాలలోను కేశవ, మాధవ, మధుసూదన, పద్మనాభులు ఎక్కువ ప్రశస్తినందిన వారు. వారి పేర్లతో విడిగా దేవాలయాలు కూడా నిర్మితమైనట్లు చారిత్రకాధారాలున్నాయి

**3:6:1:** కేశవుడు నాలుగు చేతులు కలిగి పై కుడిచేతిలో శంఖాన్ని, కింది కుడిచేతిలో పద్మాన్ని, పై ఎడమ చేతిలో చక్రాన్ని, కింది ఎడమ చేతిలో గదను ధరించి ఉంటాడు. కేశవుడికి 'కీర్తి' అనే శక్తి ఉన్నట్లు నారద పాంచరాత్రా గమంలో చెప్పడం జరగింది

**3:6:2:** మాధవస్వామి పై కుడిచేత చక్రాన్ని, కింది కుడిచేత గదను, పై ఎడమ చేత శంఖాన్ని, కింది ఎడమ చేత పద్మాన్ని ధరించి, తుష్టి అనే శక్తితో ఉంటాడు

**3:6:3:** మధుసూదనుడు పై కుడిచేత శంఖాన్ని, కింది కుడిచేత చక్రాన్ని, పై ఎడమ చేత పద్మాన్ని, కింది ఎడమ చేత గదను ధరించి ఉంటాడు. ఇతనీ శక్తి ని గూర్చి చెప్పడం జరగలేదు.

**3:6:4:** పద్మనాభుడు పై కుడిచేత పద్మాన్ని, కింది కుడిచేత శంఖాన్ని, పై ఎడమ చేత చక్రాన్ని, కింది ఎడమ చేత గదను ధరించి ఉంటాడు. శ్రద్ధాదేవి ఇతని శక్తి

**3:6:5:** సంకర్షణుడు పై కుడిచేత శంఖాన్ని, కింది కుడిచేత గదను, పై ఎడమ చేత పద్మాన్ని, కింది ఎడమచేత చక్రాన్ని ధరించి ఉంటాడు. 'సరస్వతి' ఇంతని శక్తి.

**3:6:6:** వాసుదేవుడు పై కుడిచేతశంఖాన్ని, కింది కుడిచేత గదను, పై ఎడమ చేత చక్రాన్ని, కింది ఎడమ చేత పద్మాన్ని ధరించి ఉంటాడు. లక్ష్మి ఇతని శక్తి.

**3:6:7:** ప్రద్యుమ్నుడు పై కుడిచేత శంఖాన్ని కింది కుడిచేత చక్రాన్ని పై ఎడమ చేత గదను, కింది ఎడమ చేత పద్మాన్ని ధరించి ఉంటాడు. 'ప్రీతి' ఇతని శక్తి.

**3:6:8:** అనిరుద్ధుడు పై కుడిచేత గదను, కింది కుడిచేత చక్రాన్ని పై ఎడమ చేత శంఖాన్ని, కుడి ఎడమ చేత పద్మాన్ని ధరించి ఉంటాడు 'రతి' ఇతని శక్తి.

**3:6:9:** ఈ చతుర్వింశతి మూర్తులను గూర్చి పద్మపురాణంలోని పాతాళఖండంలో కూడా చెప్పడం జరిగింది. ఈ చతుర్వింశతి మూర్తులు కలిసి శక్తి మాయావ్యూహాన్ని సూచిస్తారు. పరవాసుదేవుని నుంచి కేశవ, నారాయణ, మాధవులు, సంకర్షణుని నుంచి గోవింద, విష్ణు మధుసూదనలు; ప్రద్యుమ్నుని నుంచి త్రివిక్రమ, వామన, శ్రీధరులు; అనిరుద్ధునినుంచి హృషీకేశ పద్మనాభ దామోదరులు ఆవిర్భవించినట్లు అహిర్బుధ్న్య సంహితలో చెప్పడమైంది. ఈ శక్తి మాయావ్యూహం బృహద్బ్రహ్మసంహితలో కూడా వివరించబడింది.

**3:6:10:** దైవిక వాసుదేవుడికి గల జ్ఞానశక్తి, ఐశ్వర్య బల, తేజో, వీర్య, నిర్దోషాలను ఆరులక్షణాలను ఈ ఇరవైనలుగురు మూర్తులు తమ శక్తులతో కలిసి అందజేస్తారు.

**3:6:11:** విష్ణువే పురుషుడు, కపిలుడు, యజ్ఞమూర్తి, వ్యాసుడు, ధన్వంతరి, దత్తాత్రేయుడు, వైకుంఠనాధుడు, అనంతుడు, త్రైలోక్య మోహనుడు, విశ్వరూపుడు, లక్ష్మీనారాయణుడు (చూడుడు ఫోటో 8 లక్ష్మీ నారాయణమూర్తి) హాయగ్రీవుడు, ఆదిమూర్తిజలశాయి, ధర్ముడు, వరదరాజస్వామి, రంగనాధుడు వేంకటేశుడు, పండరీనాధుడు, జగన్నాధుడు, మన్మధుడు అనే భిన్న అవతారాలుగా రూపొందినట్లు వైఖానసాగమం, మార్కండేయ పురాణం వంటి ఆధారాల వల్ల తెలుస్తున్నది. ఈ మూర్తులన్నీ వివిధ దేవాలయాల్లో శోభిల్లుతూ, ఈ,ఈ, రూపాలకు గల చారిత్రక గతాన్ని, వైష్ణవ ప్రతిమల పరిణామాన్ని సూచిస్తున్నాయి. ఈ బిన్న అవతారాలన్నింటిలోనూ కపిలుడు, వ్యాసుడు, దత్తాత్రేయుడు, హాయగ్రీవుడు అనే వారినిజ్ఞాన రూపులుగా చెప్పడం జరిగింది.

# 4.

# హైందవ ప్రతిమలు – శివుడు

**4:1: ఉపోద్ఘాతం :**

**4:1:1:** హిందూమత సాంప్రదాయంలో త్రిమూర్తులలో ఒకడుగా లయకారకుడైనవాడు శివుడు. విష్ణువు కేవలం సత్త్వభావానికి ఆకరంగా ఉంటే శివుడు తమోభావానికి మాత్రం ఆకరం అని అనేవాళ్ళు లేకపోలేదు. ఇతడు శివుడు శుభప్రదుడు ఇతడు పశుపతి. ఇతడు యోగీశ్వరేశ్వరుడు. నిరంతరం దివ్యమైన ఆనందాన్ని, జ్ఞానాన్ని పొందగలిగినవాడు, ఇవ్వగలిగినవాడు శివుడు.

**4:1:2:** భారతదేశంలో శివుడు, అతని శక్తి అయిన సతి (పార్వతి) పరాశక్తి పూజలొందని ప్రాంతంలేదంటే అతిశయోక్తి కాదు. ద్వాదశ జ్యోతిర్లింగాలు, అష్టాదశ శక్తి పీఠాలు శివుడికి, శక్తికి గల ప్రాముఖ్యత ను విశేషంగా చూపిస్తాయి. "చితాభస్మాలే పోగరళమ శనం దిక్పటధరో, జటాధారీ కంఠే భుజగపతి హారీపశుపతిః; కపాలీ భూతేశో భజతి జగదీశైకపదవిం" అనే వర్ణన శివుడికి గల ఔన్నత్యానికి, శివుడికి కొందరు ఆపాదించిన పాషండత్వానికి గుర్తులు

**4:1:3:** శైవసాంప్రదాయ భారతదేశంలోని అనేక జానపద మతాల సమ్మేళనంగా అభివృద్ధి పొందింది అనడం ఏ మాత్రం అతి శయోక్తి కాదు నీటిని పూజించడం, నిప్పును పూజించడం, పాములను పూజించడం, ఎద్దు లను పూజించడం, స్త్రీత్వాన్ని పూజించడం, సంతానాన్ని పూజించడం. ఆటవికులను పూజించడం వంటి అన్ని ఆచారాలు కుప్పగా పోసిన రూపం శివుడు. ఇతడు గంగాధర మూర్తిగా గంగపూజను, త్ర్యంబకుడుగా నిప్పును పూజించడాన్ని, నాగభూషణుడుగా పాములను పూజించడం, వృషభారూఢమూర్తిగా ఎద్దులను పూజించడం, అర్ధనారీశ్వరమూర్తిగా స్త్రీత్వాన్ని పూజించడం, లింగోద్భవ మూర్తిగా సంతానాన్ని పూజించడం, కిరాతార్జున మూర్తిగా ఆటవికులను పూజించడం మొదలైన సాంప్రదాయాలకు మానవ రూపంలో ఉన్నదివ్య ప్రతీక.

**4:1:4:** శివుని గూర్చి, అతని విభూతిని గూర్చి శతరుద్రీయం ఎంతో వివరంగా చెప్పింది. శివరామమూర్తి తన వాఖ్యానంలో శతరుద్రీయంలోని అనేక ప్రతిమాభావనలకు వాస్తవమైన ప్రతిమాపూర్వక ఉదాహరణలను చూపించారు. ఏ రకంగా భగవద్గీతలో పదవ అధ్యాయం పరమాత్మ విభూతిని ఉగ్గడిస్తుందో, అదే విధంగా శతరుద్రీయం శివుని ప్రతిమా విభూతిని ఉగ్గడించినట్లు వారి వ్యాఖ్య ఈ శివుడు సర్వాంతర్యామి. విరూపుడు, విశ్వరూపుడు ఇతడే. సేన, సేనాపతి ఇతడు. నిషాదుడు, పుంజిష్ఠుడు ఇతడే . రథకారుడు, తక్షకుడు ఇతడే. కులాలుడు, కర్మారుడు ఇతడే. ఈ ికంగా సమాజంలోని అన్ని వర్గాలవారు శైవవిభూతిని కలిగినట్లు చూపడం శతరుద్రీయంలో జరిగిం ది.

**4:1:5:** శివుని ప్రతిమాస్వరూపాన్ని నిరూపించడంలో కొన్ని చోట్ల శివుడు విష్ణువు కన్న ఎక్కువని రుజువు చేయడం జరిగింది లింగోద్భవ మూర్తి శివుడే విష్ణువు, బ్రహ్మల కన్న

అధికుడని నిరూపించడంలో కృతకృత్యుడైన భావన అదే విధంగాశరభేశ్వర మూర్తి ఉగ్రనారసింహునిపై అధికారాన్ని చూపి విష్ణ్వంశ కన్నా శైవాంశ బలీయమైనదనిరుజువు చేయడానికి ఒక ఉదాహరణ. అదేవిధంగా క్షీరసాగర మధన సందర్భంగా హాలాహలాన్ని శివుడు మింగినట్లు చూపిన హాలహల భక్షణ మూర్తి శివుని ఔన్నత్యాన్ని చాటగా, హరిహర మూర్తి శైవవైష్ణవ శక్తుల మధ్య సమన్వయాన్ని, జగన్మోహినీ అవతారంలో విష్ణువు శివుని ఏ విధంగా వశపరచుకొన్నదీ చూపడం జరుగుతుంది.

**4:1:6:** శివుని ప్రతిమలలో ఒక ప్రధాన విశేషం ఉంది ఇతడు లాస్య, తాండవాలకు అధినాయకుడు. జ్ఞానాన్ని వైరాగ్యాన్ని, ఆనందాన్ని, ప్రసాదించే దివ్యనాట్యానికి శివుడు నాయకుడు కాగా బ్రహ్మ. విష్ణువు, గణపతి, కుమారుడు, నంది, భృంగి మొదలైనవారందరు చేరి సంగీతాన్ని రాగ, తాళాల ద్వారా ఆలాపిస్తారు ఈ రకమైన స్ఫూర్తి శివుడికే తప్ప విష్ణువుకు లేదు. 'ది డాన్స్ ఆఫ్ శివ' అనే రచనలో ఆనంద కుమారస్వామి చాలా కాలం క్రితమే శివుని నృత్య ప్రతిమలలోని తత్త్వ విశేషాలను వివరంచారు

**4:1:7:** అంతే కాక శివుడు లయ కారకుడు కనుక రౌద్ర, భీకర భావాలకు నిలయం. అందువల్లనే అతడు అనేకులను చంపినట్లు చూపే కాలారిమూర్తి, గజాసుర సంహారమూర్తి, జలధరహారమూర్తి, మల్లారిమూర్తి, అంధకాసుర సంహారక మూర్తి, వీరభద్రమూర్తి వంటిది ప్రాశస్త్యం పొందాయి. శివుడు ముందు వెనుకల చూడని అనుగ్రహానికి నిలయం కూడా అందుకే అతని అనుగ్రహమూర్తులైన చండీ శాను గ్రహమూర్తి, నందీశానుగ్రహమూర్తి, రావణానుగ్రహమూర్తి, విఘ్నేశ్వరానుగ్రహమూర్తి కిరాతార్జున మూర్తి వంటివి పేరుపొందాయి.

**4:1:8:** భారతదేశంలో ఆగమాంతశైవం, పాశుపతం, కాపాలిక కాలాముఖాలు,వీరశైవం అనే వివిధ శైవ మత సాంప్రదాయాలున్నాయి ఈ సాంప్రదాయాలు తాము అనుసరించిన జపధ్యాన, యోగ, ఆత్మార్పణల ద్వారా రుద్రపదాన్ని, సాయుజ్యాన్ని పొందడానికి చేసిన ప్రయత్నాలలో వివిధ ప్రతిమా రూపాలు దర్శనమిచ్చాయి వీని వివరాలను కామికాగమం, సుప్రభేధాగంవంటి వివిధ ఆగమ గ్రంధాలలో ఇవ్వడం జరిగింది అదే విధంగా లింగ పురాణం, శివపురాణం, వంటి పురాణాలు శివుని తత్వాన్ని, లింగరాధనయని తత్త్వాన్ని వివరించడం జరిగింది

**4:1:9:** శివుని ప్రతిమలను వివరించడంలో రెండుప్రధాన రకాలున్నాయి అవిలింగమూర్తులు, మానుషమూర్తులు లింగమూర్తులు శివుని దివ్యలింగ రూపంలో అభివ్యక్తం చేయగా, మానుష మూర్తులు శివుడికి దివ్యమైన మానవరూపాన్ని ఇస్తాయి ఈ లింగమూర్తులు శుద్ధ లింగమూర్తులని, లింగోద్భవమూర్తులని రెండురకాలు శుద్ధ లింగమూర్తులను స్థావర లింగాలని, జంగ మ లింగాలని వర్గీకరించవచ్చు లింగోద్భవమూర్తి రూపం శివుని మానుష రూపానికి, లింగమూర్తికి గల సంధిస్థితిని చూపేదోశ. మానుష మూర్తులను మరల అనుగ్రహ మూర్తులని, సంహారమూర్తులని, నృత్యమూర్తులని, ఉమాసహిత మూర్తులని, ఇతర మూర్తులని ఐదు రకాలుగా వర్గీకరించవచ్చు

**4:2: లింగమూర్తులు :**

**4:2:1:** శివుని లింగ రూపంలో ఆరాధన చేయడం అతి ప్రాచీన మైన మత వ్యవస్థలో ఒకటి. ఈ రకంగా పూజ చేసిన వారిని వైదిక వాఙ్మయంలో 'శిశ్న దేవు'లని అభివర్ణించడం కూడా జరిగింది.

శివుడు సంతానానికి అధిపతి అనే భావనతో సంతానానికి కారణమై 'లింగాన్ని' ప్రధాన రూపంగా గుర్తించి పూజా విధానాన్ని ఏర్పరచడం జరిగింది

**3:2:2:** ఈ లింగాలను చల లింగాలని, అచల లింగాలని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు.

**4:3: చల లింగాలు :**

**4:3:1:** వీటినే జంగమ లింగాలు అనడం కూడా కద్దు ఇవి మృణ్మయ (మట్టితో చేసినవి) 'లోహజ' ('బంగారు, వెండి, రాగి, ఇనుము, సీసం, ఇత్తడి, కంచు, తగరాలతో చేసినవి) 'రత్నజ' (ముత్యం, గోమేధికం, వైఢూర్యం, పుష్యరాగం, స్ఫటికం మొదలైన వానితో చేసినవి), 'దారుజ' (సామి, మధూక, కర్ణికార, మండూక, తిందుక, అర్జున, పిప్పల, ఉదుంబర వృక్షాల కొయ్యతోను, కామికాగమం ప్రకారం ఖదిర, చందన, సాల, చిల్వ, బదరీ, దేవదారు వృక్షాల కొయ్యతోను చేసినవి) 'శైలజ' (కొండ రాళ్ళతో చేసిన చిన్న, చిన్న లింగాలు) 'క్షణిక' (అప్పటికప్పుడు పూజకోసం ఇసుక, బియ్యం, అన్నం, చంద్రు, పేడ, వెన్న, రుద్రాక్షలు, గంధం, పూవులు, బెల్లం, పిండి మొదలైనవానితో చేయబడి, పూజానంతరం త్యజింప బడేవి) అనే ఆరు రకాలుగా ఉన్నాయి. ఈ లింగాలలో బంగారు లింగం పూజించిన ఆహారం, గోమయ (పేడ) లింగాన్ని పూజించిన ఆరోగ్యం, వెన్నతో చేసిన లింగం పూజిస్తే సంతోషం, రుద్రాక్ష లింగాన్ని పూజిస్తే జ్ఞానం, చందన లింగాన్ని పూజిస్తే సౌభాగ్యం, కూర్చ లింగాన్ని పూజిస్తే సాయుజ్యం, పుష్పలింగాన్ని పూజిస్తే ఆయుర్దాయం, గూడ (బెల్లం) లింగాన్ని పూజిస్తే కోరిన కోర్కెలు సిద్ధిస్తాయనిశాస్త్ర వాక్యం

**4:4: అచల లింగాలు :**

**4:4:1:** వీనినే స్థావర లింగాలు అని కూడా పిలుస్తారు. "సుప్రభేదాగమం" ప్రకారం ఇవి స్వాయంభువలింగాలు, పూర్వపురాణ లింగాలు, దైవతలింగాలు, గాణపత్యలింగాలు, అసుర లింగాలు, పుర లింగాలు, ఆర్షలింగాలు, రాక్షసలింగాలు, మానుష లింగాలు, బాణ లింగాలు అనే తొమ్మిది రకాలు కాని మానసారంలో వీనిని కేవలం ఆరు రకాలుగానే పేర్కొనడం జరిగింది అవి శైవలింగాలు, పాశుపత లింగాలు, కాలముఖ లింగాలు, వామలింగాలు, భైరవ లింగాలు, అవికాక పేర్కొనని ఇంకొక్క రకం. వీటన్నిటిలోను స్వాయంభువ లింగాలు ఉత్తమోత్తమాలు దైవత, గాణాపత్య లింగాలు ఉత్తమ మధ్యమాలు. అసుర, సుర, ఆర్ష లింగాలు ఉత్తమాధమాలు. మానుష లింగాలు మధ్యమాధమాలు 'కామికాగమం'లో ఆరు రకాలు, 'మకుటాగమం'లో నాలుగు రకాలు అయిన స్థావర లింగాలు గుర్తించబడ్డాయి

**4:4:2:** 'కామికాగమం' ప్రకారం ఇవి తమంతటతాము అవతరించినవి ఇవి యాదృచ్ఛికంగా అగ్ని, జల, మ్లేచ్ఛాదాడులకు గురి అయి పాడైనా, ఏ రకమైన జీర్ణోద్ధారణ లేకుండానే పూజార్హాలు. స్వాయంభువ లింగాలు ఆగమనియమాలకు, వాని పరిధికి చెందవు. వాటికి ఏ రకమైన కీడు కల్గించినా, వాటిని ధ్వంసం చేసినా రాజ్యానికి కీడు వాటిలుతుందనే నమ్మం ఉంది. వారణాసి, ప్రయాగ, ప్రభాస తీర్థం, ఉజ్జయిని, గోకర్ణం, కాలంజర క్షేత్రం మొదలైన 69 చోట్ల స్వయంభూలింగాలున్నట్లు పేర్కొనడం జరిగింది.

**4:4:3:** దైవిక లింగాలు అగ్ని జ్వాలలాగ కాని, అంజలి ముద్రలు ఉన్న రెండు చేతులలాగా కాని ఉంటాయి. టంకముద్రలను, శూల ముద్రలను పోలిన గుర్తులుంటాయి. ఇవి గరుగ్గా ఉండి వీటి పైన బ్రహ్మసూత్రం కాని, పార్శ్వసూత్రం కాని ఉండవు.

**4:4:4:** గాణపలింగాలు గుమ్మడి, నిమ్మ, వెలగ, తాటిపండు ఆకారాల్లో ఉంటాయి. గాణప లింగాలను గణాలు స్థాపించినవని, ఆర్షలింగాలను ఋషులు స్థాపించినవని నమ్మకం. ఆర్షలింగాలు గుండ్రంగా ఉండి పై భాగం కింది భాగం కన్న సన్నగా ఉంటుంది. గాణప ఆర్ష లింగాలలో కూడా బ్రహ్మ సూత్రాలే కాని, పార్శ్వ సూత్రాలు కాని ఉండవు.

**4:4:5:** స్థావర లింగాలన్నింటిలోను ఎక్కువ సంఖ్యలో గలవి మానుష లింగాలు ఇవి మనుష్యులు స్థాపించినవి వీటి కొలతలు గర్భ గృహద్వారం కొలతమీదగాని, హస్త ప్రమాణం మీద గాని ఆధాపడి ఉంటాయి వీటిలో బ్రహ్మభాగమని, విష్ణుభాగమని, రుద్రభాగమని మూడు భాగాలుటాయి. చతురస్రాకారంలో ఉన్న పానవట్టం భాగాన్ని బ్రహ్మభాగం అంటారు అష్ట భుజాకారంలో ఉన్న మధ్య భాగాన్ని విష్ణు భాగం అంటారు. పై భాగాన్ని రుద్రభాగం అంటారు దీనినే శిరోవర్తన భాగం అని కూడా అంటారు. (చూడుడు ఫోటో 9 లింగములు)

**4:4:6:** ఈ మానుష లింగాలలోనే సర్వదేశికలింగాలని, సర్వసమ లింగాలని రెండు రకాలున్నాయి. ప్రధాన దేవాలయం పక్కల కొలతలు ఆధారంగా ఏర్పాటు చేసిన వానిని సర్వదేశిక లింగాలంటారు. వీనిలో ఉత్తమ, మధ్యమ, అధమాలని మూడు రకాలున్నాయి.

### 4:4:7: సర్వసమలింగాలు :

వీనినే సర్వతోభద్రలింగాలని 'మయమతం' 'కామికాగమాల'లో పేర్కొవడం జరిగింది బ్రహ్మభాగం, విష్ణుభాగం, రుద్ర భాగం సమానపరిమాణంలో ఉండే లింగాలను సర్వసమలింగాలని, సర్వతోభద్రలింగాలని పేర్కొంటారు వీటిలో వర్థమాన లింగాలని, శైవాధిక లింగాలని, స్వస్తికలింగాలని త్రై రాశిక లింగాలని, ఆఢ్యలింగాలని ఐదురకాలు ప్రచారంలో ఉన్నాయి.

**4:4:7:1:** ఎక్కడైతే బ్రహ్మభాగం కన్న విష్ణుభాగం, విష్ణుభాగం కన్నాశైవభాగం ఎక్కువగా ఉంటుందో ఆ రకమైన లింగాన్ని వర్థమాన లింగం అంటారు ఉదాహరణకు బ్రహ్మ భాగం 4 ఐతే విష్ణుభాగం5, శైవభాగం 6 యూనిట్లు లో ఉంటుంది.

**4:4:7:2:** ఎక్కడైతే బ్రహ్మవిష్ణుభాగాలు సమానంగా ఉండి, శైవభాగం లేదా శిరోవర్తన భాగం అధికంగా ఉంటుందో దాన్ని శైవాధిక లింగం అంటారు. ఉదాహరణకు 7,7, యూనిట్లు బ్రహ్మ, విష్ణు, భాగాలైతే, 8 శైవభాగం అవుతుంది

**4:4:7:3:** స్వస్తికలింగాలనే 'సిద్ధాంత సారావళి'లో అనాఢ్యలింగాలని పేర్కొనడం జరిగింది. దీనిలో వివిధ భాగాలులో వర్థమాన లింగంలో వలెనే ఒక్కొక్క భాగంలో ఒక్కొక్క ప్రమాణం అధికంగా ఉంటుందని 'మయమతం'లోను, 'కామికాగమం'లోను చెప్పడం జరిగింది.

**4:4:7:4:** త్రైరాశిక లింగం మొత్తం లింగ పరిమాణాన్ని 9 భాగాలుగా విభజించి బ్రహ్మభాగం ఎనిమిది భాగాలకు, విష్ణుభాగం 7 భాగాలకు, రుద్రభాగం 6 భాగాలకు సమానంగా ఉండాలి. ఇవి

మూడు రాసులు పోసినట్లు ఉండడం వల్ల త్రైరాశిక లింగాలు అంటారు

**4:4:7:5:** ఐదవ రకమైన ఆఢ్యలింగాలలో బ్రహ్మభాగం, విష్ణుభాగం, రుద్రభాగం 8 1/2: 8: 7 1/2 నిష్పత్తిలో ఉండాలి

**4:4:8:** లింగాల వెడల్పును గూర్చి 'మయమతం' వివరంగా చెప్పింది. లింగం పొడవును 16 సమాన భాగాలుగా విభజించాలి. ఆఢ్యలింగం వెడల్పు దానిలో 6 భాగాలుండాలి అనాఢ్యలింగం 5 భాగాలుండాలి. సర్వసమలింగం కూడా 5 భాగాల వెడల్పు కలిగి ఉంటుంది.

**4:4:9:** దేవాలయ శైవులలోవలెనే లింగాలలో కూడా శైలీ భేధాలను చూపించడం జరిగింది. లింగాలను నాగర లింగాలని, వేసర లింగాలని, ద్రావిడ లింగాలని మూడు రకాలుగా వర్గీకరించడం జరిగింది.

**4:4:9:1:** 'మయమతం' ప్రకారం నాగరలింగంలో మూడు ప్రధాన భాగాలుంటాయి అవి జయద, పౌష్టిక, సార్వకామికాలు మొత్తం లింగం పొడవును 16 సమాన భాగాలుగా విభజించి దానిలో 5 ప్రమాణాలకు సరియైన బ్రహ్మభాగాన్ని, 4 ప్రమాణాలకు సరియైన విష్ణుభాగాన్ని 3 ప్రమాణాలకు సరియైన రుద్రభాగాన్ని వెడల్పుగా గ్రహించాలి. 5 ఐతే జయదమని, 4 ఐతేపౌష్టికమని, 3 ఐతే సార్వకామికమని వ్యవహారం.

**4:4:9:2 :** వేసరలింగాలలో మొత్తం లింగం వెడల్పు లింగం పొడవును 25 సమాన భాగాలుగా చేసి, దానిలో బ్రహ్మ, విష్ణు రుద్రభాగాలను - 8,7,6, భాగాలుగా ఉంచితే జయధ, పౌష్టిర, సార్వకామిక లింగాలౌతాయి

**4:4:9:3:** ద్రావిడ లింగాలలో మొత్తం లింగం పొడవును 21 సమాన భాగాలుగా చేసి దానిలో 6 ప్రమాణాల వెడల్పుతో జయద లింగం 5 ప్రమాణాల వెడల్పుతో పౌష్టిక లింగం, 4 ప్రమాణాల వెడల్పుతో సార్వకామిక లింగం ఏర్పరచడం జరుగుతుంది

**4:4:10:** లింగాలలో ఉండవలసిన శిరోవర్తన భాగస్వరూపాన్ని గూర్చి 'మయమతం', 'సిద్ధాంత సారావళి, ఐదు ప్రధానమైన రకాలను వ్యక్తం చేశాయి. అవి ఛత్రాకారం, త్రిపురుషాకారం, కుక్కుటాండాకారం, అర్థచంద్రాకారం, బుద్బుదాకారం, వాటి పేర్లలోనే అది వరుసగా గొడుగు లాగ, గుమ్మడిపండులాగ, కోడిగుడ్డులాగ, అర్థచంద్రునితో, నీటి బుగలాగ ఉంటాయి. 'సిద్ధాంత సారావళి' బుద్బుదాకారాన్ని ప్రత్యేకంగా పేర్కొనలేదు.

**4:4:1:** అలాగే మానుషలింగాలలో అష్టోత్తర దశ లింగాలు, సహస్ర లింగాలు, ధారాలింగాలు, శైవేష్ట్య లింగాలు, ముఖ్యలింగాలు అనే ఐదురకాలను తిరిగి పరిశీలించడం జరిగింది. వీనిలో లింగం 108 సమాన లింగ భాగాలుగా ఉన్నట్లైతే అష్టోత్తర శతలింగమని, వేయిభాగాలుగా విడగొట్టబడి నట్లైతే సహస్ర లింగమని, పలకలుగా ఉన్నట్లైతే ధారాలింగమని, లింగంపై ముఖాన్ని కలిగి ఉన్నట్లైతే ముఖ లింగమని అంటారు ధారాలింగంలో 'సుప్రభేదాగమం' ప్రకారం 5,7,9,12, 16,20,24, 28 పలకలు ఉండవచ్చు కాని 'కారణాగమం' అవి 16 మాత్రం ఉండాలని చెప్పింది. కాని 'మయమతం' ఆ పలకలు బ్రహ్మభాగంలో 4,8,16 కాని, విష్ణుభాగంలో 8,16,32 గాని, రుద్రభాగంలో 16,32,64, కాని ఉండాలని పేర్కొన్నది ముఖలింగంలో శివునికి గల ఐదుముఖాలైన వామదేవ

తత్పురుష, అఘోర, సద్యోజాత, ఈశానులలో ఒక్కొక్కదాన్నిగాని, మూడింటిని గాని, ఐదింటిని గాని చూపడం జరుగుతుంది. ఈ రకమైన ముఖలింగాలు లింగోద్భవ మూర్తి భావానికి కొంచెం దగ్గరతనాన్నికలిగినవి.

**4:5:లింగపీఠాలు :**

**4:5:1:** లింగాలలో వలెనే లింగపీఠాలలో కూడా వైవిధ్యాలున్నాయి. 'మానసార' ప్రకారం నాగరపీఠం చతురస్రాకారంలోను, వేసర పీఠం వృత్తాకారంలోను, ద్రావిడ పీఠం అష్టభుజాకారంలోను ఉండాలి ఈ రకమైన పీఠాలు భద్రపీఠ, మహాంబుజపీఠం, శ్రీకర పీఠం, వికర పీఠం, మహావజ్రపీఠం, సౌమ్యకపీఠం, శ్రీకన్య పీఠం, చంద్రపీఠం, వజ్రపీఠం అనే తొమ్మిది రకాల పీఠాలున్నాయి లింగపీఠంలో ఉపానం, జగతి, కుముద, పద్మ, కంప, కంఠ, పట్టిక, నిమ్న, ఘృతవారి అనే బంధనాలుంటాయి. ఇవన్నీ వాటికి సమమైన దేవాలయ వాస్తు ప్రమాణాలకు, స్వరూపాలకు సరిపోయేటటువంటివే

**4:5:2:** ఈ రకమైన లింగాలలో బ్రహ్మసూత్రాలు, నాళం మరికొన్నిప్రధాన భాగాలు బ్రహ్మసూత్రాలు అంటే రుద్రభాగంలో నిలువుగా గీసిన రెండుగీతలు 'సిద్ధాంత సారావళి'లో ఈ బ్రహ్మసూత్రాల పొడుగును గూర్చి వివరించబడింది

**4:5:3:** నాళంఅంటే పూజాభాగం నుండి వెలికి నీరు పోవడానికి అనువైన భాగం. ఇది పీఠం ప్రమాణంలో 1/3లేక 1/4 వ పరిమాణం కలిగి తొండం ఆకారంలో ఉంటుంది

**4:5:4:** పై పరిశీలనల దృష్ట్యా లింగంలో పూజావిభాగం, పీఠం, నాళం అనేమూడు ప్రధాన భాగాలుంటాయి పూజాభాగంలో రుద్రభాగం, విష్ణుభాగం, బ్రహ్మభాగం అనే మూడు ఉపభాగాలున్నాయి. రుద్రభాగాన్నే శిరోవర్తన భాగం అంటారు. ఇది గొడుగు లేదా గుమ్మడి పండు లేదా కోడిగుడ్డు లేదా అర్థచంద్రుని ఆకారంలో ఉండి పీఠభాగం చతురస్రాకారం గా గాని వృత్తాకారంగా గాని, అష్టభుజాకారంగాగాని ఉంటుంది వీనినే వరుసగా నాగర, వేసర, ద్రావిడ పీఠాలని పేర్కొంటారు

**4:6: లింగోద్భవ మూర్తి :**

**4:6:1:** మానుషమూర్తులకు, శుద్ధ లింగమూర్తులకు ఉన్న పరిణామ భావాన్ని తెలిపే స్థితి లింగోద్భవ మూర్తి గుడిమల్లంలోను, చోళుల కాలానికి చెందిన బృహదీశ్వరాలయంలోను ప్రసిద్ధి పొందిన లింగోద్భవ మూర్తులున్నాయి ఈ రకమైన శివుడు 'ఉష్ణీషి' అని యజమానుడు' అని కృష్ణయజుర్వేదానికి చెందిన శతరుద్రీయంలో అభివర్ణించబడ్డాడు కంచీపురం, ఎల్లోరా మొదలైన చోట్ల కూడా ప్రాచీన మైన లింగోద్భవ మూర్తులను చూడగలం.

**4:6:2:** లింగపురాణాలు, కూర్మపురాణం, శివపురాణాలలో లింగోద్భవ మూర్తిని గూర్చిన ఒక ఐతిహ్యం ఉంది. కల్పాంతంలో నిదురలో ఉన్న విష్ణునికి సమీపంలోగల ఒక తేజో పుంజం నుండి బ్రహ్మ ఆవిర్భవిస్తాడు బ్రహ్మ తాను విష్ణువు వద్దకు వచ్చి, తాను సృష్టికర్తనని చెప్పుకొని, విష్ణువును ఎవరని అడుగుతాడు. విష్ణువు కూడా తాను విశ్వకర్మనని చెప్పుకొంటాడు బ్రహ్మ

విష్ణువుల మధ్య ఒప్పందం కుదరని స్థితిలో వారిద్దరి మధ్య ఒక లింగం ఆవిర్భవిస్తుంది. అప్పుడు బ్రహ్మ, విష్ణువులు కలహం మాని ఆలింగం తుది మొదలు చూడడానికి ప్రయత్నం చేస్తారు. బ్రహ్మహంస రూపంలో ఆకాశంలోకి, విష్ణువు వరాహరూపలో భూమి లోకి వెడతారు. వారిద్దరూ తమ ప్రయత్నంలో విఫలురయి వెనక్కి వచ్చి జ్వాలా రూపంలో స్తంభం లా ఉన్న ఆ మూర్తిని ప్రస్తుతిస్తారు. వారి సంస్తుతికి సంతోషించిన శివుడు వేయిపాదాలతోను, వేయి బాహువులతోను, సూర్య, చంద్ర, అగ్నులు మూడు కళ్ళుగాను పినాకి పాణియై, త్రిశూలాన్ని ధరించి, గజ చర్మా ధారిగా, సర్పయజ్ఞోపవీతం కలిగి, మేఘ గర్జన వంటి స్వరంతో వారియందు నిలబడి బ్రహ్మ, విష్ణువులు పరమేశ్వరుని కుడి, ఎడమ వృషణాలనుంచి జన్మించినవారని, వారందరిలో ఒక్కటే అయినా బ్రహ్మవిష్ణువు, మహేశ్వరులను మూడు రూపాలుగా ఏర్పడ్డారని, రాబోయే కల్పంలో బ్రహ్మ, విష్ణువుగా ఆవిర్భవిస్తాడని తాను విష్ణువు భ్రకుటి నుండి ఆవిర్భవిస్తానని చెప్పి అదృశ్యుడవుతాడు

**4:6:3:** బ్రహ్మ ఒక మొగలిపూవును ఆధారంగా చేసికొని తాను మహేశ్వరుని శిరస్సును చూచాననీ బొంకుతాడు. దానివల్ల బ్రహ్మకు లోకంలో పూజాపురస్కారాలుండకూడదనే శాపం వస్తుంది.

**4:6:4:** 'అంశుమద్భేదాగం'లో లింగానికి ముందు భాగంలో చంద్రశేఖరమూర్తిని చెక్కాలని, అది లింగోద్భవమూర్తి అని ఆదేశం. కాని'కారణాగమం'లో ఇంకోరకంగా ఉంది. లింగంలో ఐదవ వంతు భాగాన్ని పైన, కింద ఏమి చెక్కకుండా వదలాలి. పైన కుడివైపు హంసరూపంలో బ్రహ్మను, కింద ఎడమ వైపు వరాహరూపంలో విష్ణువును సూచించి కుడి ఎడమలుగా బ్రహ్మ, విష్ణువుల మూర్తులను అంజలిముద్రలుగా చూపాలి. శివుని చంద్రశేఖర మూర్తిని పాదాలు లేకుండా కటి పర్యంతం చూపాలి శివుణ్ణి ఎర్రని రంగులోను, విష్ణువును నల్లని రంగులోను, బ్రహ్మను స్వర్ణవర్ణంలోను చూపాలి 'కామికాగమం'లో హంస ప్రమాణం శివుని ముఖమంతా ఉండాలని, వరాహ ప్రమాణం శివుని ముఖానికి రెండింతలుండాలని నియమింపబడింది. ఈ మూర్తిలో విష్ణువును, బ్రహ్మను చూపినట్లైతే వారు శివునికి ప్రపత్తి వ్యక్త పరచాలి. వారు మానుషరూపాలులో లేనట్లైతే తప్పక వరాహ, హంస రూపాలలో ఉండాలి. 'శిల్పరత్నం' ప్రకారం లింగోద్భవ మూర్తి ఒక చేతిలో త్రిశూలాన్ని ధరించి ఉండాలి. 'కారణాగమం'లో ఈ శివుని మూర్తి నాలుగు చేతులు కలిగి ఉండాలని, ఒక చేయి అభయ ముద్రలోను, ఒక చేయి వరద ముద్రలోను ఉండాలని ఒక చేయి పరశివును, వేరొక చేయి కృష్ణమృగాన్ని ధరించి ఉండాలని, శివుని శిరస్సుపై చంద్రకళను చూపాలని చెప్పబడింది. ఈ రకమైన మూర్తిని కాంచీపురంలోను ఎల్లోరా లోను చూడగలం.

**4:6:5:** విష్ణుని వరాహ రూపంలో లింగోద్భవ మూర్తి సందర్భంగా చూపడంవల్ల, ఏవిధంగా శరభేస్వరమూర్తి నారసింహావతార సందర్భంగా శివుని గొప్పదనాన్ని చూపాడో, అదేవిధంగా లింగోద్భవ మూర్తి వరాహావతార సందర్భంగా శివుని గొప్పదనాన్ని చూపి ఉంటాడనే ఆలోచనకు అవకాశం లభిస్తున్నది.

**4:7: మానుషమూర్తులు :**

**4:7:01:** శివుని ప్రతిమలను సూచించడంలో లింగాలు, లింగోద్భవమూర్తి తరవాత, మానుషమూర్తులు

పరిగణనీయమైనవి. వీనిలో శివుని మానుషరూపంలో చూపడం జరుగుతుంది. ఇది అనుగ్రహమూర్తులు, సంహారమూర్తులు, నృత్యమూర్తులు, ఉమాసహితమూర్తులు, ఇతరాలు అని ఐదు ప్రధాన రకాలు వానిని గూర్చి ఈ క్రింది విధంగా తెలియవచ్చు.

**4:7:1: అనుగ్రహమూర్తులు:**

ఈ మూర్తులన్నీ శివుని కరుణాస్వభావాన్ని, ముందు వెనకల చూ డని దయాళుత్వాన్ని నిరూపిస్తాయి వీనిలో చండీశానుగ్రహమూర్తి, రావణానుగ్రహమూర్తి , నందీశానుగ్రహమూర్తి, విఘ్నేశానుగ్రహమూర్తి, కిరాతార్జున మూర్తి ప్రధానమైనవి

**4:7:1:1: చండీశానుగ్రహమూర్తి :**

**4:7:1:1:1:** చోళ దేశంలో మణ్ణినది ఒడ్డున 'శెయ్‌ణల్లూర్ అనే ఊళ్ళో కాశ్యప గోత్రుడైన యజ్ఞదత్తుడనే బ్రాహ్మణుడుండేవాడు అతనికి విచారశర్మ అనే కుమారుడుండేవాడు. ఒకసారి విచారశర్మ, ఆవులను గోపాలురు కొట్టడం చూసి, బాధపడి, గ్రామస్థుల అంగీకారంతో తాను గోపాలక వృత్తి స్వీకరిస్తాడు అతడు ఆవులను బాగా చూడడం వలన ఆవులు సంతోషించి నిండుగా పాలను ఇచ్చేవి ఆ పాలు పొదుగులనుంచి కారిపోతుంటే వ్యర్థం కానివ్వకుండా విచారశర్మ సైకత లింగాలను ఏర్పరచి క్షీరాభిషేకం చేసేవాడు. విచార శర్మవల్ల వృత్తి కోల్పోయిన గోపాలురు కక్షతో అతడు ఆవుల పాలను పిండుకొని మట్టి ముద్దలపై పోస్తున్నాడని ఊళ్ళో చెప్పారు. కొందరు అదే పనిగా చూసి, అతడు ఇసుక ముద్దుల మీద పాలు పోయడం యజ్ఞదత్తుడికి ఫిర్యాదు చేస్తారు. యజ్ఞదత్తుడు వచ్చి అతని కుమారుడు పాలను ఒంపడం చూసి మట్టి ముద్దలను తన్నగా విచారశర్మ ఆవేశంలో తన తండ్రి కాలిని గొడ్డలితో తెగనరుకుతాడు. తన పట్లగల ప్రపత్తికి సంతోషించి శివుడు సతీసమేతంగా ప్రత్యక్షమై అతన్ని అనుగ్రహిస్తాడు విచారశర్మను తనగణాలకు అధిపతిగా ప్రకటించి చండీశ్వరుణ్ణి కొలవవలసిందని ఆదేశించి, విచారశర్మ తలకు పుష్పమాలను అలంకరిస్తాడు

**4:7:1:1:2:** ఈ చండీశ్వరుని మూర్తిని అంశుమద్భేదాగమంలోను, ఉత్తర కామిగంలోను వివరించడం జరిగింది. శివపార్వతులు సుఖాసనంలో ఒకరినొకరు చూసుకుంటూ ఒకే ఆసనంపై ఉంటారు. దేవి శివునికి ఎడమవైపు ఉంటుంది. దేవి రెండు చేతులతో ఉంటుంది. ఆమె కుడి చేతిలో పద్మం ఉండగా, ఎడమ చేయి సింహకర్ణముద్రలో ఉంటుంది ఆమె తలపై కరండమకుటం ఉంటుంది. శివుడు జటామకుటంతో, నాలుగు చేతులు కలిగి ఉంటాడు పై కుడిచేత పరశువును, పై ఎడమ చేత మృగాన్ని, ధరించి ఉంటాడు కింది కుడిచేయి అభయముద్రలోను, కింది ఎడమచేయి ఆశంముద్రలోను ఉంటుంది కుడి చెవికి మకరకుండలంలేదా సింహకుండలం ఎడమ చెవికి పత్రకుండలం ఉంటాయి. ముంజేతులకు కంకణాలు, వక్షస్థలంపై సర్పయజ్ఞోపవీతం ఉంటాయి. ఇతనికి సమీపంలో పద్మాసనం మీద చండీశుని అంజలి ముద్రలో చూపాలి. శివుని ఎడమ చేతిని చండీశుని తలపై ఉన్నట్లు చూపాలి. ఈ రకమైన శిల్పం గంగైకొండ చోళపురం, కాంచీపురం మొదలైన చోట్ల గల చెక్కడాలలో చూడవచ్చు

**4:7:1:1:3:** జానపదులలో ఇంచుమించు ఇదేకథను కాటు కోటుని వృత్తాంతంలో పాల్కురికి

సోమనాథుడు బసవ పురాణంలో పేర్కొనగా, శ్రీశైలంలో దక్షిణపుగోడపై శిల్పంగా చెక్కడం జరిగింది. ఇందులో కాటు కోటుడనే గొల్లవాడు లింగాన్ని తన్నినందుకు తన తండ్రికాలు తెగనరుకుతాడు.

**4:7:1:2: రావణానుగ్రహమూర్తి:**

**4:7:1:2:1:** లంకాధిపతి యైన రావణుడు, కుబేరుణ్ణి జయించి వెనక్కు వస్తుండగా శరవణ ప్రాంతంలో రావణుని పుష్పక విమానం ఆగిపోతుంది. ఎందుకు ఆగిందో నని రావణుడు విచారించగా వానరాకారంలో చిన్న శరీరాన్ని కలిగిన నందికేశ్వరుడు, శివుడు పార్వతితో ఆ పర్వతం పై క్రీడిస్తున్నాడు, అందువల్ల ఎవరూ దానిపై పోరాదని చెప్తాడు రావణుడు అప్పుడు నందికేశుని, మహేశుని అపహసించగా, నందికేశుడు రావణుని కేవలం వానరుల వల్లనే మరణిస్తాడని శపిస్తాడు. దాని తరువాత రావణుడు బలాహంకారంతో కైలాస పర్వతాన్ని పెకిలించడానికి సిద్ధపడతాడు ఆ దురాక్రమణకు పార్వతి చెదిరి శివుని ఆర్తితో కౌగిలించుకుంటుంది. శివుడు ఓదార్చి తన బొటన వేలితో ఆ పర్వతాన్ని నొక్కుతాడు. అప్పుడు రావణుడు దాని కింద నలిగి ఆర్తితో విలపిస్తూ, శివుణ్ణి ప్రస్తుతించగా శివుడు దయతో అతనికి ఒక ఖడ్గం ప్రసాదించి, లంకకు తిరిగిపోవలసినదిగా ఆదేశిస్తాడు

**4:72:2:2:** ఈ యావద్వృత్తాంతాన్ని ఎల్లోరా, బేలూరు, మొదలైన ప్రాంతాల్లో శిల్ప రూపంలో వ్యక్తం చేశారు ఎల్లోరాలోని శిల్పంలో శివపార్వతులు ఒక పర్వతం (కైలాసం) పై కూర్చున్నట్లు ఉంటుంది. పార్వతి ముఖంలో భయాందోళనలు ప్రస్ఫుటమౌతాయి పార్వతికి చెంత ఇద్దరు పరిచారికలు, శివుని చెంత ఇద్దరు పరిచారికులు ప్రపత్తితో చూపబడతారు. కొండ కింద బలాహంకారాన్ని అభివ్యక్తం చేస్తున్న రావణుని చూపడం జరుగుతుంది పార్వతి ముఖంలో భయాందోళనలుండగా శివుని ముఖంలో ప్రశాంతత కనిపిస్తుంది పార్వతి శివుని ఆర్తితో కౌగిలించుకొనగా, శివుడు ఓదార్పుగా తన సతిని కౌగిలించుకుంటాడు పార్వతి తలపై కరండమకుటం, శివుని తలపై జటామకుటం, ఇతర లాంఛనాలు చూపడం జరుగుతుంది రావణుని శారీరక బలగర్వానికి గుర్తుగా పదితలలు, ఇరవై చేతులతో చూపిస్తారు. (చూడుడు ఫోటో:10)

**4:7:1:3: నందీశానుగ్రహమూర్తి:**

**4:7:2:3:1:** నందీశ్వరుడు కోరిక మేరకు, భూమిపై అతని తనువు ముగిసే నాటికీ, శివుడు నందికి వార్ధక్యం నుంచి అతీతత్వాన్ని ఇచ్చి శివగణాలకు అధిపతిగా చేస్తాడు. అతడు నంది కేశ్వరుని బాల్యస్థితిలో తన వద్ద కు తీసికొని తన వద్దగల పుష్పమాలికలను నందికేశుని మెడలో వేయగానే అన్ని లాంఛనాలతోను 'ఇంకొక శివుడా', అన్నట్లు నందికేశుడు మారిపోతాడు నందికేశుని శిరస్సు పై గంగాజలం కొంత చల్లగానే ఆ నీరు నదిగా పారుతుంది. పార్వతి కూడా నందికేశుని తన కుమారునిగా భావించి మూర్ధాఘ్రాణం చేయగానే ఆమె చనుబాలు పొంగి నంది తలపై బడి 'త్రిశోత్రస్సు' అనే నదిగా పారతాయి ఆనందంతో నందికేశుడు నవ్వగా ఆధ్వని నుంచి 'వృషధ్వని' అనే నది పారుతుంది. శివుడు మరింత సంతోషించి నంది కేశుడికి తన స్వర్ణమకుటాన్ని రత్న కుండలాలను ఇస్తాడు. సూర్యుడు నందికేశునికి జరిగిన సన్మానానికి గాను వాన కురిపించగా ఆ నీరు

కిరీటాన్ని తాకి స్వర్ణోదకం, జాంబూనది అనే రెండు నదులు ఏర్పడతాయి. నందికేశ్వరుని గణాధిపతిగా అభిషేకించగా, మరుద్గణాలకు చెందిన, 'సుయశ', అనే ఆమెను పెండ్లి చేసుకుంటాడు. ఈ వృత్తాంతం 'జవ్యేశ్వరం' వద్ద జరిగిందని ప్రతీతి.

**4:7:1:4: విఘ్నేశానుగ్రహమూర్తి:**

**4:7:1:4:1:** విఘ్నేశ్వరుణ్ణి శివుడు అనుగ్రహించి, గజాననుడు కాగానే గణపతిగా కూడా అభిషేకిస్తాడు. శివుడు నాలుగు చేతులు కలిగి ఉంటాడు ఒక చేయి వరద ముద్రలో ఉండగా, ఇంకొక చేయి విఘ్నేశ్వరుని శిరస్సుపై ఉంటుంది. మిగిలిన రెండు చేతులలో పరశువు, మృగము ధరించి ఉంటాడు. జటామకుటం కలిగి ఉంటాడు శివునికి సమీపంలో పార్వతీదేవి కుడిచేయి ఉత్పలాన్ని దాల్చినట్లు, ఎడమ చేయి వరద ముద్రలో ఉన్నట్లు చూపబడాలి. శివుడు నల్లగా సర్వాలంకార శోభితుడుగా ఉండాలి శివుడు కుడికాలు పైకి మడచి, ఎడమ కాలు జారవిడవగా పార్వతి కూడా అదేవిధంగా ఉంటుంది. ఈ సందర్భంగా పార్వతికి కూడా మూడు కన్నులు చూపాలి. కాగా విఘ్నేశ్వరుడు సమీపంలో నిలబడి రెండు చేతులలో పాశంకుశాలు ధరించి, రెండు చేతులతో అంజలి ఘటిస్తున్నట్లు ఉంటాడు. విఘ్నేశ్వరుని శిరస్సును కిరీటమకుటంతోను, శరీరాన్ని ఎర్రనిరంగులలోను చూపాలి

**4:7:1:5: కిరాతానుగ్రహమూర్తి:**

శివుని అనుగ్రహరూపాల్లో చాలా ప్రచారంలో ఉన్నది. పాండవ మధ్యముడైన అర్జునికి, శివుడు కిరాతుని రూపంలో పాశుపతాస్త్రాన్ని దానం చేసిన రూపం ఈ రకమైన భావనను "నిషాదేభ్యశ్చ" అనే వర్ణన ద్వారా కృష్ణయజుర్వేదంలో పేర్కొన్నట్లు శివరామమూర్తి వ్యాఖ్య. ప్రసిద్ధమైన ఈ శిల్పాలను గుప్తుల కాలంలోను, చోళుల కాలంలోను కూడా చూడగలం ఇంద్రుని సలహాపై అర్జునుడు పాశుపతాస్త్రం కోసం శివుని ఉద్దేశించి తపస్సు చేస్తాడు. ఆ తపస్సు భంగపరచదలచి శివుడు, పార్వతి కిరాత వేషంలో వస్తారు అర్జునుని తో కలిసి ఒక పందిని వేటాడడంలో పాల్గొని ఇద్దరూ కలహిస్తారు ఆ కలహంలో అర్జునుడు ఓటమిపొందినా, కిరాత రూపంలో ఉన్న వ్యక్తిని శివుడని గుర్తించి ప్రార్థించగా శివుడు ప్రసన్నుడై పాశుపతాస్త్రాన్ని ఇస్తాడు.

**4:7:1:5:2:** ఈ మూర్తిలో శివుడు నాలుగు చేతులతోను, మూడు కన్నులతోను, శిరస్సుపై జటామకుటంతోను చూపబడతాడు. అతడు సర్వాభరణ భూషితుడై యజ్ఞోపవీతంతో ఎర్రని రంగులో ఉంటాడు. సమభంగంలో ఉన్న శివుడు ధనస్సును, బాణాలను, పరశువును, మృగాన్ని ధరించి ఉంటాడు. శివుడికి ఎడమ వైపుగా గౌరిని, కుడివైపుగా అర్జునుని చూపాలి అర్జునుడు అంజలి ఘటిస్తూ, జటామకుటాన్ని, అన్ని ఆభరణాలను కలిగి ఉంటాడు. ఇతని శరీరం అతిమానుష్య స్వభావాన్ని కలిగి ఉంటుంది. ఈ రకమైన ఉదాహరణలను శ్రీశైలం, బెంగాత్తం గుడి మొదలైన చోట్ల చూడగలం.

**4:7:2: సంహారమూర్తులు:**

లయ కారకుడైన శివుడు కామభావాన్ని అణచివేసే కామంతక మూర్తిగాను, అహంభావానికి

సూచనలయిన మూడు పురాలను అంతం చేసిన త్రిపురాంతకమూర్తి, గాను, చీకటిని అణచివేసి వెలుగుకు ఇక్కయై నిలచిన అంధకాసుర సంహారమూర్తిగాను, శారీరక సత్త్వంలోని అహంభావాన్ని అణచివేసిన గజాంతకమూర్తి గాను, చావును అణచి అమర్త్యత్వాన్ని ప్రసాదించే కాలారిమూర్తి గాను, రజోభావాన్ని అణచివేసిన బ్రహ్మశిరచ్ఛేదక మూర్తిగాను, వీరభద్రమూర్తిగాను, భైరవునిగాను, మహాకాలుని గాను అనేకరకాలుయిన సంహార భావాలను ప్రదర్శించి రౌద్రస్ఫూర్తికి, భీభత్సభావనకు ఆ కరమై మిగలడం అనేది సంహారమూర్తులలోని వైవిధ్యాన్ని, శివుడికి గల ఔన్నత్యాన్ని సూచించే ప్రధానాంశం. పైన క్రోడీకరించిన కొన్ని సంహార మూర్తుల ప్రధాన సందర్భాలను గూర్చి, అక్కడ ఉండవలసిన ప్రతిమల నమూనాలను గూర్చి ఈ క్రింది విధంగా తెలుసుకోవచ్చు.

### 4:7:2:1: కామాంతక మూర్తి:

**4:7:2:1:1:** దాక్షాయనిగా (దక్షుని కుమార్తె) మరణం తరువాత, సీతాదేవి మేనకాగర్భాన హిమవంతునికి పార్వతిగా జన్మిస్తుంది లోకాలను భీతి పరచే తారకాసురుని చంపేవ్యక్తి శివపార్వతుల సంయోగం వల్ల మాత్రమే జన్మిస్తాడు కాని శివుడు తపోదీక్షలో ఉన్నందున శివుని తపోదీక్షనుంచి తప్పించడానికి మన్మథుణ్ణి దేవతలు పంపుతారు. మత్స్యధ్వజుడై, చిలుకవాహనంగా గల మన్మథుడు శివునిఎదుర్కొని శివనేత్రాగ్నికి భస్మం అవుతాడు కాని శివుని మనస్సులో జన్మించిన కామబాధనవల్ల, శివుడు పార్వతిని వివాహమాడి కామాంతకమూర్తి కళ్యాణసుందరమూర్తిగా పరిణమిస్తాడు. కామదహన వృత్తాంతం తంజావూరు జిల్లాలోని తిరుక్కురుక్కై అనే గ్రామంలో జరిగినట్లు అక్కడ చెప్పుకొంటారు.

**4:7:2:1:2:** కామంతక మూర్తి స్వరూపాన్ని గూర్చి 'ఉత్తరకామికాగమం', 'సుప్ర భేదాగమం', 'పూర్వకారణాగమం', లో వివరించారు. శివుని స్వరూపం యోగదక్షిణామూర్తి లో వలెనే ఉండి, ముందుగా బూడిద కుప్పగా మారిన మన్మథుణ్ణి చూపించాలి మన్మథుని శరీర ప్రమాణం శివుని శరీర ప్రమాణంలో పదింట 1నుండి 7 వరకు (అనగా 1/10 అతి తక్కువ, 7/10 అతి ఎక్కువ) ఉండవచ్చు. మన్మథునిస్వర్ణవర్ణంలో, రతీ దేవితో కలసి ఉన్నట్లు చూపించాలి "పూర్వకారణాగమం' ప్రకారం శివుడు మూడు కన్నులను, నాలుగు చేతులను, జటామకుటాన్ని కలిగినట్లు చూపాలి. శివుని రెండు చేతులలో సర్పాన్ని, అక్షమాలను కలిగి ఉన్నట్లు చూపి, ఒక కుడిచేతిని పాతకహస్తం (కింది వైపుకు చూపే చేయి) లోను, ఒక ఎడమ చేతిని సూచీహస్తంలోను ఉన్నట్లు చూపాలి. ఈ ఆగమం ప్రకారం మన్మథుని శరీర ప్రమాణం శివుని ప్రమాణంలో సగం ఉండాలి. కామాంతకమూర్తి రమణీయ స్వరూప కల్పనను శ్రీశైలం తూర్పు ప్రకారంపై చూడగలం.

### 4:7:2:2: త్రిపురాసురసంహార మూర్తి:

**4:7:3:2:1:** త్రిపురాంతక సంహారం వర్ణన అనేక వైవిధ్యాలతో కూడుకొన్నది. అంశుమ ద్భేదాగమంలో' నే దాన్ని ఎనిమిది రకాలుగా వర్ణిచడం జరిగింది ఉత్తర కామికాగమంలో కూడా త్రిపురాంతక సంహారం వివరించబడింది. ఎల్లోరా, కాంచీపురం మొదలైన ప్రసిద్ధ క్షేత్రాలలో త్రిపురాసుర సంహార మూర్తి స్వరూపం ఎంతో పేరొందింది.

**4:7:2:2:2:** తారకాసుని ముగ్గురు కుమారులు బ్రహ్మవరం వల్ల బంగారం తోను, వెండితోను, ఇనుము తోను, నిర్మించబడిన మూడు పురాలను పొంది, వరబలంతో విచ్చల విడిగా చరిస్తూ దేవతలకు ఇబ్బంది కల్గిస్తుంటారు. బ్రహ్మ సలహావల్ల కేవలం శివుడు మాత్రమే ఒకే బాణం వల్ల వారిని చంపగలడని తెలిసి, దేవతలు శివుని ఆశ్రయిస్తారు. శివుడు అందరి దేవతలను తమ శక్తిలో కొంత తనకు ఇవ్వవలసిందిగా కోరి, వారు ఇచ్చిన శక్తివల్ల మహాదేవుడుగా గుర్తించబడతాడు. విష్ణువు బాణంమొనగాను, అగ్ని బాణపు చువ్వగాను, యముడు అంచుగాను, వేదాలుబాణంగాను, సావిత్రి అల్లెతాడుగాను, బ్రహ్మసారథిగాను ఉండగా శివుడు చంద్ర, అగ్ని, విష్ణుల శక్తిగల ఒకే బాణంతో మూడు పుర్రాలను అంతం చేస్తాడు "వాజసనేయసంహిత' 'శతపథ బ్రాహ్మణం', 'తైతరీయ' సంహిత' 'ఐతరీయ బ్రాహ్మణం', అనేవి త్రిపురాసుర సంహారాన్ని ఉగ్గడిస్తున్నాయి ప్రధానంగా యోగీశ్వరేశ్వరుడైన శివుడు వైదిక ప్రామాణికతను, ఔన్నత్యాన్ని పొందడం, కేవలం పశుపతిగా ఉన్న దేవుడు మహాదేవుడుగా పరిణమించడం త్రిపురాసుర సంహార మూర్తిలోని గూడార్థం.

**4:7:2:2:3:** శివుడు జటామకుటాన్ని, నాలుగు చేతులను కలిగి, దేవీసహితుడై ఆలీఢ స్థితిలో ఉంటాడు ఒక కుడిచేతిని సింహకర్ణముద్రలో చూపినాభి సూత్రపుస్థాయిలో అల్లెత్రాటిని బిగిస్తున్నట్లు చూపాలి. ఒక ఎడమ చేతిలో విల్లును పిడికిట బిగించినట్లు చూపాలి. ఆ విల్లు మూడు వంపులను కలిగిగాని, అర్ధచంద్రాకారంలోగాని ఉండాలి. మిగిలిన చేతులు కర్తరీ ముద్రలో ఉండగా, కుడిచేతటంకాన్ని, ఎడమ చేత కృష్ణమృగాన్ని (Antelope) ధరించి ఉంటాడు. ఎర్రని రంగులో ఉండే ఈ మూర్తి దేవీసహితుడై రజో భావానికి గుర్తుగా ఉంటాడు. 'ఉత్తరకామికాగమం' ప్రకారం ఈ శివుని మూర్తికి మూడు కన్నులు, కుడి చెవికి మకర కుండలం కలిగి ఉండాలి. శివుడు సమభంగంలో ఉండి, ఎడమ కాలిని అపస్మారపురుషునిపై ఉంచడం కూడా ఇంకొక స్వరూపంగా చెప్పబడింది.

**4:7:2:2:4:** ఒక వర్ణన ప్రకారం ఈ మూర్తికి ఎనిమిది చేతులుంటాయి. నాలుగు కుడిచేతులలో బాణ, పరాశు, ఖడ్గ, వజ్రాలుండగా, రెండు ఎమడ చేతులలో ధనస్సు, ఖేటక ఉంటాయి. మిగిలిన రెండు ఎడమ చేతులలో ఒకటి విస్మయముద్రలోను, వేరొకటి కటకముద్రలోను చూపబడాలి. ఈ రకమైన మూర్తి శరీరం అతిభాగంలో ఉండాలి వేరొక వర్ణనలో ఈ మూర్తికి పది చేతులను సూచించారు వానిలో ఐదుకుడి చేతులలో బాణ, చక్ర, శూల, టంక, వజ్రాలుంటాయి మూడు ఎడమ చేతులలో ధనుస్సు, శంఖం, ఖేటకం ఉంటాయి. మిగిలిన రెండు చేతులలో ఒకటి విస్మయముద్రలోను, వేరొకటి సూచీ ముద్రలోను ఉంటాయి.

**4:7:3:2:5:** ఇన్ని రకాల మూర్తులలోను శివునికి గల మూడు కన్నులు ఒకముఖం, ఎర్రని వర్ణం, ఎడమ వైపు దేవి సామాన్యలక్షణాలుకాగా, మిగిలినవన్నీ శివుని ఔన్నత్యాన్ని వివిధరీతులలో చాటి చెప్పేవే.

**4:7:2:3: అంధకాసుర సంహారమూర్తి:**

**4:7:2:3:1:** సప్తమాతృకలను తోడుగా చేసుకొని శివుడు అంధకాసురుణ్ణి సంహరిస్తాడు ఎనిమిది

చేతులుగల శివుడు రెండు చేతులతో ఒక త్రిశూలాన్ని పట్టుకొని ఉంటాడు ఆ త్రిశూలం చివర అంధకాసురుని శరీరం గుచ్చబడి ఉంటుంది. ఆ శరీరం నుండి జారే నెత్తురు చుక్కలను తన చేతి గిన్నెగా చేసి పట్టుకుంటున్న యోగీశ్వరిని, శివుడే తన కపాలాన్ని ఆధారంగా చేసికొని అంధకాసురుని శరీరం నుండి కారే నెత్తురును పట్టుకోవడాన్ని చూపడం జరుగుతుంది. మిగిలిన చేతులలో రెండింటితో శివుడు ఖడ్గాన్ని, ఢమరుకాన్ని పట్టుకొని మరి రెండు చేతులతో ఏనుగు చర్మాన్ని ప్రభామండంలా పట్టుకొని, మిగిలిన చేతిని తర్జని ముద్రలో ఉంచడం జరుగుతుంది.

**4:7:2:3:2:** యోగీశ్వరి అనే కాళి జటామండలంతో చుట్టబడిన శిరస్సు కలిగి వేరొక చేత ఖడ్గాన్ని పట్టుకొని, ఒక చేతిలో నెత్తురు పట్టుకొంటూ ఉంటుంది. ఆమె శిరస్సుపై ఢాకినీ ప్రతిమ సగం పక్షి, సగం మానవదేహంతో మాంసంకోసం ఎదురుచూసే చూపులతో ఉంటుంది. కాళికి కుడి చేతి పక్క పద్మాసనంలో దేవీ ప్రతిమ ఉంటుంది

**4:7:2:3:3:** అంధకాసురవధ వృత్తాంతం, 'తమ సోమా జ్యోతిర్గమయ', అనే ఉపనిషద్వాక్యానికి శైవపరమైన, జ్ఞానదాయకమైన వ్యాఖ్యనం అనడం సబబు తమస్సుహరించి, పరాశక్తి కృపవల్లి సత్త్వగుణాధికమైన జ్ఞానాన్ని పొందడం ఈ ఘట్టంలోని ప్రాముఖ్యత.

### 4:7:2:4: గజాసుర సంహారమూర్తి(లేదా) గజాంతకమూర్తి:

**4:7:2:4:1:** కూర్మపురాణంలో కాశీలోని కృత్తివాసేశ్వరస్వామి మహాత్మ్యాన్ని వివరించే సందర్భంగా గజాసుర సంహారాన్ని పేర్కొనడం జరిగింది ఒక అసురుడు గజరూపంలో అనేక బ్రాహ్మణుల తపోభంగం కావించే సందర్భంగా శివుడు అతణ్ణి చంపి, అతని చర్మాన్ని తన వస్త్రంగా స్వీకరించినట్లు ఈ కథలో ఉంది కాని 'వరాహపురాణం'లోను 'సుప్రభేదాగమం'లోను ఈ వృత్తాంతమే ఇంకో రకంగా వర్ణితమైంది కాని అన్ని ఆధారాలు సామూహికంగా శివుడు గజాసురుణ్ణి చంపడం, అతని చర్మాన్ని ధరించడం అనే విషయాలను ఒకే రీతిలో వర్ణిస్తున్నాయి. తంజావూరు జిల్లాలోని 'వళువూర్' అనే ప్రాంతంలో ఈ గజాసుర సంహారం జరిగిందని పేర్కొనడం జరుగుతుంది

**4:7:2:4:2:** 'అంశుమద్భేదాగం', 'శిల్పరత్నం', మొదలైన గ్రంధాలు గజాసుర సంహార మూర్తిని వివరించాయి అంశుమద్భేదాగం'లో శివుడిక నాలుగు లేక ఎనిమిది చేతులున్నట్లు చూపాలని పేర్కొన్నారు. నాలుగు చేతులుంటే కుడిచేతులలో ఒక దానిలో పాశాన్ని వేరొక చేతిలో గజ చర్మాన్ని చూపి, ఎడమ చేతులలో ఒకటి ఏనుగు కుంభస్థలాన్ని పట్టుకొన్నట్లు, వేరొకటి గజ చర్మాన్ని పట్టుకొన్నట్లు చూపాలి ఆ విధంగా గాక ఎనిమిది చేతులుంటే, మూడు కుడిచేతులలో త్రిశూల, ఢమరుపాశాలును, వేరొక చేతిలో గజ చర్మాన్ని చూపాలి ఎడమ చేతులు నాల్గింట్లో రెండింట ఏనుగు కుంభస్థలం, కపాలం విడిగా చూపి, మిగిలిన రెండింట ఒక దానితో గజ చర్మాన్ని పట్టుకొన్నట్లు, వేరొక దానిని విస్మయంలో ఉంచినట్లు చూపాలి. ఎడమ కాలిని ఏనుగు తలపై ఆన్చి చూపి, కుడి కాలిఎడమ తొడపై కెత్తినట్లు గా చూపాలి. శివున మకుటంపై ఏనుగు తో కనుచూపి కాళ్ళును ఇరువైపులా సందర్భోచితంగా ఏర్పరచాలి. ఏనుగు చర్మాన్ని శివుని ప్రభామండలమా! అన్నట్లు వెనుకతట్టుగా చూపాలి సర్వాలంకార భూషితుడైన శివుడికి ఎడమ

వైపు బాలుడైన షణ్ముఖుని బెదరిన ముఖంతోను, దగ్గరకు తీసుకొన్న దేవీ మూర్తిని చూపాలి. ఈ రకమైన ఉదాహరణలను అమృతపురం, హలేబీడు, దా రాసురం, వళువూరు, తిరుచ్చెంగట్టంకుడి మొదలైన చోట్ల చూడగలం.

**4:7:2:5: కాలారిమూర్తి:**

**4:7:2:5:1:** పురాణ ప్రసిద్ధమైన సంహారమూర్తులలో కాలారిమూర్తి పరమ ప్రసిద్ధమైనది. ఈ రూపాన్ని అంశుమద్భేదాగం, 'కామికాగమం', 'కారణాగమం', మొదలైన ఆగమాలలో చూడగలం.

4ఐ7:2:5:2: మృకండుడు అనే మహర్షికి, దైవకృప వల్ల, సర్వసద్గుణోపేతుడయి, అల్పాయుష్కుడైన మార్కండేయుడు అనే కుమారుడు, మనస్విని అనే భార్యద్వారా కలుగుతాడు. మార్కండేయుని ఆయుర్దాయం కేవలం పదహారేళ్ళు తన అల్పాయుర్దాయాన్ని గూర్చి తెలిసిన అతడు 'తిరుక్కడవూర్ అనే ప్రాంతంలో శివలింగాన్ని పూజించాడని, దైవానుగ్రహం కోసం జరిపిన యాత్రలలో అది ఒకటని ప్రాంతీయ సాంప్రదాయం వల్ల తెలుస్తుంది. అతడు శివుణ్ణి పూజిస్తుండగా అతని ఆయుర్దాయం తీరడం వల్ల యమ భటులు వస్తారు కాని అతణ్ణి చంపడం వారిచేత కానందువల్ల స్వయంగా యముడే వస్తాడు శివలింగాన్ని కౌగిలించుకొని పూజిస్తున్న మార్కండేయుణ్ణి యముడు తన పాశం ద్వారా బంధించగలుగుతాడు. కాని, శివుడు అతణ్ణి వక్షస్థలంపై తన్నడంతో యముడు మూర్ఛపోతాడు. ఆ తరువాత తాను ఆ శివ భక్తుని పట్ల అపరాధం చేశానని తలచి వెనక్కి పోతాడు. శివుని దయవల్ల మార్కండేయుడు చిరంజీవి అవుతాడు. శివుడు యముని అణచినమూర్తిని కాలారిమూర్తి అంటారు.

**4:7:2:5:3:** కాలారిమూర్తి కుడికాలు పద్మపీఠంపై ఉండగా, ఎడమ కాలు యముడి వక్షస్థలాన్ని తన్నడానికి అనువుగా చూపబడుతూ యముని గుండెలపై శివుని బొటన వేలు ఆనినట్లు చూపాలి శివుడు మూడు కళ్ళను, జటామకుటాన్ని నాలుగు లేక ఎనిమిది చేతులు కలిగి ఉన్నట్లు చూపాలి. నాలుగు చేతులుంటే ఒక కుడి చేతిలో శూలాన్ని, వేరొక చేతిలో పరశువును ధరించడంగాని, వరద ముద్ర చూపినట్లు గాని ఉండాలి ఎడమచేతులలో ఒకటి నాభికి సరిపోయిన ఎత్తులో సూచీముద్రలో ఉండగా, వెనుక ఎడమ చేయి విస్మయ భావంలో ఉండాలి విస్మయంలో ఉన్న ఈ చేయి చూపుడువేలు ఉష్ణీషపర్యంతం ఎత్త బడి ఉండాలి. ఎనిమిది చేతులుంటే కుడిచేతులలో శూల, పరశు, వజ్ర, ఖడ్గాలను చూపాలి ఎడమ చేతులలో రెండింట ఖేటకం, పాశం ఉండగా, మిగిలిన రెండు చేతులు విస్మయ, సూచీ ముద్రలలో ఉండగా, సర్వాభరణ భూషితుడైన శివుడు ఎర్రని పగడం రంగులో ఉండాలి. యముడు రెండు చేతులు, రెండు కాళ్ళు, తలపై కరండమకుటం కలిగి ఒక చేతిలో పాశాన్ని ధరించి వేరొక చేతిలో శివునికి అంజలి ఘటిస్తున్నట్లు చూపాలి

**4:7:3:5:4:** 'అంశుమద్భేదాగమం' లోని ఈవర్ణనలో'కామికాగమం', 'కారణాగమం' కొన్ని చిన్న మార్పులను చేశాయి ఈ మార్పులు యముడి ప్రపత్తిని, శివుడి గొప్పదనాన్ని, ఔదార్యాన్ని సూచించేవే ఎల్లోరా, పట్టీశ్వరం, తిరుచ్చెంగట్టుంగుడి మొదలైన చోట్ల కాలారిమూర్తి ఉదాహరణలు చూడగలం

### 4:7:2:6: బ్రహ్మశిరచ్ఛేదకమూర్తి:

**4:7:2:6:1:** 'వరహపురాణం', 'కూర్మపురాణం','శ్రీతత్వ నిధి' అనే ఆధారాల్లో ఈ మూర్తి ఆవిర్భావాన్ని గూర్చి తెల్పడం జరిగింది. బ్రహ్మ రుద్రుణ్ణి కపాలి అని సంబోధించడం వల్ల రుద్రుడు కోపం పొంది తను ఎడమ బొటన వేలితో బ్రహ్మ ఐదవతలను తొలగించగా, ఆ చేతికి ఆతల తగులుకొని ఉంటుంది తరవాత బ్రహ్మసలహాపై శివుడు చంద్రగిరికి వెళ్ళి కేశయజ్ఞోపవీతం ధరించి ఎముకల మాలను అక్షమాలగా, తలపై జటామకుటంలో పుర్రెను ఆభరణంగా ధరించి మహేంద్రగిరిలో పండెండేళ్ళు కాపాలికునిగా గడిపి, తీర్థయాత్రలు చేస్తూకాశీనగరానికి రాగానే అక్కడ శిరస్సు పతనమై, గంగా స్నానం ద్వారా రుద్రుడు బ్రహ్మహత్యా విముక్తి పొంది కైలాసానికి తిరిగి వస్తాడు ఆ శిరస్సు పడిన ప్రాంతాన్ని కపాలమోచనం అని పిలుస్తారు 'కూర్మపురాణంలో కథ వేరే విధంగా ఉంది బ్రహ్మ తనను సృష్టి కర్తగా ప్రకటించుకుంటాడు. అప్పుడు శివుడు ఆవిర్భవిస్తాడు. బ్రహ్మ–శివుల మధ్య సృష్టికర్తృత్వాన్ని గూర్చి వివాదం తల ఎత్తుతుంది. శివుడే గొప్పవాడని వేదాలు ప్రకటిస్తాయి అయినా బ్రహ్మ అంగీకరించడు శివుడు అప్పుడు బ్రహ్మ తలను తెగ నరకవలసినదని భైరవుణ్ణి ఆదేశిస్తాడు కాని బ్రహ్మ తన తలను త్యాగం చేసి, శివుని గొప్పదనాన్ని తెలుసుకొని తన అహంభావాన్ని పోగొట్టుకుంటాడు.

**4:7:2:6:2:** శ్రీతత్వనిధి ప్రకారం తెల్లని శరీరం గల శివుడు మూడు కళ్ళు, నాలుగు చేతులూ జటామకుటం, కుడి చెవికి పత్రకుడంలం, ఎడమ చెవికి నక్రకుండలం కలిగి ఉంటాడు కుడి చేతులలో వజ్రం, పరశువు ఉండగా, ఎడమ చేతులలో ఒక దానిలో బ్రహ్మశిరస్సు,వేరొకదానిలో శూలం ఉంటాయి. బ్రహ్మ శిరస్సు వ్యాఘ్రాజినం(పులిచర్మం)తో కప్పబడి ఉంటుంది. ఈ మూర్తి శివుడి వైదిక ప్రాశస్త్యాన్ని చాటుతుంది.

### 4:7:2:7: వీరభద్రమూర్తి:

**4:7:2:7:1:** 'కూర్మపురాణంలోను "మహాపురాణంలో"నూ 'భాగవత పురాణం'లోను శ్రీతత్వనిధిలోను, కారణాగమంలోను వీరభద్రమూర్తి ఆవిర్భావాన్ని గూర్చి వైవిధ్యంతో కూడిన సందర్భాలను చెప్పడం జరిగింది. అన్ని సందర్భాలలోను, శివుడు అహంకారంతో రుద్రుని, శివుని గొప్పదనాన్ని కించపరచి, అతని భార్యఅయిన సతీదేవిని యజ్ఞం వద్ద అవమానించడం ద్వారా సతీదేవి అగ్నికి ఆహుతి అవుతుంది అప్పుడు శివుడి క్రోధాగ్నికి అతని జటనుండి వీరభద్రుడు ఆవిర్భవించి ధక్షాధ్వరాన్ని నాశనం చేసి, దక్షుని తలను నరుకుతాడు. శివుడు ఆతరవాత మేకపోతు తలను దక్షునికి అమర్చి పునరుజ్జీవితుణ్ణి చేస్తాడు అనేవి సామాన్యమైన అంశాలు. కాని ఈ కథ చెప్పబడిన సందర్భాలలో దధీచిమహర్షి శివునికి, విష్ణునికి గల వైదిక ప్రాముఖ్యత ఉగ్గడించి, దిక్పాలకులకు, ప్రజా పతులకు బ్రహ్మకుగల యజ్ఞాధికారాన్ని అణచివారిని వేదబాహ్యులుగా చూపించడం వంటివి. శివుని వైదిక ప్రాశస్త్యాన్ని పునరుద్ఘాటిస్తున్నాయి 'నమ ఉగ్రాయచ ధీమాయ' అని 'శతరుద్రీయంలో రూపితమైన రుద్రుని స్వరూపం వీరభద్ర మూర్తిలో అభివ్యక్తం అవుతుంది

**4:7:2:7:2:** 'శ్రీతత్వనిధి' ప్రకారం వీర భద్రుడు మూడు కళ్ళను, భయంకరమైన దౌడలతో

భీషణమైన ముఖాన్ని, నాలుగు చేతులను కలిగి ఉంచాడు. ఎడమ చేతులలో ధనుస్సు, గద ఉండగా, కుడిచేతులలో ఖడ్గం, బాణం ఉండాలి వీరభద్రుడు పుర్రెల దండను దాల్చి పాదరక్షలపై నిల్చి ఉంటాడు. వీరభద్రునికి సమీపంలో ఎడమ వైపు భద్రకాళి కుడివైపు మేకపోతు తలతో రెండుకళ్ళు, రెండుకొమ్ములు కలిగి అంజలి ముద్రలో ఉన్న దక్షుడిని చూపాలి.

**4:7:2:7:3:** కాని 'కారణాగమం'లో వీరభద్రుని వర్ణన ఇంకో విధంగా ఉంది ఇతడు మూడు కన్నులతో, నిప్పులు చిందే జటలను, భీషణమైన భుజస్కందాలను, నాలుగు చేతులను కలిగి ఉంటాడు. తేళ్లతో చేసిన పుర్రెలను, గంటను గల మాలను సర్పయజ్ఞోపవీతాన్ని కలిగి, రెండు పాదరక్షలపై చిన్న అంగవస్త్రాన్ని ధరించి నిలబడి ఉంటాడు వీరభద్రుడు ఎర్రని రంగులో భీకరత్వానికి నిలయంలా ఉండాలి. నాలుగు నేతులలో ఖడ్గ, ఖేటక, ధను,ర్బాణాలను ధరించి నిలబడి ఉంటాడు ఈ ప్రతిమను స్థాపించడం అనేక పాతకాలను, రుగ్మతలను అణవేస్తుందని నమ్మకం

**4:7:7:4:** శ్రీశైలం, లేపాక్షి టెంకాశి మొదలైన చోట్ల భీమ రూపుడయిన వీరభద్రమూర్తిని ఏర్పరచడం జరిగింది

**4:7:2:8: భైరవుడు:**

**4:7:2:8:1:**'రుద్రాధ్యాయం'లో క్షేత్రపాలకుడని, 'క్షేత్రాణాంపతయే' అని అభివర్ణితమైన శివుని స్వరూపం భైరవుడిది దీనిలో'వటుక భైరవుడు', స్వర్ణాకర్షణ భైరవుడు, అసితాంగ,రురు, చండ, క్రోధ, ఉన్మత్త, కాపాల, భీషణ, సంహార భైరవులనే అరవై నాలుగు రకాల భైరవులున్నట్లు, 'విష్ణుధర్మోత్తరపురాణం','రూపమండనం','రుద్రయామళమంత్రాలు' మొదలైనవి పేర్కొన్నాయి ప్రసిద్ధమైన భైరవ ప్రతిమలను పట్టీశ్వరం, కలకత్తా, ఎల్లోరా మొదలైన చోట్ల చూడగలం

**4:7:2:8:2:** విష్ణుధర్మోత్తర పురాణం ప్రకారం భైరవుడు పెద్దకడుపును, గుండ్రని పసుపు పచ్చని కళ్ళను, పెద్ద నాసికా రంధ్రాలను కలిగి పుర్రెలను మాలగా కలిగి ఉంటాడు పాములు మొదలైన ఆభరణాలతో అలంకృతమై ఉంటాడు భైరవుడు ఏనుగు చర్మాన్ని ధరించి, నల్లని మేఘ చ్ఛాయతో ఉండాలి. అతడు అనేక ఆభరణాలను ధరించి పార్వతిని పాముతో భయపెడ్తున్నట్లు చూపబడాలి.

**4:7:2:8:3:** 'వటుక భైరవుడు' ఎనిమిది చేతులను కలిగి ఉంటాడు. ఆరింట్లో ఖట్వాంగం, పాశం, శూలం, ఢమరువు, కపాలం, సర్పం, ధరించి ఉంటాడు. ఒక చేతితో ఖడ్గాన్ని పుచ్చుకొన్నట్లు, ఇంకొక చేతిని అభయముద్రను చూపాలి. భైరవునికి సమీపంలో ఒక శునకాన్ని చూపాలి 'వటుక భైరవకల్పం', ప్రకారం ఇతడు ఎర్రని జటలను, ఎర్రని శరీరాన్ని, మూడు కళ్ళను కలిగి శునకం వాహనంగా ఉండాలి ఇతడు చేతులలో శూలం, పాశం, ఢమరువు, కపాలం ధరించి, నగ్నంగా భూతపరివేష్టితుడై ఉండాలి

**4:7:2:8:4:** 'స్వర్ణాకర్షణ భైరవుడు' పచ్చని రంగులో, పసుపు పచ్చని వస్త్రాలు కలిగి మూడు కన్నులు, నాలుగు చేతులు కలిగి, సర్వాభరణ భూషితుడుగాను, సర్వదేవపరివేష్టితుడుగాను ఉండాలి. ఈ భైరవుడు అధికారానికి, ఆనందానికి గుర్తు. అతడు తన చేతులలో బంగారం,

నవరత్నాలు గల ఒక పాత్రను, చామరాన్ని తోమరాన్ని, భుజంమీద శూలాన్ని కలిగి ఉండాలి.

**4:7:2:8:5:** ఇక, రుద్రయామళం'లో చెప్పిన భైరవులలో 'విశాలాక్ష', 'మార్తాండ', 'మోదక ప్రియ', 'స్వచ్ఛంద', విఘ్నసంతుష్ట', 'ఖేచర', 'సచరాచరులను అసితాంగభైరవులని అంటారు వీరు స్వర్ణవర్ణంలో త్రిశూల, ఢమరు,పాశ ఖడ్గాలు కలిగి ఉంటారు '(కోడదంష్ట'; జటాధర', 'విశ్వరూప', 'నానారూపధర', 'వజ్రహస్త', 'మహాకాయు',లను రురులని అంటారు. వీరు స్వచ్ఛమైన తెల్లని శరీరంతో రత్నగర్భితమైన భూషణాలను, అక్షమాల, అంకుశం, పుస్తకం, వీణ, కలిగి ఉంటారు. చండ్, ప్రళయాంతక, భూమికంప, నీలకంఠ, విష్ణు కులపాలక, ముండపాల, కామపాలు, రను చండులంటారు. నీలంరంగుగల వీరు అగ్ని, శక్తి, గద, కుండములు కలిగి ఉంటారు పింగళేక్షణ, అభ్ర రూప ధరాపాల, కుటిల, మంత్రణాయ కరుద్ర పితామహులను క్రోధులుంటారు ధూమవర్ణం (పొగరంగు) గల వీరు ఖడ్గ, ఖేటక, ఛురిక, పర శువులు కలిగి ఉంటారు

**4:7:2:8:6:** 'పటుకనాయక', 'శంకర', భూతవేతాళ','త్రినేత్ర', 'త్రిపురాంతక', 'వరద','పర్వతవాసు'లను ఉన్మత్తభైరవులంటారు తెల్లనిరంగుగల వీరు కుండ, ఖేటక, పరిఘ, భిండిపాలములు కలిగిఉంటారు.

**4:7:2:8:7:** 'కాపాల', 'శశిభూషణ(, హస్తి చర్మాంబరధర, యోగేశ, భ్రమరాక్ష, సర్వజ్ఞ, సర్వదేవేశ, సర్వభూత హృదిస్థితులనే వారిని కాపాలు లంటారు. వీరు పచ్చని రంగులో ఉండి, ఉన్మత్త భైరవుల వలెనే కుండ, ఖేటక, పరిఘ, భిండిపాలములు (ఇనుపలులుగువంటివి) ధరించి ఉంటారు.

**4:7:2:8:8:** 'భీషణ', 'భయహర', 'సర్వజ్ఞ', కాలాగ్ని మహారౌద్ర, దక్షిణ; ముఖర, అస్థిరులను వారిని భీషణులంటారు. వీరు ఎర్రని రంగులో ఉండి, ఖేటక, పరిఘ, భిండిపాలాలు ధరించి ఉంటారు.

**4:7:2:8:9:** అతిరిక్తాంగ, కాలాగ్ని, ప్రియాంకరీ, ఘోరానాధ విశాలాక్ష, యోగేశ, దక్షసంస్థితులనే వారిని సంహార భైరవులంటారు. వీరు మెరుపు రంగులో ఉంటారు

ఈ రకమైన భైరవులలోని విశేషాలు శైవసాంప్రదాయంలోని సంహార మూర్తుల వైవిధ్యాన్ని పౌరాణిక ప్రాశస్త్యాన్ని నిరూపిస్తాయి

### 4:7:2:9: మహాకాలుడు :

**4:7:2:9:1:** 'శివపురాణంలోను లలితోపాఖ్యానంలోను ఉజ్జయినీ నగరంలో గల మహాకాలుని గూర్చి, అతని శక్తి అయిన మహాకాళిని గూర్చి చెప్పడం జరిగింది. ఉజ్జయిని సమీపంలో గల బ్రాహ్మణులను దూషణుడనే రాక్షసుడు హింసిస్తుండగా, శివుని ఆ బ్రాహ్మణులురక్షణ కోసం ప్రార్థిస్తారు శివుడు ప్రత్యక్షమై మహాకాలుని భస్మంచేస్తాడు. ఆ తరవాత బ్రాహ్మణులకోరికపై, శివుడు మహాకాలుని మూర్తిగా, జ్యోతిర్లింగంగా అవతరించాడు అతడు నల్లని రంగుతో, సురపాన మత్తురతో ఎర్రనయిన కన్నులు కలిగి ఉంటాడు. అతని దృష్టి మహా కాళిపై ఉంటుంది. మహాకాలునికి రెండు వైపులా కాళుడు, మృత్యువు ఉండాలి

### 4:7:2:10: ఇతర సంహార మూర్తులు :

శరభేశ్వర మూర్తి, జలంధర హార మూర్తి, మల్లారిమూర్తి, అఘోరమూర్తి మొదలైనవి శివుని సంహార మూర్తులలో కొన్ని. వీనిలో శరభేశ్వర మూర్తి, నారసింహావతార సందర్భంగా, శివుడు శరభమృగంగా

అవతరించి నరసింహుని ఉగ్రభావాలను అణచివేస్తాడు. ఈ రకమైన సంహారమూర్తులన్నీ శివునిలయ కారకత్వానికి గుర్తులు.

### 4:7:3: నృత్యమూర్తులు:

**4:7:3:1:** కృష్ణయజుర్వేదంలో శత రుద్రీయంలో శివుని విభూతిని అభివర్ణిస్తూ నమఃసభాభ్యః సభాపతిభ్యశ్చ" సభకు, సభాపతికి నమస్కారం అని చేసిన వ్యాఖ్య నటరాజమూర్తి అయిన శివుని నిరూపిస్తున్నది. ఈ అభిప్రాయం ప్రసిద్ధ విమర్శకులైన శివరామమూర్తిది శివుడు నూట ఎనిమిది రకాలైన నృత్య భంగిమలను అభివ్యక్తం చేశాడని శైవాగమాలలో అభివర్ణించగా, నాట్యం నూట ఎనిమిది భంగిమలుగా గలదని భరతుడు నాట్యశాస్త్రంలో ప్రవచించాడు. లాస్యం, తాండవంఅనేవి రెండు ప్రధానమైనవి నాట్యస్వరూపాలు కాగా, తాళప్రధానమైనది నృత్తమని, తాళలయ ప్రధానమైనది నృత్యమని, రాగ,తాళ, లయ, ప్రధానమైనది నాట్యమని సాంప్రదాయం. ఈ రకంగా నృత్త నృత్య, నాట్యాలు మూడు నటరాజు సభాపతిగా అభివ్యక్తం చేస్తాడు ఉమాసహితమూర్తిగా లాస్యానికి, కేవల లయ కారక మూర్తిగా తాండవానికి శివుడు అధిపత్యం వహించి అతడే సభ, సభాపతి రెండు కాగలిగాడు అంశు మద్భేదాగం' ఉత్తర కామికాగమం వంటి శైవాగమాలు, 'పెరియపురాణం' వంటి శైవ పురాణాలు నట రాజమూర్తి లోని వైశిష్ట్యాన్ని, రూపవైవిధ్యాన్ని పేర్కొన్నాయి.

చిదంబరం, మధురై, మొదలయిన ప్రాంతాలలో నట రాజులోని నృత్త, నృత్య వైవిధ్యాన్ని చూడడం జరుగుతుంది శివునికి పేర్కొన్న 108 భంగిమలలో ఎనిమిది, లేదా తొమ్మిది భంగిమలు అతి ప్రధానమైనవనిపేర్కొనడం జరిగింది. నృత్యమూర్తిగా శివుడు తమోగుణానికి, మాయకు అధికారి అయిన అపస్మార పురుషుని అణచి, నిత్యానంద కారకమైన శుద్ధ సత్త్వం తో కూడిన జ్ఞానాన్ని పరాశక్తి సమ్మేళనంతో అందజేస్తాడు అనడం ఈ నృత్యమూర్తులలోని అంతరార్థం

### 4:7:4: నవ విధ మూర్తులు :

**4:7:4:1:** 'అంశుమద్భేదాగమం' ప్రకారం నటరాజయిన శివుని ప్రతిమను ఉత్తమదశాంశమానం ప్రకారం తీరిదిద్దాలి ముందుండే ఎడమ చేతిని దండహస్తంగా గాని, గజహస్తంగాగాని తీర్చిదిద్దాలి. వెనక గల ఎడమ చేతిలో ఒక పాత్రలోగాని, అరచేతిలోగాని అగ్ని ఉండాలి ఏ విధంగా నైనా అది ఎడమ చేతి మధ్య వేలిని తాకుతున్నట్లు చూపాలి ముందుకు చూపిన కుడి చేయి అభయ ముద్రలో ఉండగా, ఈ చేతి ముంజేతి (Wrist) కి సర్పవలయం (దీనినే భుజంగవలయం అని కూడా అంటారు.) ఉండాలి. వెనక గల చేతిలో ఢమరుకం ఉండాలి. భుజంగ వలయం మణికట్టు దగ్గర మెలికలు తిరిగిన పామును కలిగినది ఇద మణికట్టు కన్న నాలుగో వంతు హెచ్చుగా ఉండాలి. తోక, పాము శరీరం కలిసే చోట పాము పడగవేచి ఉండాలి ఈ పడగ 12 అంగుళాలఎత్తు, 7 అంగుళాల వెడల్పు 1 అంగుళం మందం కలిగి ఉంటుంది అభయ ముద్రలోగల కుడిచేయి మధ్యవేలు హిక్కాసూత్రాన్ని తాకుతూ ఉండాలి.కుడి కాలు కొంచెం వంచి దానిని అపస్మారపురుషుని వీపుమీద ఉంచాలి ఆమె కాలు నాభిసూత్రాన్ని తాకేటట్లుండాలి. ఎడమ కాలు కొంచెం లేపి కుడి కాలుని తాకేటట్లుండాలి. అలంకరణలో దుర్థుర , అర్కపుష్పాలు, పాము, నగలతో కూడిన

ఆభరణాలు, వికటంగా ఉన్న మానవ కపాలం, ఎడమ వైపు అర్ధచంద్రుడు ఉండాలి. శివుని శరీరంపై యజ్ఞోపవీతం, ఉపసూత్రం, మధ్యవేలికి మినహా అన్ని వేళ్ళకు ఉంగరాలు, అందెలు ఉండాలి ఈ మూర్తి ముఖం చిరునవ్వుతో అలంకృతమై ఉండాలి. నటరాజుకు ఎడమ వైపున 'ఉమా సహిత చంద్రశేఖర మూర్తి' లో వలె పార్వతిని తీర్చి దిద్దాలి. అపస్మార పురుషుడు నల్లని రంగులో ఉండి, అతడు సర్పంతో ఆడుకొంటున్నట్లు వేళ్ళను నాగముద్రలో ఉంచి చూపాలి.

**4:7:4:1:1:** 'కామికాగమం' ప్రకారం జటామండలం, జటామకుటం చుట్టూ ఏర్పరచబడి ఉండాలి. ఆ జట లు గోధుమ ఎరుపు రంగులో విడిగా చూపబడి ఐదునుండి ముప్పైవరకు ఉండాలి. శివుని మెడచుట్టూ మౌక్తిక(ముత్యాలు), వకుళ(వకుళ పుష్పాలు) సర్ప, శంఖాల మాలలు ఎడమ భుజం మీద వ్యాఘ్రాజినంకాని, కృష్ణాజినం కాని ఉండాలి. ఎడమ చెవికి పత్రకుండలం, కుడి చెవికిన క్రకుండలం ఉండాలి. అందెలు ఘటికలతో చేయబడి ఉండాలి. ఈ రకమైన నృత్యాన్ని భుజంగ త్రాసంమని, ఎత్తైన కాలిపాదం మిగిలిన కాలిమోకాలి కన్న హెచ్చుగా ఉంటే, భుజంగల లితమని అంటారు అభినవ గుప్తుని 'నాట్యవేదం వృత్తి' ప్రకారం సమీపంలో పామును చూసి అస్థిరమైన నడకతో బెదరి కాలును ఎత్తినట్లు చూపే, ఈ నృత్యం భుజంగత్రాసం దీనిలో ఒక చేయి 'దోలాహస్తం'లోను, ఒక చేయి కటకముద్రలోను ఉండాలి. ప్రశిథిలమయి పతాకహస్తం వలె ప్రబలంచితమైన అంసములుగల హస్తాన్ని దోలాహస్తమని భరతనాట్యశాస్త్రంలో పేర్కొనడం జరిగింది. శిల్పరత్నం'లో భుజంగత్రాసంలో ఉన్ననటరాజమూర్తి సారమండలాన్ని పోలిన ప్రభా మండలం కలిగి ఉండాలని పేర్కొనడం జరిగింది

**4:7:4:1:2:** ఈ భుజంగత్రాస మూర్తి దక్షిణ భారతదేశంలో సర్వసామాన్యంగా కనిపించే నటరాజమూర్తిలో అభివ్యక్తమవుతున్నది ఈ నటరాజునే నటన సభాపతి అని, కనకసభాపతి అని వర్ణించడం జరిగింది

**4:7:4:2:** రెండవ నృత్యవిశేషాన్ని తాండవం అంటారు. ఇది శివుని తమోగుణానికి చిహ్నమైన భైరవునికి లేదా వీరభద్రునికి చెంది ఉండాలి. ఈ రీతిలో శివుడికి పదిచేతులుండి, ఎడమ వైపు దేవిని కలిగి, సర్వభూత గణపరివేష్టితుడుగా చూపబడాలి. ఈ నృత్యం సామాన్యంగా వల్లకాడులో నిర్వహించడం జరుగుతుంది. తాండవం అనార్య సాంప్రదాయానికి గుర్తు (ఫోటో నం. 11)

**4:7:4:3:** మూడవ నృత్య విశేషాన్ని, ఋషి, దేవగణ సమీపంలో కనకసభలో నిర్వహించి. నాదాంతనృత్యం' అంటారు. 'కోయిల్‌పురాణం' ప్రకారం తారకావనంలో ఉన్న సిద్ధాంతాను యాయులైన కొందరు రుషులు శివుని వైశిష్ట్యాన్ని గుర్తించి, తమన వైఫల్యం పొందినట్లుగా భావించి, శివుని పట్ల ప్రపత్తి వ్యక్తపరచినప్పుడు శివుడు చేసిన నృత్యాన్ని నాదాంతం అంటారు. ఆదిశేషుని కోరిక మీద ఆ నృత్యాన్ని శివుడు మరల 'చిదంబరంలోని తిల్లైలో తిరిగి నిర్వహించాడు. వీనిలో నటరాజమూర్తి ప్రతిమను యధాతథంగా చూపాలి. నాలుగు చేతులు గల ఈ మూర్తిని వేలాడుతున్న జటాకలాపంతో చూపాలి అతని శిరస్సుపై మాలికలాగ ఉన్న సర్పం, పుర్రె, గంగాముఖాంబుజం, దానిపై అర్ధచంద్రుని చిహ్నం, కసిందచెట్టు ఆకులమాల ఉండాలి కుడి చెవి మగవాని అలంకారాన్ని, ఎడమ చెవి స్త్రీ అలంకారాన్ని కలిగి వివిధాలంకారాలు కలిగి ఉండాలి.

అంగవస్త్రం, యజ్ఞోపవీతం ఉండాలి. ఒక కుడిచేతిలో ఢమరుకం, వేరొక కుడిచేయి అభయ ముద్రలోను ఉండాలి. ఎడమ చేతులలో ఒక వానిలో అగ్నిని ధరించి ఉండగా, ఇంకొక చేతిని ఎత్తిన కాలివంక చూపుతూ ఉండాలి. కుడిపాదంతో 'ముయలకుడు' అనే అపస్మార పురుషుని అణచివేసి ఉండాలి.

**4:7:4:3:1:** ఈ నృత్యంశివుని పంచకృత్యాలయిన సృష్టి, స్థితి, సంహార, తిరోభవ అనుగ్రహాలను సూచిస్తుంది. ఇవన్నీ విడివిడిగా బ్రహ్మ, విష్ణు, రుద్ర, మహేశ్వర సదాశివుల కార్యాలుగా గుర్తించబడ్డాయి

**4:7:4:3:2:** ఢమరుకం నుండి సృష్టి, హస్తం నుండి స్థితి, అగ్ని నుండి సంహారం, పాదంనుండి ముక్తి లేదా అనుగ్రహాల సూచించగా, ఎత్తిన పాదం కైవల్యాన్ని లేదా ఆత్మ మోక్షణాన్ని సూచిస్తుంది", అని ఆనంద కుమారస్వామి తన 'ది డాన్స్ ఆఫ్ శివ' అనే వ్యాసంలో పేర్కొన్నాడు శివుని నృత్యం పంచాక్షరాలతో సమన్వయించబడింది.

**4:7:4:4:** నాలుగవ నృత్య విశేషం కూడా భుజంగ త్రాసభుజంగ లలిత, తాండవ, నాదంతనృత్యాలనే ఇంచుమించు పోలి ఉంటుంది.

**4:7:4:5:** ఐదవ నృత్య విశేషంలో కుడికాలు మకుటానికి సమాంగా ఎత్తి, ఎడమ కాలు కొంచెం వంచి అపస్మారపురుషునిపై ఉంచాలి ఈ మూర్తికి ఎనిమిది చేతులుండాలి. కుడి నాలుగు చేతులలో మూడింట శూలం, పాశం, ఢమరుకం ఉండగా మిగిలిన చేయి అభయముద్రలో ఉంటుంది ఎడమ చేతులలో మూడింట కపాలం, అగ్ని, ఘంట ఉండగా మిగిలిన చేయి గజహస్తముద్రలో ఎడమ నుంచి కుడికి ఉంటుంది.

**4:7:4:6:** ఆరవ నృత్య విశేషంలో పాదాలు ఐదవ దానిలో వలె ఉన్నప్పటికీ, శివుడికి పదహారు చేతులుంటాయి కుడి ఎనిమిది చేతులలో ఏడింట ఢమరుకం, వజ్రం, శూలం, పాశం, టంకం, దండ హస్తం లేదా పతాకహస్తం, సర్పం ఉండగా, ఎనిమిదవ చేయి అభయ ముద్రలో ఉంటుంది ఎడమ వైపు గల ఎనిమిది చేతులలో ఒకటి గజహస్తంగా ఉండగా, మిగిలిన ఏడింట అగ్ని, మిధునం, వలయం, ఘంట, ఖేటకం, కపాలం ఉండాలి ఈ మూర్తికి ఎడమ వైపున నృత్యమూర్తి అయిన పార్వతి, ఆమె ఎడమ చేత స్కందుని ధరంచి, చేతులు అంజలి ముద్రలో ఉన్నట్లు మోములో భయాశ్చర్యాలు ముప్పిరిగొన్నట్లు చూపాలి.

**4:7:4:7:** ఏడవ నృత్యవిశేషంలో మూడు కన్నులు, విప్పారిన జటామండలం, ఎనిమిది చేతులుగల శివుడు ఎడమ కాలు అపస్మారపురుషుని తాకుతున్నట్లు, కుడి కాలు శిరస్సు వరకు ఎత్తినట్లు చూపాలి కుడిచేతులు నాలుగింటిలో ఒకటి అభయ ముద్రలో ఉండగా మూడింట శూలం, పాశం, ఢమరుకం చూపాలి. నాలుగు ఎడమ చేతులలోఒకటి గజహస్తం లోను, వేరొకటి విస్మయహస్తంలోను ఉండగా మిగిలిన రెండింటి కపాలం, అగ్ని పాత్ర చూపాలి

**4:7:4:8:** ఇదే నృత్య విశేషంలో శివుడికి ఆరు చేతులు చూపినట్లయితే ఎనిమిదవ నృత్యవిశేషం ఉంటుంది. ఈ మూర్తిలో పాశం, అగ్ని, కుడి, ఎడమ చేతులలో ఉండవు.

**4:7:4:9:** తొమ్మిదవ నృత్య విశేషంలో మూడు కన్నులు, శిరస్సుపై జటామకుటం, నాలుగు

చేతులు ఉంటాయి. కుడిచేతులలో ఒకటి అభయముద్రలో ఉండగా, ఇంకొకటి ఢమరుకాన్ని కలిగి ఉంటుంది. అదే విధంగా ఎడమ చేతులలో ఒకటి గజహస్తంగా ఉండగా, ఇంకొకటి అగ్నిని కలిగి ఉంటుంది. ఎడమ కాలు అపస్మారపురుషునిపై గాక పీఠంపై ఉంచాలి కుడికాలి బొటని వేలు కూడా ఆ పీఠంపై ఆనినట్లు చూపాలి ఈ రకమైన మూర్తిని తిరుచ్చెంగాట్టంగుడిలో చూడగలం.

**4:7:4:9:1:** ఈ తొమ్మిది ప్రధానమైన నృత్యవిశేషాలు కాక, కటిసమనృత్యం, లలిత నృత్యం కూడా పేరొందిన నటరాజమూర్తి రూపవైవిధ్యాన్ని సూచిస్తున్నాయి

**4:7:4:10: కటిసమమూర్తి:**

నాట్యశాస్త్రం ప్రకారం కటి సమనృత్యంలో పాదాలు 'స్వస్తికాపశ్యతము' అనే భంగిమలో ఉండాలి. పాదాలను ఒకదానికొకటి తాకకుండా స్వస్తికవలె ఉంచడాన్ని స్వస్తికాపశ్యతం అంటారు. చేతులలో ఒకటి నాభివద్ద, వేరొకటి కటి ప్రాంతంలో నుంచి, కటిభాగాన్ని ఉద్వాహితరూపంలో ఉంచాలి. అభినవగుప్తుని నాట్యవేదవివృత్తి ప్రకారం నాభివద్ద గల చేతిని కటిముద్రలోను, వేరొక చేతిని అర్ధచంద్రాకృతిలోను చూపాలి. ఉద్వాహితరూపం అంటే ఒక భాగాన్ని ఎత్తి, ఇంకొక భాగాన్ని సమనిష్పత్తిలో కిందిగా చూపాలి ఈ రకమైన భంగాన్ని వైష్ణవ స్థానం అని అభినవ గుప్తుడు పేర్కొన్నాడు దాని ప్రకారం ఒక కాలిమీద స్థిరంగా నిలబడి, వేరొక కాలిని 2 1/2 అంగుళాల దూరంలో కొంచెం వక్రంగా ఉంచాలి

**4:7:4:11: 4:7:4:11:1**

**లలిత మూర్తి:** లలితనృత్యం అంటే ఎడమ చేతిని గజహస్తంలోను, కుడిచేతిని ప్రవర్తితముద్రలోను ఉంచడం ఈ లలితానృత్యాన్నే కుట్టితం అని కూడా అంటారు. ఒక కాలు భూమి మీద స్థిరంగా ఉండగా, ఇంకొక పాదం బొటన వేలితో నేలను తాకుతూ మడమను వంచి వెనక నుండి నేలను తాకడం, ఈ ప్రక్రియను 'నికుట్టితం' అంటారు

**4:7:4:11:1:** ఈ రకమైన మూర్తులన్నీ శివుని పంచక్రియాభావాలను అభివ్యక్తం చేస్తు, సృష్టి, స్థితి, లయ, అనుగ్రహాలు కుప్ప పోసిన రూపంగా శివుని, పార్వతిని తీర్చి దిద్దుతున్నాయి.

**4:7:5: ఉమాసహితమూర్తులు:**

శివుని, పార్వతిని కలబోసి చిత్రకరించిన, శిల్పీకరించిన మూర్తులను ఉమాసహితమూర్తులని, ఆ విధంగా కాక కేవలం శివునికి మాత్రమే ప్రాముఖ్యత నిచ్చినవి కేవలమూర్తులని అంటారు. ఉమాసహితమూర్తులలో ఉమాసహిత చంద్రశేఖరమూర్తి, ఆంలిగన చంద్రశేఖరమూర్తి, సోమస్కంద మూర్తి, సుఖాసన మూర్తి, ఉమాసహితమూర్తి, ఉమామహేశ్వరమూర్తి, గంగాధరమూర్తి, కళ్యాణ సుందరమూర్తి, వృషవాహన మూర్తి ముఖ్యమైనవి కాగా, ఇతర మూర్తులలో కేవలం చంద్రశేఖర మూర్తి, దక్షిణామూర్తి, కంకాళమూర్తి, భిక్షాటన మూర్తి, అర్ధనారీశ్వరమూర్తి, హర్యర్థమూర్తి, విషాపహరణమూర్తి, ముఖ్యమైనవి. ఈ పదహారు రూపాలను గూర్చి ఈ క్రింది విధంగా తెలిసికోవచ్చు

**4:7:5:1: ఉమాసహితచంద్రశేఖర మూర్తి:**

అంశుమద్భేదాగమం ప్రకారం ఈ మూర్తిలో ఒకే పీఠం మీదగాని పక్కన గాని చంద్రశేఖరమూర్తి

దేవితో కలిసి సమభంగంలో ఉంటాడు నాలుగు చేతులుంటాయి కుడిచేతులలో ఒకటి టంకాన్ని ధరించగా వేరొకటి అభయముద్రలో ఉంటుంది ఎడమ చేతులలో ఒకటి కృష్ణమృగాన్ని ధరించగా, వేరొకటి వరద ముద్రలో ఉంటుంది అర్ధచంద్ర, జటామకుటాలంకరణ కలిగి త్రినేత్రుడై పీతాంబర ధారియైన యీ శివుని మూర్తిని ఉమాసహిత చంద్రశేఖర మూర్తి అంటారు. ఉత్తర కామికాగమం ప్రకారం ఒక కుడి చేయి 'సింహకర్ణంలోగాని,' కటకహస్తంలోగాని కట్యవలంచిత ముద్రలోగాని ఉండాలి కర్తరీహస్తంలో ఉన్న వెనుక రెండు చేతులలో ఒకటి హిక్కాసూత్రం దాటి, అంటే భుజాలను దాటి, పైకి పోరాదు శివుని ఎడమ చెవి రత్నకుండలంగాని, శంఖపత్రంగాని, పద్మపత్రంగాని కలిగి ఉండగా కుడి చెవి మకరకుండలంగాని, సింహకుండలంగాని, పత్రకుండలంగాని, కలిగి ఉండాలి ఈ మూర్తి అనేక ముక్తాహారాలను, రత్నహారాలను, పదకాలను, యజ్ఞోపవీతం, ఛన్నవీరం, ఉదరబంధనం, కేయూరాలు, కటకాలు కలిగి పద్మపీఠం మీద నిలబడి ఉండాలి తిరువోరియూర్, మాయవరం వంటి ప్రాంతాలలో ఈ మూర్తిని చూడవచ్చు

### 4:7:5:2: ఆలింగన చంద్రశేఖరమూర్తి:

ఎడమ చేతిలో దేవిని కౌగిలించుకొన్నట్లు చంద్రశేఖర మూర్తిని చూపాలి ఆ ఎడమ చేయి ఆమె వక్షస్థలం కిందికి ఉన్నట్లు చూపాలి దేవీమూర్తి కుడిచేతిలో ఎర్రని పద్మం ఉండాలి. ఆమె కుడిచేతిని శివుని కౌగిలించుకొన్నట్లు కూడా చూపవచ్చు అప్పుడు ఆమె ఎడమ చేతిలో పద్మం ఉండాలి పరస్పరం కౌగిలించుకొన్నట్లు కూడా చూపవచ్చు ఈ విధంగా ఆలింగన చంద్రశేఖర మూర్తి ప్రతిమలు మూడు రకాలు

### 4:7:5:3:సోమస్కందమూర్తి:

ఇది సుఖాసమూర్తికి దగ్గరైన ప్రతిమ సుఖాసన మూర్తికి సమీపంలో ఎడమ వైపున రెండు చేతులు గల దేవి ఉండాలి దేవి కుడిచేతిలో పద్మం ఉండగా, ఎడమ చేయి సింహకర్ణముద్రలో ఉంటుంది. ఆమె శిరస్సు కరండమకుటాలంకరణ కలిగి ఉండాలి. ఆమె ఎడమ కాలు వేలాడుతుండగా కుడికాలు భద్రపీఠంపై ఉండాలి. పార్వతీ పరమేశ్వరుల మధ్య బాలుడైన స్కందుని స్థానక రూపంలోగాని, తల్లి తొడ మీద ఉన్నట్లుగాని, నృత్యమూరిగా గాని చూపాలి. ఆ స్కందమూర్తి ఒకే ముఖాన్ని కరండమకుటంతో కలిగి ఉండాలి చెవులకు నక్రకుండలాలు, శరీరంపై ఛన్నవీర ఉండాలి స్కందుని కుడిచేతి పద్మం ఉండాలి. స్కందుని ప్రతిమ శివుని ప్రతిమలో 1/10 నుండి 4/10 వరకు ఉండాలి

### 4:7:5:4: సుఖాసన మూర్తి :

శిల్పరత్నం మిగిలిన ఇతర శాస్త్ర గ్రంథాలు సుఖాసన మూర్తి నాలుగు చేతులు, మూడు కన్నులు, పగడంలాగ ఎర్రని రజోగుణాన్ని సూచించే రంగును కలిగి ఉండాలి అని పేర్కొన్నవి. ఒక భద్రపీఠంపై ఎడమ కాలిని మడచి, కుడి కాలును వేలాడుతున్నట్లు చూపాలి. వెనుకకుడిచేతిలో పరశువు, వెనుక ఎడమ చేతిలో కృష్ణమృగం ఉండగా, ముందుకు కుడిచేయి అభయ ముద్రలోను, ముందు ఎడమ చేయి వరద లేక సింహ కర్ణముద్రలో ఉండాలి. కుడి చెవికి మకరకుండలంగాని సింహకుండలంగాని ఉండగా, ఎడమ చెవికి పత్రకుండలం ఉండాలి లేదా రెండు చెవులకి

ఉత్తకుండాలాలు (అంటే మకరం, సింహం, పత్రం వంటి నమూనాలు లేనివి) ఉండాలి. జటామకుటం, కంకణాలు, యజ్ఞోపవీతం ఉండాలి 'పూర్వకారణాగమం ప్రకారం ఎడమ కాలు వేలాడుతుండగా కుడికాలు భద్రపీఠంపై ఉండాలి

**4:7:5:5: ఉమాసహితమూర్తి :**

సోమస్కందమూర్తిలో స్కందుడు లేకుండ ఉన్నట్లయితే ఉమాసహితమూర్తి, శివుడికి ఎడమ వైపున గల దేవిని రెండు చేతులతో, కుడిచేత పద్మాన్ని ధరించి, ఎడమ చేతిని సింహకర్మ ముద్రలోగాని లేదా ఆసనంపై ఉన్నట్లుగాని, చూపాలి ఆమె శిరస్సుపై కరండమకుటం ఉండాలి ఆమె కుడికాలు మడచి ఆసనం మీద ఉండగా, ఎడమ కాలు వేలాడుతుండాలి 'శిల్పరత్నం' ప్రకారం దేవి కుడి చేత ఉత్పల పుష్పాన్ని ధరించి, ఎడమ చేతిని వరద ముద్రలో ఉంచడంగాని, దానిని పీఠంమీద కొంచెం పక్కన ఉంచి ఉన్నట్లుగాని చూపబడాలి. ఆమె ఆకుపచ్చని రంగులో ఉండాలి ఆమెహారాలను, మకుటాన్ని కలిగి ఎర్రని పట్టువస్త్రాలలో ఉండాలి పూర్వకారణాగమం ప్రకారం ఈ దేవీమూర్తి శివుని భుజాల ఎత్తు వరకూ ఉండాలి శివపార్వతులు ఒకే ఆసనం పై ఒకే ప్రభామండలాన్ని కలిగి ఉండాలి.

**4:7:5:6: ఉమామహేశ్వరమూర్తి:**

'విష్ణుధర్మోత్తర పురాణం ప్రకారం శివుడు, ఉమ ఒకే పీఠంపై ఉండి ఆలింగ న మూర్తులలాగా ఉండాలి. శివుడు అర్ధచంద్రాలంకృతుడుగా జటామకుటాన్ని కలిగి ఉండాలి. రెండు చేతులుగల శివుడు కుడిచేత నీలోత్పలాన్ని ధరించి ఎడమ చేతిని ఉమాదేవి ఎడమ భుజంపై ఉంచాలి. సౌందర్యంతో కూడిన ఉమాదేవి తన కుడిచేతిని శివుడి భుజంపై ఉంచి, ఎడమ చేత ఒక అద్దాన్ని ధరించి ఉండాలి కాని రూపమండనం ప్రకారం శివుడు నాలుగు చేతులు కలిగి ఉంటాడు రెండు కుడిచేతులలో ఒక దానిలో త్రిశూలాన్ని, ఇంకొకదానిలో మాతులుంగ పుష్పాన్ని ఉంచుకొని, రెండు ఎడమ చేతులలో ఒకదానిలో సర్పాన్ని కలిగి, ఇంకొక చేతిని ఉమాదేవి భుజంపై ఉంచాలి. శివుడు పగడంలాగ ఎర్రనిరంగులోను, దేవి విష్ణుధర్మోత్తరంలో చెప్పబడినట్లు ఉండాలి. వృషభ,గణేశ, కుమారులు, భృంగి కూడా చూపాలి

**4:7:5:7: గంగాధరమూర్తి:**

**4:7:5:7:1:** విష్ణుపురాణం', 'భాగవత పురాణం, రామాయణం సూర్యవంశప్రభువుల చరిత్రను తెల్పుతూ శివుడు గంగాధరమూర్తిగా ఏర్పడిన రీతిని వివరించాయి సూర్యవంశానికి చెందిన సగరుడు అనే ప్రభువు అశ్వమేధయాగం చేసేటప్పుడు ఇంద్రుడు అతని గుర్రాన్ని అపహరించి, పాతాళలోకంలో తపోదీక్షలో ఉన్న కపిల మహర్షివద్ద దాస్తాడు. ఆ గుర్రాన్ని వెనుకంటి వెళ్ళిన సగరుని కుమారులయిన అసమంజసుడు, అతని అరవై వేలమంది సోదరులు కపిలుని తపోగ్నికి భస్మమౌతారు వారిని వెతుకుతూ అసమంజసునికుమారుడైన అంశుమంతుడు కపిలుని చేరి ఆ మహర్షి అనుగ్రహం వల్ల తిరిగి యజ్ఞాశ్వాన్ని పొంది తన తాతగారి యజ్ఞాన్నిపూర్తి చేయిస్తాడు. తపోగ్నికి భస్మమైన తన తండ్రి, పినతండ్రుల భస్మరాసులపై గంగా నది పారితే కాని వారికి ముక్తిరాదని, ఆ కార్యక్రమం అంశుమంతుని మనవని కాలంలో జరగ గలదని తెలుసుకుంటాడు.

అంశుమంతుని కుమారుడు దిలీపుడు, మనవడు భగీరథుడు భగీరథుడు గంగా నదిని ప్రత్యక్షం చేసికోవడానికి తపస్సు చేసి, ఆమె మాటపై గంగ బరువును భరించడానికి శివునికోసం తిరిగి తపస్సు చేసి శివుడు గంగను భరించడానికి అంగీకారం పొందుతాడు. కాని గంగానది అహంభావంతో శివునిపై దూకా శివును గంగను తన జటాజూటంలో భంధిస్తాడు. కాని తిరిగ భగీరథుడు శివుని ప్రసన్నం చేసుకోగా గంగానదిని తన జటాజూటం నుండి వెలువరిస్తాడు. భగీరదునిచేత దివినుంచి భువికి దించబడిన దవడం వల్ల గంగానదికి భాగీరధి అనే పేరువచ్చింది

**4:7:5:7:2:** అంశుమద్భేదాగం, కామికాగమం, కారణాగమం, గంగాధర మూర్తి ప్రతిమను వర్ణించగా ఎల్లోరా, ఎలిఫెంటా, తిరుచినాపల్లి మొదలైన చోట్ల దాన్ని శిల్పీకరించారు.

**4:7:5:7:3:** ఈ మూర్తిలో శివుడు తన కుడికాలు సరిగా నిల్పి, ఎడమ కాలును కొంచెం వంచి ఉండాలి ఎడమ చేతితో ఉమాదేవిని కౌగిలించుకుంటూ, కుడిచేతిని ఉమాదేవి గడ్డంవద్ద ఉంచాలి. వెనుక గల కుడిచేతిని ఉష్ణీషం వరకు ఎత్తాలి ఆ చేతిలో ఒక జటను పట్టుకొన్నట్లు చూపాలి ఆ జటామండలంపై గంగాదేవి ముఖాన్ని చూపాలి వెనుకగల ఎడమ చేయి కృష్ణమృగాన్ని కలిగి ఉండాలి ఎడమ వైపున ఉన్న ఉమాదేవి ముఖంలో ఉద్విగ్నత కనిపించాలి. ఆమె కుడిచేతిని వేలాడినట్లుంచి, ఎడమ వైపున చేత పూవును ధరించి ఉండాలి ఈ ప్రతిమకు ఎడమ వైపున ఋషిపరివేష్టితుడైన భగీరదుడు ఉండాలి కేవలం శివుని మూర్తిని గంగా విసర్జన మూర్తి అని మొత్తం శిల్పాలను కలిపి గంగాధర మూర్తి అని అంటారు.

**4:7:5:7:4:** కామికాగమం, కారణాగమాలలో ఈ మూర్తి నాలుగు చేతులను మూడు కన్నులను కలిగి ఉంటాడని,చేతులలో కుడి చేతులు పరశువును ధరించి, అభయాన్ని ఇవ్వగా, ఎడమ చేతులు మృగాన్ని ధరించి, కటక ముద్రలో ఉంటాయి భగీరథుని ఎత్తు శివుని నాభివరకుగాని, వక్షస్థలం వరకు గాని, కంఠం వరకు గాని అష్టతాళమానంలో రూపొందించాలి.

### 4:7:5:8: కళ్యాణసుందరమూర్తి:

**4:7:5:8:1:** రమణీయమైన ఉమాసంగీత మూర్తులలో కళ్యాణ సుందరమూర్తి ఉత్కృష్టమైనది 'వరాహపురాణంలో శివపార్వతుల సంవాదం, శివుడు వృద్ధ బ్రాహ్మణ రూపంలో జరిపినది. వివరించబడింది. తారకాసురవధకు శివపార్వతుల సంతానం అర్థమయిందవడం వల్ల శివుని తపోదీక్షకు భంగం కలిగించడానికి మన్మధుణ్ణి వినియోగించగా, మన్మధుడు శివుని తపోగ్నికి భస్మమవుతాడు. కాని శివుడు పార్వతిపట్ల అనురాగాన్ని పెంచుకొని తపస్సులో ఉన్న పార్వతి దగ్గరకి వృద్ధ బ్రాహ్మణుని వేషంలో వెళ్ళి శివుని దూషిస్తాడు కాని పార్వతి శివుని ఔన్నత్యాన్ని పొగిడి, శివుని పట్ల తన అనురాగాన్ని, శివుణ్ణి వివాహం చేసుకోవడం పట్ల గల స్థిరమైన నిర్ణయాన్ని అభివ్యక్తం చేస్తుంది. ఆ తరవాత వారి వివాహం జరుగుతుంది

**4:7:5:8:2:** ఈ ప్రతిమలో తూర్పు ముఖంగా నిలబడి ఉన్న శివ, పార్వతులు కేంద్రప్రాయంగా ఉంటారు లక్ష్మి, భూమితో కలిసి విష్ణువు, శ్వశురుడుగా (వమాగా) ఉంటాడు లక్ష్మి , భూమి వధువు వెనక నిలబడి ఉండాలి. శివపార్వతుల మధ్య కలశం ఏర్పరచబడి ఉండాలి వధూవరులకు ముందుగా యజ్ఞాన్ని నిర్వహిస్తున్న బ్రహ్మ, నేపథ్యంలో విద్యేశ్వరులు, అష్టదిక్పాలకులు,సిద్ధులు,

యక్షులు, రుషులు, గంధర్వులు, మాతృకలు అంజలి ముద్రలో ఆనందోత్సాహంలో నిలబడి ఉంటారు.

**4:7:5:8:3:** శివుడిని ఎడమ కాలిని స్థిరంగా ఉంచి, కుడి కాలు కొంచెం ముందుకు వంచి నిలబడినట్లు చూపాలి. నాలుగు చేతులు గల ఈ మూర్తి కి ముందు గల కుడిచేయి పార్వతిని పాణిని గ్రహిస్తుండగా, ముందుగల ఎడమ చేయి వరదముద్రలో ఉండాలి వెనుక ఉన్న కుడి చేయి పరశువును, వెనుక ఉన్న ఎడమ చేయి మృగాన్ని ధరించాలి శివుని శరీరం త్రిభంగిమలో చూపాలి. శివుని శిరస్సుపై అర్ధచంద్రాలంకృతమైన జటాజూటం ఉండగా, హారాలు, కేయూరాలు ఉదరబంధం, సర్పకుండలాలు, అతని శరీరాన్ని అలంకరించాలి. ఈ శరీరం రంగు ఎర్రనిది. కాగా పార్వతీదేవిని నల్లని రంగుతో, కుడిచేతిని ముందుకు చాచి శివుని పాణని గ్రహిస్తున్నట్లు చూపాలి ఆమె ఎడమ చేత నల్లని ఉత్పలాన్ని ధరించి ఉండాలి ఆమె మోములో లజ్జ, ఆనందం చోటుచేసుకోవాలి. బ్రహ్మ ఎత్తు శివుని వక్షస్థలం వరకు ఉండాలి బ్రహ్మను పద్మాసనంలో ఉత్తరా భిముఖంగా చూపాలి బ్రహ్మజటామకుటాన్ని, యజ్ఞోపవీతాన్ని, నాలుగు చేతులను కలిగి ఉండాలి ముందుగల కుడి, ఎడమచేతులలో స్రుక్, స్రువములు ఉండగా, వెనుక గల చేతులు అక్షమాలను, కమండలువును ధరించి ఉండాలి. బ్రహ్మ శరీరం అగ్నిలాగా ఎర్రగా ఉండాలి.

**4:7:5:8:4:** హెూమకుండం 22x12 అంగుళాలలో మూడు మేఖలలుగా ఉండాలి.

**4:7:5:8:5:** హెూమకుండానికి ఉత్తర దిక్కున విష్ణువు శివుని వక్షం వరకు గాని,భుజాలవరకుగాని, నాసిక వరకుగాని వచ్చేటట్లుండాలి. తొలిది అధమమని, చిట్టచివరది ఉత్తమమని అంటారు విష్ణువు కిరీట మకుటాన్ని నాలుగు చేతులను కలిగి ఉండాలి వెనుక గల కుడి, ఎడమ చేతులలో చక్రం, శంఖం ఉండగా, ముందుకు గల చేతులు స్వర్ణపాత్రను ధరించి ఉండాలి. విష్ణువు కృష్ణవర్ణంలో ఉండాలి. కాగా, లక్ష్మీదేవి పీతాంబర ధారిణియై, కేయూరాలు,కంకణాలు వంటి అన్ని ఆభరణాలు ధరించి ఉండాలి.

**4:7:5:8:6:** ఈ రకమైన కళ్యాణసుందరమూర్తి తిరువారియూర్ రత్నపూర్, ఎలిఫెంటా, ఎల్లోరా, లేపాక్షి మొదలైన చోట్ల చెక్కబడి ఉంది.

### 4:7:5:9: వృషవాహనమూర్తి:

**4:7:5:9:1:** ఈ మూర్తినే వృషభారూఢమూర్తి అని కూడా అంటారు. వేదారణ్యం, తారమంగళం, మహాబలిపురం, మధురై, హలేబేడు మొదలయిన చోట్ల వృషభారూఢ మూర్తిని చూడగలం. ఈ మూర్తి కుడికాలు భూమిపై స్థిరంగా ఉంచి, ఎడమ కాలును కొంచెం వంచి ఉంచాలి. వెనుక గల కుడి చేతిలో టంకం కాని, పరశువుకాని ఉండగా, వెనుక గల ఎడమ చేతిలో కృష్ణమృగం ఉండాలి. కాగా, ముందుగల కుడి చేతిలో వక్రదండాయుధం ఉండగా, ఎడమ ముంజేయి కొంచెం వంచి ఆ చేతిలో ఆ చేతి మణికట్టు వృషభం తలచుట్టు ఉన్నట్లు చూపాలి శిరస్సు మీద వేలాడు తున్న జటాభారం గల జటామకుటం ఉండాలి. ఈ మూర్తికి కుడివైపున గాని ఎడమ వైపున గాని దేవీ ప్రతిమ ఉండాలి. ఆమె కుడికాలు భుమిమీద స్థిరంగా ఉంచి, ఎడమ కాలిని కొంచెం వంచినట్లు ఉంచాలి. కుడిచేతనీలోత్పలం ఉండగా, ఎడమ చేతిని స్వేచ్ఛగా వదిలివేయాలి. వృషభం శివుని

వెనుక నిలబడినట్లు చూపాలి.

### 4:7:6: ఇతరమూర్తులు

### 4:7:6:1: కేవలం చంద్రశేఖరమూర్తి:

**4:7:6:1:1:** 'అంశుమద్భేదాగమం' ప్రకారం కేవలం చంద్రశేఖర మూర్తి సమభాగంలో జటామకుటం కలిగి, పీతాంబరధారియై సర్వాభరణ భూషితుడై నాలుగు చేతులతో ఉండాలి వీనిలో కుడిచేతులలో ఒకటి టంకం ధరించగా మరొక్కటి అభయముద్రలో ఉండాలి. ఎడమ చేతులలో ఒకటి వరదముద్రలో ఉండగా, వేరొకటి కృష్ణమృగాన్ని ధరించి ఉండాలి సమభంగంలో గల ఈ మూర్తి రజోగుణ శోభితమైనది చేతలు కర్తరీ ముద్రలో ఉండగా టంకం, మృగం ఉండాలి జటామకుటంలో ఎడమ వైపుగాని కుడివైపుగాని అర్ధచంద్రుడుండాలి ఈ మూర్తి రంగులు ఎర్రగా ఎండాలి

**4:7:6:1:2:** కాని, ఉత్తర కామికాగమం ప్రకారం ముందు గల కుడి చేయి సింహకర్ణముద్ర లోగాని కటకముద్రలోగాని కట్యవలంబితంగా ఉండాలి ఈ మూర్తి ఎడమ చెవికి రత్నకుండలంగాని, సింహకుండలంగాని, పత్రకుండలంగాని ఉండాలి. ఉమాసహిత చంద్రశేఖరమూర్తి లో ఉమలేనిచో కేవలం చంద్రశేఖర మూర్తి అని తెలియాలి ఈ మూర్తి పద్మపీఠంపై ఉండాలి

### 4:7:6:2: దక్షిణామూర్తి:

**4:7:6:2:1:** రుద్రాధ్యాయంలో ఉపవీతి వస్త్రయజ్ఞోపవీతి, ఉష్ణీషి అని వర్ణితమైన మూర్తి దక్షిణామూర్తి. జ్ఞాన దక్షిణామూర్తి, యోగదక్షిణామూర్తి, వీణాధర దక్షిణామూర్తి అనే రూపాలు ధక్షిణామూర్తికి కలవు. దేవఘర, అవూర్, తిరువొరియూర్, శుచీంద్రం, కావేరీ పాక్క తిరువెంగవాశల్, కాంచీపురం, నంజన్, గూడు వంటి ప్రాంతాలలో దక్షిణామూర్తి ప్రతిమలను చూడగలం.

**4:7:6:2:2:** అతిప్రాచుర్యంలో ఉన్న దక్షిణామూర్తి రూపాన్ని వ్యాఖ్యాన దక్షిణామూర్తి అంటారు. తెల్లని పద్మంపై వ్యాఘ్రాజినాన్ని ధరించి వీరాసనంలోఉండి, ఎడమకాలిని అపస్మారపురుషుని పై ఉంచి, మూడు కన్నులు, నాలుగు చేతులు గల ఈ మూర్తి సర్వశాస్త్ర వ్యాఖ్యాత అయిన వ్యాఖన దక్షిణా మూర్తి. దీనిలో, ముందు కుడి చేయి జ్ఞానముద్రలోగాని, సుదర్శనముద్రలో గాని ఉండగా, ముందు ఎడమ చేయి వరదముద్రలోగాని, దండహస్తంగాగాని ఉండాలి ఎడమ మోచేయి ఎడమ మోకాలి మీద ఉండాలి వెనుక కల కుడిచేయి అక్షమాలను ధరించగా, వెనుక గల ఎడమ చేయి అగ్నిని గాని, సర్పాన్ని గాని ధరించి ఉండాలి శిరస్సుపై గల జటాభారంగాని, జటామకుటం గాని పట్టబంధంవలె ఉండివానిపై దుర్ధురాపుష్పాలు ఉండాలి ఈ మూర్తి స్ఫటికాన్ని పోలే తెల్ల రంగును కలిగి ఉండగా, తెలుపు, ఎరుపు, పసుపు పచ్చలేదా నల్లని రంగులను కూడా దక్షిణామూర్తి కి ఆపాదించారు. ఇతడు యజ్ఞోపవీతాన్ని ధరించి ఉంటాడు ఇతని ఎడమ చెవికి శంఖపత్రం, కుడి చెవికి కరండలంగాని లేదా రెండు చెవులకు శంఖ పత్రాలు లేదా కుండలాలు ఉంటాయి. ఇతడు రుద్రాక్షమాల కూడా కలిగి ఉంటాడు. దక్షిణామూర్తిని పరివేష్టించి అనేక మంది రుషులుండాలి. అంశుమద్భేదాగం ప్రకారం వారు నారదుడు, జమదగ్ని, వశిష్ఠ, భృగువు, భరద్వాజుడు, సనకుడు, అగస్త్యుడు,కాని 'కామికాగమం కౌశికుడు అత్రి, గౌతములను కారణాగమం అగస్త్యుడు పులస్త్యుడు విశ్వామిత్రుడు, అంగీరసులను పేర్కొన్నవి. ఆ ఋషులందరూ భస్మలిప్తాంగులై దక్షిణామూర్తి

వక్షం వరకు ఉంటారు.

**4:7:6:2:3:** జ్ఞాన దక్షిణామూర్తి కూడా అతిస్వల్పమైన మార్పులతో వ్యాఖ్యాన దక్షిణామూర్తి వలె ఉంటాడు ఈ మూర్తిలో వెనక కుడిచేత అక్షమాల, వెనక ఎడమ చేతిలో ఉత్పలం ఉండగా ముందుగల కుడిచేయి జ్ఞానముద్రలోను, ముందుగల ఎడమ చేయి అభయ ముద్రలోగాని, దండహస్తంగా గాని ఉంటాయి.

**4:7:6:2:4:** యోగదక్షిణామూర్తిని మూడు రకాలుగా తీర్చిదిద్దవచ్చు ఒక భంగిమలో కాళ్ళను స్వస్తికాసనంలో ఉంచి ముందుగల కుడిచేయి వక్షస్థలానికి సమీపంలో యోగముద్రలో ఉండగా ముందుగల ఎడమ చేయి యోగిత్వాన్ని సూచించాలి. కాగా, వెనుక కుడి చేయి అక్షమాలను, వెనుక ఎడమ చేయి పద్మాన్ని ధరించి ఉండాలి రెండవ భంగిమలో ఈ మూర్తిని ఉత్కుటికాసనంలో ఎడమ కాలికి యోగ పట్టతోను కుడి కాలు వేలాడుతున్నట్లు చూపాలి. మూడవ భంగిమలో రెండు కాళ్ళను ఉత్కుటికాసనంలో ఉంచి యోగపట్టాను సూచించాలి ముందుగల ముంజేతులను మోకాళ్లమీద ఆన్చి, వెనుక గల కుడిచేతి అక్షమాలను, వెనుక గల ఎడమ చేత కమండలవును ధరించినట్లు చూపాలి. ఈ మూర్తిని తెల్లగాను,కంఠభాగంనల్లగాను, సర్వాభరణ భూషితుడై ఋషి పరివేష్టితుడై చూపాలి రుద్రాక్షలు, యజ్ఞోపవీతం, కేయూరాలు మొదలైనవి అలంకారాలు కొన్ని

**4:7:6:2:5:** 'వీణాధర దక్షిణామూర్తి' శివుని సంగీతజ్ఞానిగా 'కామికాగమం', 'అంశుమద్భేదాగమం', 'కారణాగమం' మొదలైన గ్రంథాలు పేర్కొంటాయి. అంశుమద్భేదాగం ప్రకారం ఈ మూర్తి ఎడమ కాలు ఉత్కుటి కాసనంలో ఉండి ముందుగల రెండు చేతులు వీణను ధరించి ఉండాలి మిగిలిన చేతులు వ్యాఖ్యాన మూర్తిలో వలె అక్షమాలను, సర్పాన్ని కాని, అక్షమాలను, ఉత్పలాన్ని కాని ధరించి ఉండాలి. కాని 'కామికాగమం' ప్రకారం 'గానదక్షిణామూర్తి' అనబడే ఈ మూర్తికి ముందుగల కుడి, ఎడమ చేతులు కటకముద్రలో ఉండి కుడి అరచేతిని కిందకు, ఎడమ అరచేతిని పైకి సర్పాకారంలోవలె చూపాలి ఆ చేతులలో ఒక వీణను ధరించడానికి అనువుగా ఉండాలి. కుడిచేతిలో వీణ కింది భాగం, ఎడమ చేతిలో పై భాగం ఉండాలి. కిందగల కుడి చేయితంత్రీ నిస్వరానికి అనుగుణంగా ఉన్నట్లు చూపాలి ఈ వీణ కుడితొడకు మూడు అంగుళాలు వెనుకగా, ఎడమ చేతికి నాలుగు అంగుళాల పైన ఉండాలి ఈ మూర్తి ముఖం సుదర్శనముద్రలో గల చేతివైపు చూస్తున్నట్లుండాలి ఇతడు సర్వరుషి, మానవ, జంతుగణ పరివేష్టితుడై ఉండాలి. దక్షిణా మూర్తిలోనే 'అగియాయ', 'ప్రధమాయ,' 'జ్యేష్ఠాయ,' మొదలైన శివస్వరూపాన్ని చూడగలం

**4:7:6:3: కంకాళమూర్తి:**

**4:7:6:3:1:** 'నమఃపశుపతయే అని అభివర్ణితమైన రుద్రుని భావాన్ని మనం కంకాళమూర్తిలో చూడగలం 'అంశుమద్భేదాగం', 'కామికాగమం', కారణాగమం, శిల్పరత్నమొదలైనవి ఈ మూర్తిని వర్ణించాయి ధారాసురం, తెంకాశి, శుచీంద్రం, కుంబకోణం, తిరుచ్చెంగట్టుంగుడి మొదలైన చోట్ల కంకాళమూర్తి ఉదాహరణలు లభించాయి. ఈ మూర్తి ఎడమ కాలు స్థిరంగా ఉంచి కుడికాలు

చలన స్వభావాన్ని సూచిస్తున్నట్లు కొంచెం ముందుకు వంగి ఉండాలి. తెల్లని ఈ మూర్తి ఎర్రని ఉపవస్త్రాన్ని వ్యాఘ్రాజినాన్ని దుర్ధ క పుష్పాలు, అర్ధచంద్రునితో కూడిన జటామకుటాన్ని కలిగి ఉండాలి ఇతని మోములో సచ్చిదానంద స్వభావం అభివ్యక్తం కావాలి ఎడమ చెవికి శంఖపత్రం, కుడిచెవికి కుండలం, యజ్ఞోపవీతం ఉండి, నాలుగు చేతులు ఉండాలి ముందుగల కుడిచేతిలో బాణం, ఎడమ చేత ఢక్కా (ఢమరుకం) ఉండాలి వెనుక గల కుడి చేయి ముందుకు చాపబడి కటకముద్రలో ఉండాలి. వెనుక గల ఎడమ చేయి కంకాళదండాన్ని కలిగి ఉండాలి. ఇతడు పాదరక్షలపై, సర్పాలంకృతుడై, నడుముల దగ్గర వెండి పిడి గల బంగారు ఛురికను కలిగి ఉండాలి. ఈ మూర్తి వివిధ స్త్రీ భూత గణ పరివేష్టితుడై ఉండాలి. ఆ స్త్రీలు శివుని పట్ల అంతులేని రాగాన్ని కలిగి ఉండాలి వారితో బాటు రుషులు, దేవతలు, గంధర్వులు, సిద్ధులు, విధ్యాధరులు అంజలి ముద్రలో ఈ మూర్తిని కొలవాలి వాయువు వీథులను ఊడ్చగా వరుణుడు నీటిని చల్లగా, రుషులు వేదోచ్చాటన చేయగా, సూర్యచంద్రులు వింజామరలు వీయగా నారదతుంబురులు గీతాలాపన సల్పాలి బ్రహ్మ శిరచ్ఛేద క మూర్తిలోని ఒక విపరిణామమే కంకాళమూర్తి

### 4:7:6:4: భిక్షాటన మూర్తి:

**4:5:6:4:1:** 'శతరుద్రీయంలో అన్నానాంపతయే' అని అభివర్ణితమైన రుద్రునికి ఈ మూర్తి ప్రతిమారూపం కాగా, కంకాళ మూర్తి విపరిణామమే భిక్షాటన మూర్తి. ఈ స్వరూపాన్ని కాంచీపురం తిరుచ్చెంగట్టుంగుడి, కుంభకోణం, తిరువెంకాడు, దళువూరు, పందణనల్లూరు మొదలైన చోట్ల గల ఉదాహరణల్లో చూడగలం. ఈ మూర్తి ఇంచుమించు కంకాళమూర్తిలో వలెనే ఉంటుంది. కాని ముందుగల ఎడమ చేయి కపాలాన్ని, వెనుక గల కుడిచేయి ఢమరుకాన్ని కలిగి ఉంటాయి.. జటామండలం, ఫాలపట్టం ఉన్న ఈ మూర్తి యజ్ఞోపవీతాన్ని, నుదుట త్రిపుండ్రాలను కల నగ్నమూర్తి. ఇతనికి కాళదండం బదులు శూలం ఉంటుంది. పాదాలకు పాదరక్షలు ఉండవచ్చు, లేకపోవచ్చు, కపాలం ధరించిన చేయి నాభివరకుఉండగా, ఢమరుకాన్ని ధరించిన చేయి చెవి వరకు ఉండాలి

### 4:7:6:5: అర్ధనారీశ్వరమూర్తి:

**4:7:6:5:1:** బాదామి, మధురై, మహాబలిపురం, కుంభకోణం, తిరుచ్చెంగట్టుంగుడి, శ్రీశైలం మొదలైన చోట్ల ప్రసిద్ధ అర్ధనారీశ్వర మూర్తి ఉదాహరణలను చూడగలం ఈ మూర్తిలో కుడిభాగం శివునిగాను, ఎడమభాగం పార్వతిగాను రూపించి స్త్రీపురుషులకు గల ప్రాధాన్యతను సూచించడం జరుగుతుంది అంశుమద్భేదాగం, కామికాగమం, సుప్రభేదాగమం, శిల్పరత్నకారణాగమంమొదలైన గ్రంథాలు అర్ధనారీశ్వర మూర్తిని వర్ణిస్తున్నాయి ఈ మూర్తికి కుడివైపు గల భాగంలో అర్ధచంద్రుడు కల జటామకుటం చెవికి నక్రకుండలం లేదా సర్పకుండలం ఉండగా కుడివైపు నుదట మూడవ కన్ను చూపాలి ఎడమ వైపు చెవికి కరండమకుటం, చెవికి నాళిక అనే కుండలం, నుదుట తిలకం ఉండాలి ఈ మూర్తికి రెండు లేదా మూడు లేదా నాలగు చేతులుండాలి నాలుగు చేతులుంటే కుడిచి చేతులలో ఒకటి అభయ ముద్రలో ఉండగా ఇంకొకటి పరశువును ధరించడంగాని, లేదా ఒకటి వరద ముద్రలో ఉండగా, ఇంకొకటి శూలాన్ని ధరించడంగాని, ఉండగా ఎడమ చేతులలో

ఒకటి అభయ ముద్రలో ఉండగా ఇంకొకటి నందివాహనం మీద ఉండాలి లేదా రెండు కుడి చేతులలో శూలం, లక్షమాల ఉండాలి కుడివైపు నాగయజ్ఞోపవీతం, సర్పమేఖల ఉండాలి.. ఈ మూర్తికి మూడు చేతులుంటే ఎడమ వైపు ఒక చేయి ఉండిదానిలో పుష్పం కాని, దర్పణం కాని, చిలుక కాని ఉండాలి పూర్తిగా ఎడమ వైపు స్త్రీలకు ఉచితమైన రీతిలోను, కుడివైపు మగవారికి తగిన రీతిలోను ఈ అలంకరణలు ఉండాలి

**4:7:6:6: హర్యర్ధమూర్తి:**

**4:7:6:6:2:** దీనినే హరిహరమూర్తి, అని అంటారు రుద్రాధ్యాయంలో నమఃశిపి విష్టాయ' అని చేసిన ప్రశంసకు ఈ మూర్తి సముచితమైనది బాదామి, పూనా మొదలైన చోట్ల ఈ మూర్తికి గల ఉదాహరణలు చూడగలం వామన పురాణం ప్రకారం విష్ణువుకు, శివుడికి గల అభేద ప్రతిపత్తిని లేదా ప్రకృతికి పురుషునికి గల ఏకత్వాన్ని ఈ రూపంలో చూడగలం కుడివైపు శివుని భాగంగాను, ఎడమ వైపు వైష్ణవభాగంగాను ఈ మూర్తి ఉంటుంది "నారాయణీ నాదరూపా బ్రహ్మ విష్ణుశివాత్మకా" అని అభివర్ణించబడిన శక్తి హరిహర మూర్తిలోని శైవవైష్ణవ సమైక్యతకు ప్రతీక క్రీ.శ 10-11 శతాబ్దాలలో శైవ,వైష్ణవ వైషమ్యాలు పెరిగినప్పుడు హరిహరమూర్తి ఆరాధన వ్యాప్తిలోకి వచ్చింది తిక్కన తన ఆంధ్ర మహాభారతాన్ని 'శ్రీయన గౌరీనాబరగు చెల్వకు చిత్తము పల్లవింప భద్రాయితమూర్తియై హరిహరంబగు రూపం దాల్చి విష్ణురూపాయ నమశ్శివాయ" అని కీర్తించి ఆ మూర్తికి అంకితం ఇవ్వడం హరిహర మూర్తికి గల చారిత్రక ప్రాధాన్యతకు గుర్తు. కుడివైపు గల ఈ మూర్తి యధాతథంగా అర్ధనారీశ్వరమూర్తివలెనే ఉంటుంది. ఎడమ వైపు గల ఈ మూర్తి రెండు చేతుల్లో ఒకటి చక్రం లేదా శంఖం లేదా గద ధరించగా, వేరొకటి కటకముద్రలో ఉంటుంది. ఎడమ వైపు కిరీటం, మకరకుండలం, కేయూర కంకణాలు, పీతాంబరం ఉండి ఎడమ వైపు శాంతిని,కుడివైపు రౌద్రాన్ని ఈ మూర్తి సూచిస్తుంది 'విష్ణు-ధర్మోత్తరపురాణం ప్రకారం కుడివైపు నంది, ఎడమ వైపు గరుత్మంతుడు చెక్కబడి ఉండాలి.

**4:7:6:7: విషాపహరణమూర్తి:**

**4:7:6:7:1:** "నమఃసితికంఠాయచ" అని రుద్రాధ్యాయంలో చేసిన అభివర్ణనకు ఇది ఉదాహరణ. శివుడు దేవగణాలపట్ల అనుగ్రహంతో క్షీరసాగరమధనం సందర్భంగా వెలువడిన హాలాహలాన్ని మింగి విషాపహరణ మూర్తి అవుతాడు కారణాగమంలో ఈ మూర్తి వర్ణన ఉంది నాలుగు చేతులు, జటామకుటం, మూడు కన్నులు కలవాడు ఈ మూర్తి. రెండు చేతులలో పరశువు, మృగంఉండగా, ఒక చేత విషపాత్రను దరించి ఇంకొక చేత వరదుడౌతాడు. అతని దృష్టి విషంపై లగ్నమై ఉంటుంది ఎడమ వైపు, ఉద్విగ్నతతో కూడుకొన్న, నల్లని రంగు గల పార్వతీదేవి త్రిభంగిమలో నిలబడి శివుని కౌగిలించుకొన్నట్లు ఉంటుంది. ఇంకొక వర్ణనలో ఈ మూర్తి ఉగ్రుడై , తెల్లనిరంగులో, వ్యాఘ్రాజినాన్ని ధరించి వృషభారూఢమూర్తియై ఉంటాడు. ఇతని కుడి చేతులలో ప్రతిశూలం, విషసంహితమైన గోకర్ణం ఉండగా, ఒక ఎడమ చేయి కపాలాన్ని కలిగి ఉంటుంది. ఇంకొక చేయి పార్వతిని కౌగిలించుకున్నట్లుంటుంది

**4:7:6:7:2:** ఈ రకంగా హైందవ దేవతలలో అతి ప్రసిద్ధులలో ఒకడైన శివుడు పంచకర్యాదీక్షారకుడుగా, ప్రకృతి పురుషుల సంధానంగా, అనుగ్రహ మూర్తిగా, రుద్రుడుగా వివిధాకృతులను కలిగి ఉన్నాడు.

**4:7:6:7:3:** విష్ణు శివులకు గల ఈ నేపధ్యంలో అనంతమైన ఉన్నతమైన భావమే శక్తి. ఆమె సృష్టి స్థితి లయ కారిణి విష్ణుశివుల ప్రతిమా విశ్లేషణ శక్తివి కూడా పరిశీలిస్తే గాని పూర్తి కాదు. ఆమె వీరికి మూడవ మితి (Thirddimension) వంటిది

•••

# 5.

# హైందవ ప్రతిమలు – శక్తి

5:1: ఉపోద్ఘాతం :

**5:1:1:** "యస్యాః అంగేమహేశాని సర్వతీర్థానిసన్తివై" (ఆమె శరీరమున సర్వతీర్థాలు నెలకొని ఉన్నాయి) అనే "పురశ్చరణోల్లాసంతంత్రం", "స్త్రియోదేవాఃస్త్రియః పుణ్యాః స్త్రియ ఏవవి భూషణం స్త్రీద్వేషానైవ కర్తవ్యస్తాసునిందా ప్రహారకమ్" (స్త్రీలు దేవతలు, పుణ్య మూర్తులు సమాజానికి అలంకారాలు వారల నెవ్వరినీ ఎప్పుడూ ద్వేషించరాదు నిందించరాదు, కొట్టరాదు) అనే ముండమాలాతంత్రంలోని అభిప్రాయాలు స్త్రీ శక్తికి గల ప్రాముఖ్యతను సూచిస్తున్నాయి. ఆమెనే "నారాయణీ నాదరూపా నామరూప సరస్వతీ" అనడం జరిగింది ఆమె 'నారాయణీ' అంటే, జ్ఞానం ఇస్తుంది 'నాద రూప' స్వరం రూపంగా గలది. 'నామరూప', నామ మే రూపంగా గలది 'సరస్వతి, ఆమెయే సరస్వతి ఈ అభిప్రాయాల దృష్ట్యానే, స్త్రీ శక్తికి గల ప్రాముఖ్యం అపార, మైందని తెలుస్తుంది

**5:1:2:** ఈ రకమైన స్త్రీ శక్తిని పూజించడం, స్త్రీ శక్తిని అవగాహనచేసి కోవడం, ఉపాసించడం ఇవన్నీ ఒక క్రమబద్ధమైన పరిణామాన్ని పొందాయి ఈ పరిణామం సింధు నాగరికత కాలంనుండి బీజస్థాయిలో ఉండి, రానురాను త్రివిక్రమ స్ఫూర్తిని పొంది, పురుష దేవ మూర్తులైన విష్ణువు, శివుడు, బ్రహ్మ వారి వారి దేవేరులైన లక్ష్మి పార్వతి, సరస్వతుల ప్రాముఖ్యత చే మరుగు పడ్డ స్థితికి వచ్చింది ఆ రకమైన ఆరాధనా సాంప్రదాయమే శాక్తేయాచారాలకు తోవతీసింది శాక్తేయం తాంత్రిక ప్రధానమైన మత వ్యవస్థగా మధ్యయుగంనాటికి (ఇంచుమించు క్రీ.శ. 9వ శతాబ్దం నాటికి) రూపొందింది

**5:1:3:** శక్తి మూర్తులనే దేవీమూర్తులు అని కూడా అంటారు దేవీ ప్రతిమల పరిణామానికి గల తాత్వికమైన నేపధ్యం ఏమిటి? అనేది సబబైన ప్రశ్న సింధు నాగరికత కాలంలో (క్రీ.పూ. 2750 1500) స్త్రీలను, స్త్రీమూర్తులను పూజించడం లో ఉద్దేశం సంతానాభివృద్ధి. (ఆ అభివృద్ధి పశుగణాల, పంటల, మానవ సమూహాల ఆరోగ్యవంతమైన పెరుగుదల) ఈ రకమైన మతాచారాన్నే ఇంగ్లీషులో 'ఫెర్టిలిటీకల్ట్' (Fertilitycult) అని వ్యవహరించడం జరిగింది. మాక్కే, మార్షల్, చాందా, దేవీ ప్రసాద్ ఛటోపాధ్యాయ మొదలైన వారు శక్తి పరమైన ఆచారాల పరిణామానికి వివిధ కారణాలను అభివ్యక్తం చేశారు దేవీ ప్రసాద్ చటోపాధ్యాయం ప్రకారం వ్యవసాయిక ఆర్థిక వ్యవస్థా పరిణామంలో స్త్రీ ఔన్నత్యాన్ని చాటి చెప్పేదే శక్తి సాంప్రదాయం స్త్రీకి శక్తిని ప్రాఙ్మామూర్తి యుగంలో వివిధ సంకేతాలుగా పూజించడం జరిగింది. అటువంటి వానిలో ఉంగరం వంటి రాళ్ళను పూజించడం క్రీ.పూ. 1400 ముందుకు చెందే సింధు నాగరికత అవశేషాల్లో కన్పించింది. ఈ సాంప్రదాయం క్రీ.పూ 3వ శతాబ్దాంతం వరకూ కొనసాగింది నగ్నంగా ఉండే దేవతను

చెట్లకు జన్మనిచ్చేట్లు చూపించడం, మార్కండేయ పురాణంలో శాంకంభరిఅనే శక్తి రూపాన్ని చూపడం, బెంగాలుదేశంలో దుర్గానవరాత్రుల్లో ఆచారాలుగా మిగిలిపోయిన నవపత్రికారాధనవంటివి శక్తికి వ్యవసాయ వ్యవస్థకు గల సంబంధాన్ని, సంతానానికి సంబంధాన్ని సూచిస్తున్నాయి ఈ రకమైన వ్యవస్థ శక్తి సాంప్రదాయాన్ని వైదిక కాలం నుంచి ఊహామూర్తులుగా తీర్చిదిద్దింది.

**5:1:4:** ఋగ్వేద సూక్తాల ప్రకారం అదితి, ఉషస్సు, వాక్, సరస్వతి, భారతి, ఇల, మహి, రాత్రి, , పురంధి, ధిషణ వంటి దేవతామూర్తులు ఉన్నట్లు తెలుస్తుంది వీరందరిలో అదితి అత్యున్నత స్థానం చెందింది గౌతముని ప్రకారం ఈమెయే స్వర్గం, ఈమెయే వాతావరణం, ఈమె తల్లి, తండ్రి, ఈమే సంతానం, ఈమే అందరు దేవతలూ కూడా ఇంతవరకూ పుట్టినదీ, ఇక ముందు పుట్టేదీ కూడా అదితే. అందుకు దేవతల నందరినీ ఆదిత్యులని స్థూలంగా వ్యవహరించడం జరిగింది ఈ రకమైన అదితే మూల శక్తి, ప్రజాపతి ఎవ్వరైనా మూలశక్తి అదితే. అలాగే రాత్రిసూక్తంలో రాత్రిని సర్వసృష్టికారకమూర్తిగా అభివర్ణించారు శ్రీ సూక్తం ప్రకారం శ్రీయే భాగ్యదేవత ఆమె హిరణ్యవర్ణ, హరిణి, సువర్ణరజతస్రజ ఆమే చంద్ర, హిరణ్మయి. ఈ రకమైన శ్రీ శక్తిని మహాకాళి, మహాలక్ష్మి, మహా సరస్వతి అనికూడ వర్గీకరించడం జరిగింది

**5:1:5** 'వాజసనేయ సంహితలో అంబికను రుద్రుని సోదరిగాను, 'తైత్తిరీయారణ్యకం' లో రుద్రుని పత్నిగాను, 'కేనోపనిషత్తు'లో ఉమబ్రహ్మ విద్యామూర్తిగాను చెప్పబడింది ఈ రకమైన మూర్తి మత్వంలోని పరిణామాన్నే శివపురాణంలోని 'వాయుసంహిత' లో చూడవచ్చు దాని ప్రకారం రుద్రుడు లింగం,ఉమపీఠం రుద్రుడు నరుడు,ఉమనారి రుద్రుడు బ్రహ్మ, ఉమవాణి. రుద్రుడు విష్ణువు, ఉమలక్ష్మి. రుద్రుడు సూర్యుడు, ఉమఛాయ రుద్రుడు సోముడు ఉమతార. రుద్రుడు యజ్ఞం,ఉమదేవి. రుద్రుడు పుష్పం,ఉమగంధం, ఈ రకమైన అభివర్ణన వాస్తవానికి రుద్రుడు, ఉమల ప్రాముఖ్యతనే కాక, అంతరమైన శక్తి ప్రాముఖ్యతను, శక్తికిగల ఔన్నత్యాన్ని సూచిస్తుంది.

**5:1:6:** దేవీభాగవతపురాణం ప్రకారం ఆదిశక్తి మహాలక్ష్మి ఈమె సత్త్వగుణాన్ని కలిగి సరస్వతిగాను, రజోగుణంతో లక్ష్మిగాను, తమోగుణంతో కాళిగాను చెప్పబడింది 'అగ్నిపురాణం' లో శక్తిని పరాశక్తి అన్నారు పాంచరాత్ర సాంప్రదాయానికి చెందిన వైష్ణవాగమాలు మహాశక్తిని లక్ష్మి అని, రాత్రి లో వర్ణించాయి. 'మహా నిర్వాణ తంత్రం' ప్రకారం ఈమె నిర్గుణమైన రాత్రి అలాగే, 'కులచూడామణి నిగమం' కూడా ఈమెను బ్రహ్మానందంతో సరిపోల్చడం జరిగింది. అదేవిధంగా, శక్తిని గూర్చి వివిధ శాక్తపురాణాలయిన 'దేవీపురాణం' 'కాళికాపురాణం' 'త్రిపుర రహస్యం' వంటివి విరివిగా వర్ణించాయి. దేవీపురాణం 'ప్రకారం ఆమె 'చాముండ' అనే ఆద్యశక్తి 'కాళికాపురాణం' ప్రకారం ఈమె సృష్టి స్రష్టః అంతేగాక మూల ప్రకృతి, అనంతశక్తి. 'త్రిపుర రహస్యం' ప్రకారం మూలశక్తి కలిగిన మహాదేవి.

**5:1:7:** ఈ గ్రంధాలేకాక, తంత్ర గ్రంథాలైన, 'మహావీరతంత్రం', 'కులార్ణవ తంత్రం', వామకేశ్వర తంత్రం' వంటివి. శంకర భగవత్పాదులవారి 'సౌందర్యలహరి','బ్రహ్మయామళతంత్ర', 'రుద్రయామళతంత్రం' వంటి అనేక ఆధారాలు దేవీ స్వరూపాన్ని గూర్చి, దేవీ తత్త్వాన్ని గూర్చి, దేవీ మూర్తులను గూర్చి అభివర్ణించాయి. నిరాకారం, నిరంజనం, నిర్గుణం అయిన పరతత్త్వానికి

రూపమైన ఈ శక్తిని వివిధ మూర్తులుగా ఏర్పరచడం జరిగింది ఈ మూర్తులలో లక్ష్మి, సరస్వతి, దుర్గ, పార్వతి, మహిషాసురమర్దిని (ఈమెనే మహిష మర్దిని' అని కూడా అంటారు) వంటివి మూలమూర్తులు కాగా, సప్తమాతృకలు, గ్రామ దేవతలు వంటివి పరివార సాంప్రదాయాన్ని సూచిస్తాయి. ఈ రకమైన వానిలో శక్తి మూలమూర్తులను గూర్చి ఈ కింది విధంగా తెలియవచ్చు.

**5:1:8:** కేవలం ఏడాది పసిపాపగా ధ్యానిస్తే ఆమెను 'సంధ్య' అని, రెండేళ్ళ పాపగా ధ్యానిస్తే 'సరస్వతి అని; ఏడేళ్ళ బాలికగా ధ్యానిస్తే 'చండిక' అని, ఎనిమిదేళ్ళ కన్యగా భావిస్తే 'శాంభవి' అని, తొమ్మిదేళ్ళగా భావిస్తే 'దుర్గ' లేదా 'బాల' అని, పదేళ్ళకు 'గౌరి' అని; పదమూడేళ్ళకు 'మహాలక్ష్మి' అని; పదహారేళ్ళకు 'లలిత' అని పిలవడం జరిగింది ఇన్ని రకాలుగా ఉన్న దేవికి 'ఉత్తర కామికాగమంలో ఒక సామాన్య స్వరూపాన్ని సూచించడం జరిగింది. ఆమె సత్త్వగుణోపేతమైన ముఖాన్ని, మూడుకన్నులను, నాలుగు చేతులను కలిగి ఉంటుంది ఆమె శిరస్సుపై కరండమకుటాన్ని, ఒంటిపై పట్టు వస్త్రాలను ధరించి ఉంటుంది ఆమె రెండుచేతులలో పాశాంకుశాలు ధరించి ఉండగా ఒక చేయి వరద ముద్ర లోను, వేరొక చేయి అభయముద్రలోను ఉంటుంది. ఈమెను విడిగానే కాక తన భర్తతో కూడ ఆసీనమూర్తిగా గాని, స్థానక మూర్తిగా గాని, ఆలింగన మూర్తి గాగాని, నృత్యమూర్తిగాగాని చూపడం జరుగుతుంది.

## 5 : 2 శైవ దేవీ మూర్తులు

**5 : 2 : 1 :** దుర్గ : శక్తి రూపాలలో శివశక్తి రూపాలు విపులంగా ఉన్నాయి వానిలో దుర్గ ఒక్కతె. నీలకంఠి, క్షేమంకరి , హరసిద్ధి, రుద్రాంశదుర్గ, వనదుర్గ, అగ్నిదుర్గ, జయదుర్గ, వింధ్యావాసి దుర్గ, రిపుమారి దుర్గ అనే తొమ్మిది దుర్గా మూర్తులను ఆగమాలలో చెప్పడం జరిగింది

**5 : 2 : 1 : 1 :** సామాన్యంగా దుర్గాదేవి నీలివర్ణంలో నాలుగు లేదా ఎనిమిది లేదా అంతకన్న ఎక్కువ చేతులు కలిగి, మూడు కన్నులతో ఉంటుంది ఆమె పుష్టినందిన ఉరోజాలను, ఊరువులను, శ్రోణిని కలిగి ఉంటుంది. కరండమకుటాంకృత శిరస్సును కలిగి, సర్వాభరణ భూషితమైన శరీరంతో ఉంటుంది. పైన కుడి చేయి చక్రాన్ని, ఎడమ చేయి శంఖాన్ని ధరించి ఉండగా, కింది కుడి చేయి అభయముద్రను కింది ఎడమ చేయి కటకముద్రలోను ఉంటాయి ఈమెను పద్మంమీద గాని, దున్నపోతు శిరస్సు మీదగాని, సింహం మీద కాని చూపడం జరుగుతుంది. సుప్రభేదా గమం ప్రకారం ఆదిశక్తి అవతారమైన ఈమె నారాయణి ఎనిమిది చేతులు కలిగి ఎనిమిదింట శంఖం, చక్రం, శూలం, ధనుస్సు, బాణం, ఖడ్గం, ఖేటకం, పాశం ధరించి ఉంటుంది.

### 5:2:1:2: నవదుర్గామూర్తులు :

**5:2:1:2:1:** ఐశ్వర్యానికి సంతోషానికి కర్తయై మూడు చేతులలో శూలం, ఖేటకం, పానపాత్ర ధరించి, ఒక చేయి వరద ముద్రలో ఉన్న నీలకంఠి.

**5:2:1:2:2:** ఆరోగ్యానికి వాతయై మూడు చేతుల పద్మం, త్రిశూలం, పానపాత్ర కలిగి, ఒక చేయి వరద ముద్రలో ఉన్న క్షేమంకరి

**5:2:1:2:3:** నాలుగు చేతులలో డమరు, కమండలువు, ఖడ్గం, పాన పాత్ర కలిగి కోర్కెలు

తీర్చేటటువంటిది హరసిద్ధి

**5:2:1:2:4:** నాలుగు చేతులలో శూలం , ఖడ్గం, శంఖం, చక్రం కలిగి, రక్తవసనయై, కిరీటమకుటంతో, సింహ వాహినియైన, నల్లని శరీరం, రెండు కన్నుల కలది రుద్రాంశదుర్గ. ఈమె రెండువైపుల సూర్యుడు, చంద్రుడు ఉంటారు

**5:2:1:2::** ఆకుపచ్చని శరీరచ్ఛాయతో ఎనిమిది చేతులు కలిగి ఏడింటి శంఖ, చక్రం, ఖడ్గం, ఖేటకం, బాణం, ధనుస్సు, శూలం కలిగి, ఎనిమిదవ చేయి తర్జనితో ఉన్న వన దుర్గ.

**5:2:1:2:6:** సింహవాహినియై తీక్షణ ద్రుష్టితో, చంద్రరేఖ కల శిరస్సుతో, మెరపువంటి తేజస్సుతో మూడు కన్నులు, ఎనిమిది చేతులు కలిగి, ఆరు చేతులలో చక్రం,ఖడ్గం, ఖేటకం,బాణం, పాసం, అంకుశం ఉండగా రెండు చేతులు వరద, తర్జని ముద్రలలో ఉన్న ఆమె అగ్నిదుర్గ ఈమెకు రెండు వైపుల కత్తి డాలు దాల్చిన ఇద్దరు వినయవతులైన అప్సరసలు నుంచుని ఉంటారు

**5:2:1:2:7:** సిద్ధికోరేవారు ప్రార్ధించే, సింహవాహినియై, నీలిరంగు ఛాయతో, మూడుకన్నులు నాలుగు చేతులు కలిగి వానిలో శంఖ, చక్ర, ఖడ్గ, త్రిశూలాలు ధరించిన, ఈ మూర్తి జయదుర్గ ఈమె శిరస్సు మీద చంద్రరేఖ మెరుస్తుంటుంది

**5:2:1:2:8:** పద్మంపై కూర్చొన్న మెరపు వంటి శరీరచ్ఛాయ, మూడు కన్నులు, నాలుగు చేతులు కలిగి, రెండింట శంఖం, చక్రం ఉండగా, మరి రెండు చేతులు వరద, అభయముద్రలలో ఉండగా, అన్ని ఆభరణాలతోను గల శరీరం, చంద్ర రేఖచే అలంకరించబడ్డ శిరస్సు, పరివేష్టించి పొగుడుతున్న ఇంద్రాది దేవతలు, సమీపంలో నిలుచున్న సింహం, గల ఈమూర్తి వింధ్యవాసి దుర్గ.

**5:2:1:2:9:** ఎర్రని తేజస్సు, తీక్షదృష్టి, రెండు చేతులు కలిగి ఒక దానిలో త్రిశూలం, వేరొకటి తర్జని ముద్రలో నున్న ఈ మూర్తి రిపుమారిదుర్గ. ఈమె సర్వశత్రు సంహారిణి, రవి బింబ సమతేజ

**5:2:2: మహిషమర్దిని :**

**5:2:2:1:** 'శిల్పరత్నం', 'విష్ణుధర్మోత్తరం' వంటి వివిధ లక్షణ గ్రంథాలు మహిషమర్దిని లక్షణాలను వివరించాయి. మహిషుడు అనే రాక్షసుడు దేవతలనందరిని చంపుతున్న సందర్భంగా సర్వదేవత సంరక్షణ కోసం, ధర్మ ప్రతిష్ఠాపనకోసం, నారాయణి అయిన శక్తి సింహవాహినియై అవతరించి, మహిషుని నెత్తురు నేలమీద చిందకుండా తన నాలుకను చాపి, అతనిని కాలితో అణచి, శూలంతో చంపివేసింది

**5:2:2:2:** 'శిల్పరత్నం' ప్రకారం మూడు కన్నులు, శిరస్సుపై జటామకుటం,చంద్రకళ కలిగినది ఈ మూర్తి. అతసీసుమాన్ని (అవిసె పూవును)పోలిన శరీరచ్ఛాయను, నీలోత్పలం వంటి కన్నులను కలిగినది ఈమె కఠినవక్ష, సింహమధ్య త్రిబంగిమలో ఉన్న ఈ మూర్తిపదిచేతులు కలది. కుడిచేతులలో త్రిశూలం, ఖడ్గం, శక్త్యాయుధం,చక్రం, నారిగలవిల్లు, ఎడమ చేతులలో పాశం, అంకుశం, ఖేటకం, పరశువు, ఘంట కలిగినది. ఆమె పాదాలను తల నరకబడిన ఒక దున్నపై ఉంచాలి. ఈ శిరస్సు నుంచి నాగపాశంతో బంధించబడిన ఒక రాక్షసుని మూర్తిని చూపించాలి. ఈమె కుడి కాలు సింహం వీపుమీద ఉండగా, ఎడమ కాలుమహిషాసురుని శరీరాన్ని తాకుతూ

ఉండాలి. (చూ.ఫోటో 1[2])

**5:2:2:3:** 'విష్ణుధర్మోత్తరం' ఈమూర్తినే చండిక అంటుంది. 'విష్ణుధర్మోత్తరం' ప్రకారం బంగారుచ్ఛాయ, తీక్షదృష్టి కలిగి,సింహవాహిని అయిన ఒక యువతి చండిక ఈమెకు ఇరవై చేతులుంటాయి. పదిచేతులలో కుడివైపున శూలం, ఖడ్గం, శంఖం, చక్రం, బాణం, శక్తి, వజ్రం, అభయముద్ర, ఢమరుక, ఛత్రం ఉండగా, పది చేతులలో ఎడమవైపుననాగపాశం, ఖేటకం, పరశువు, అంకుశం, ధనుస్సు, ఘంట, ధ్వజం, గద, అద్దం, ముద్గరం ఉంటాయి తెగిన దున్నపోతు శిరస్సు నుండి వెలికివస్తున్న రాక్షసుడు నాగపాశాలతో బంధించబడి ఉండటం ఈ రాక్షసుని సింహం చంపబోగా, చండికాదేవి స్వయంగా శూలంతో అతని కంఠంలో గుచ్చుతుంది

**5:2:2:4:** కాత్యాయని అనే ఇంకొక రూపాన్ని కూడా మహిషమర్దిని అనే చెప్పబడింది.

5:2:2:5: సంకేతాత్మకమైన మహిషాసురమర్దన వృత్తాంతం గురించి పద్మపురాణం కొంత వివరణ ఇచ్చింది. స్వాయంభువ మన్వంతరంలో మందర గిరిమీద వైష్ణవి మహిషుడిని వధించింది ఈ కథనే 'వరాహపురాణం'లో చెప్పారు. వైవస్వతమన్వంతరంలో వింధ్య పర్వంతపై నందా అనే శక్తి మహిషుని చంపడం జరిగింది నందమూర్తిని గూర్చి 'విష్ణుధర్మోత్తరపురాణం'లోను, వ్యుత్పత్తిని గూర్చి 'వరాహపురాణంలోను చెప్పడం జరిగింది. నందమహిషుని చంపడం జ్ఞానశక్తి మాయను అణచడానికి, మహిషారాధన బదులుగా దేవీపూజ వ్యాపించిందని చెప్పడానికి గుర్తు. 'వామనపురాణం' లో కూడా మహిషమర్దినీ వృత్తాంతం చెప్పడం జిరగింది.

**5:2:3:** భద్రకాళి : దేవి ఉగ్రమూర్తులలో భద్రకాళి ఒక్కర్తె. మూడు కన్నులు కలిగి,పద్దెనిమిది చేతులు గలిగి, మహాసౌందర్యాన్ని రాసిపోసినట్లుండేది ఈ మూర్తి. ఈ మూర్తికి గల 16 చేతులలో, అక్షమాల, త్రిశూలం, ఖడ్గం, చంద్రుడు,బాణం, ధనుస్సు, శంఖం, పద్మం,(సుక్) స్రువం, కమండలువు, దండం, శక్తి, అగ్ని కృష్ణాజనం, జలం ఉంటాయి. ఇక మిగిలిన రెండుచేతులలో ఒకటి శాంతిముద్రలో ఉండగా,ఇంకొక చేతిలో రత్నపాత్ర ఉంటుంది ఆలీఢాసనంలో ఉన్న ఈమె నాలుగు సింహాలు లాగుతున్న రధం మీద ఉంటుంది. దీనిలోనే ఇంకొక వైవిధ్యమైన 'భవతారిణి కాళి' వంటి మూర్తిని బెంగాలులోనిదక్షిణేశ్వరం మొదలైన ప్రాంతాలలో పూజించడం జరుగుతున్నది.

**5:2:4:** మహాకాళి : ఈమె మూర్తిలో రెండు సాంప్రదాయాలున్నాయి. ఒక మూర్తినాలుగు చేతులు కలిగి దానిలో ఖడ్గం, ఖేటకం, పాత్ర,కపాలం ఉండగా మెడలో కపాలమాలను ధరించి, నల్లని రంగుతో నోటినుంచి బయటకు వస్తున్న కోరలు కలది. ఇంకొక మూర్తి నీలిమేఘచ్ఛాయను పోలిన లావయిన శరీరంతోను, చక్రం, శంఖం, గద, కురారం, ఢమరుకం, అంకుశం, పాశం, వజ్రాలు గల ఎనిమిది చేతులతోను ఉన్నది

**5:2:5:** సర్వమంగళ : ఈమె సింహవాహినియై, నాలుగు చేతులుగల మూర్తి వానిలో అక్షసూత్రం, పద్మం, శూలం, కమండలువు ఉంటాయి.

**5:2:6:** లలిత : సర్వాభరణభూషితయై, స్థానకమూర్తి అయిన ఈమె నాలుగు చేతులు కలది. ఎడమచేతులలో అద్దం, శంఖం, ఉండగా, కుడిచేతులలో పండు, కాటుకభరిణి ఉంటాయి.

**5:2:6:1:** ఈ రకమైన ప్రధానమైన శివశక్తిమూర్తులేగాక, అంబ, అంబిక, మంగళ, కాళరాత్రి, గౌరి, ఉమ, పార్వతి, రంభ, తోతల, త్రిపుర, భూతను త, యోగనిద్ర, వాదు, జ్యేష్ఠ, రౌద్రి, కాళి, కలవిక్షర్ణిక, బలవి క్షర్ణిక, బలప్రమధని, సర్వభూతదమని, మనోన్మని, వారుణి, చాముండ, రక్తచాముండ, శివదూతి, యోగేశ్వరి, భైరవి, శివ, కీర్తి, సిద్ధి, రిద్ధి, క్షమ, దీప్తి, రతి, శ్వేత, భద్ర, జయ, విజయ, కాళి, ఘంటాకర్ణి, జయంతి, దితి, అరుంధతి, అపరాజిత, సురభి, కృష్ణ, ఇంద్రాక్షి, అన్నపూర్ణ, తులసి, అశ్వీరూఢదేవి, భువనేశ్వరి, బాల, రాజమాతంగి అనే వివిధ దేవిగణమూర్తులను పేర్కొనడం జరిగింది. ఈ మూర్తులన్నీ వివిధ స్థాయిలలో సత్త్వ, రజః, తమోగుణాలను ప్రదర్శించినా, ఇవన్నీ ప్రధానంగా యోగం, తత్త్వచింతన, జ్ఞానం, వైరాగ్యం అంకురింపచేసి అరిషడ్వర్గాలను అణచడానికి ముముక్షువులకు పరమపదసోపానాలు

## 5 : 3 వైష్ణవ దేవీమూర్తులు

### 5:3:1: లక్ష్మి :

**5:3:1:1:** 'లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీందాసీ భూతసమస్త దేవవనితాం లోకైక దీపాంకురాం

శ్రీమన్మంద కటాక్షలబ్ధవిభవద్బ్రహ్మేంద్రగంగాధరాం

త్వాంత్రైలోక్యకుటుంబినీం సరసిజాంవందేముకుందప్రియాం – అని

సర్వసాధారణంగా యావద్భారతదేశం ప్రార్థనలందుకొంటున్న లక్ష్మి క్షీర సముద్రంనుంచి జన్మించింది ఆమె శ్రీరంగ శాయి అయిన విష్ణుని నివాసానికి రాణి, సమస్త దేవ వనితలను దాసీలవలె చేసికొన్నది, లోకాలన్నిటికి ఐన ఒకే దీపపు మొలక వంటిది, ఈమె దయాలేశం వల్ల పొందిన వైభవం గల బ్రహ్మ, ఇంద్ర, శివులను గలది. ఈమె మూడు లోకాలకు తల్లి, ముకుంద ప్రియ. ఈ రకమైన లక్ష్మిని 'శ్రీ' అని, 'అదితి' అని, 'పద్మ' అని, 'కమల' అని వేర్వేరుగా పిలవడం జరుగుతూంది వైదిక గ్రంధాలైన 'ఋగ్వేదం', 'శ్రీసూక్తం' తైత్తిరీయ సంహిత ప్రతిమా లక్షణ గ్రంథాలైన 'శిల్పరత్నం', 'విష్ణు ధర్మోత్తరం', 'అంశుమద్భేదాగమం', 'విశ్వకర్మ శాస్త్రం', తంత్రగ్రంధాలైన 'మహాలక్ష్మీతంత్రం', 'తంత్రసారం', 'శారదా తిలకతంత్రం', పురాణాలైన 'అగ్నిపురాణం', 'వైష్ణవమత గ్రంథాలైన 'పాంచరాత్రాగమం' వంటివి లక్ష్మీతత్వాన్ని, లక్ష్మి మూర్తులను గూర్చి వివరించాయి

**5:3:1:2:** తొలిదశలో కశ్యపుని పత్నిగా చెప్పబడిన 'అదితి', తర్వాతి కాలంలో 'శ్రీ' యై, లక్ష్మీత్వం పొందింది. ఋగ్వేదానికి బౌద్ధుల కాలంలో చేర్చబడిన శ్రీ సూక్తంలో ఈమె హిరణ్యవర్ణ, హరిణి, సువర్ణ, రజత, స్రజ, చంద్ర, హిరణ్మయి, మొదలైన రీతుల్లో అభివర్ణించబడింది క్షీరసాగర మథనంలో జన్మించిన ఈ లక్ష్మి లేదా శ్రీ, – లక్ష్మిగా కామదేవునికి(మన్మథునికి) కృష్ణావతారంలో రుక్మిణిగా ప్రద్యుమ్నునికి తల్లి.

**5:3:1:3:** 'శిల్పరత్నం' ప్రకారం తెల్లని శరీరచ్ఛాయను కలిగి, ఎడమ చేత పద్మాన్ని,కుడిచేత మారేడు పండును ధరించన ఈమూర్తి ముత్యాల హారాలు ధరించి ఉండగా రెండువైపుల చామర

గ్రాహిణులు సేవిస్తుంటారు విష్ణుని పక్కన ఉన్నప్పుడు ఈమె రెండు చేతులను మాత్రమే కలిగి ఉండాలి. కాని ఈమె మూలవిరాట్టుగా ఉండగా నాలుగు చేతులను కలిగి వానిలో కుడిచేతులలో పద్మం, మారేడుపండు ఎడమ చేతులలో అమృతఘటం, శంఖం కలిగి ఉండి, ఇరువైపుల అభిషేకిస్తున్న ఏనుగులను కలిగి కేయూరాలతోను, కంకణాలతోను అలంకృతయై ఉండాలి.

**5:3:1:4** 'అంశుమద్భేదాగమం'లో లక్ష్మీదేవిని వేరొక రకంగా వర్ణించడం జరిగింది. ఆమె స్వర్ణచ్ఛాయలో ఉన్న శరీరం కలది నవరత్న ఖచితమైన ఆభరణాలను, చెవులకు నక్ర కుండలాలను కలిగి 'ముగ్ధ' లాగ ఉండి, సొగసైన కనుబొమలతోను, పద్మపత్రాల వలె విశాలమైన కన్నులతోను, సుందరమైన కంఠంతోను, ప్రవర్ధిల్లిన వక్షంతోను ఉన్నమూర్తి ఆమెది. ఆమె కుడిచేత పద్మాన్ని, ఎడమచేత మారేడు పండును ధరించి ఉంటుంది. 'విష్ణుధర్మోత్తరం' లో ఈమె నల్లని రంగు గలదిగా చెప్పబడింది.

**5:3:1:5:** లక్ష్మీదేవికి మొత్తం ఎనిమిది మూర్తులను చెప్పడం జరిగింది అవి ధనలక్ష్మి, ధాన్యలక్ష్మి, ధైర్యలక్ష్మి, శౌర్యలక్ష్మి, విద్యాలక్ష్మి, కీర్తిలక్ష్మి, విజయలక్ష్మి, రాజ్యలక్ష్మి. ఈ అష్టలక్ష్మీ సాంప్రదాయం తరవాతి కాలానికి చెందిందని చంపకలక్ష్మి అభిప్రాయం కాగా, 'శ్రీతత్వనిధి' ప్రకారం అష్టలక్ష్మీ సాంప్రదాయానికి చెందిన మూర్తులు ద్విభుజలక్ష్మి, గజలక్ష్మి, శ్రీలక్ష్మి, మహాలక్ష్మి, వీరలక్ష్మి, ద్విభుగవీరలక్ష్మి, అష్టభుజవీరలక్ష్మి, ప్రసన్నలక్ష్మి అని రాజేశ్వరి పేర్కొనడం జరిగింది.

**5:3:1:5:1:** ద్విభుజలక్ష్మి : విష్ణుని పక్కన స్థానకమూర్తియై రెండు చేతులు కలిగి ఒక చేత పద్మాలతో, వేరొక చేయివరద ముద్రలో ఉన్న మూర్తి

**5:3:1:5:2:** గజలక్ష్మి : 'ప్రపంచసార తంత్రం' ప్రకారం గజలక్ష్మి పద్మాసీనయై, ఒకచేత పద్మం ధరించి ఉండాలి. ఆమె స్వర్ణచ్ఛాయతో వెలుగొందుతూ నాలుగు ఏనుగులు స్వర్ణ కలశాలలో ఉంచిన నీటితో అభిషిక్త అవుతున్నట్లు చూపాలి ఈమె తెల్లని పట్టు వస్త్రాలతో చుట్టబడి,నవరత్న ఖచితమైన నగలను ధరించి ఉండాలి.

**5:3:1:5:3:** శ్రీలక్ష్మి : బార్హత్, బోధగయ, సాంచి వంటి శిల్పాలలో ఈమె మహద్వారాలపైన స్తంభాలపైన చూపబడింది రెండుచేతుల కలువలను దాల్చి, పద్మంపై ఉన్నట్లు, 'కమలాలయ' వలె చూపబడింది ఈ మూర్తి ఏనుగులతోను, కలశాలతోను, నీటితోను కలిసి మేఘాలను, వర్షాన్ని సూచిస్తుంది.

**5:3:1:5:4:** **మహాలక్ష్మి** : 'విశ్వకర్మ శిల్ప శాస్త్రం' ప్రకారం ఈమె కొల్హాపురంలో ఉంది. సర్వాభరణభూషిత యైన ఈమె కుడిచేతులలో కలశాన్ని కౌమోదకిని, ఎడమచేతులలో ఖేటకాన్ని, శ్రీఫలాన్ని కలిగి ఉంటుంది ఈమె గరుడ వాహన కోలాసురుడనే రాక్షసుని చంపి, కోలాసుర భయంకరి అని పొగడబడింది

**5:3:5:5: వీరలక్ష్మి :** ఈమె సింహవాహన, ఆరుచేతులు గలది నాలుగు చేతులలో త్రిశూలం,ముద్గరం, శంఖం, చక్రం, ఉండగా మిగిలిన రెండు చేతులలో ఒకటి అభయముద్ర లోను, వేరొకటి వరదముద్రలోను ఉంటాయి.

**5:3:1:6 ద్విభుజ వీరలక్ష్మి :** ఈమెను గూర్చి 'నరసింహ ప్రసాదం'లో చెప్పడం జరిగింది. ఈమె రెండు చేతులు అభయ, వరద ముద్రలలో ఉంటాయి.

**5:3:1:5:7: అష్టభుజవీర లక్ష్మి :** ఎనిమిది చేతులు గలది ఈ మూర్తి. వానిలో ఆరు చేతులలో పాశం, ఆంకుశ, అక్షసూత్రం, గద, పద్మం, పత్రం ఉండగా రెండు చేతులు వరద, అభయ ముద్రలలో ఉంటాయి.

**5:3:1:5:8: ప్రసన్న లక్ష్మి :** ఈమె సత్యగుణోపేత అయినది

**5:3:1:5:9: ధనలక్ష్మి :** ఈమె గరుడ వాహనారూఢ. ఎనిమిది చేతులు కలది వానిలో శంఖం, చక్రం, రెండుచేతులలోని అభయ, వరద ముద్రలో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి.

**5:3:1:5:10: జయలక్ష్మి :** ఈమె హంసవాహన, ఎనిమిది చేతులు కలది వానిలో ఆరింట చక్రం, శంఖం, అంకుశం, పాశం, ఖడ్గం, డాలు ఉండగా, మిగిలిన రెండు చేతులు అభయ, వరద ముద్రల్లో ఉంటాయి. ఆమె వికసితమైన పద్మం మీద నిలచి ఉంటుంది.

**5:3:1:5:11: ఐశ్వర్యలక్ష్మి :** ఈమె అశ్వరూఢ

**5:3:1:5:12: త్రైలోక్యమోహన లక్ష్మి :** 'అగ్నిపురాణం' 'శారదాతిలక' 'తంత్రసారం' వంటి ఆధారాల్లో ఈమెను గూర్చి చెప్పడం జరిగింది విష్ణువు నాలుగు వ్యూహాలైన వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అనే భావనలతో నాలుగు పద్మాలతో ఆమెను చుట్టి ఉంటాడు ఈ మూర్తి 'పాంచ రాత్రం' లో చెప్పబడిన 'త్రై లోక్యమాతరం' అనే సాంప్రదాయానికి దగ్గరది.

**5:3:1:5:13: రాజ్యలక్ష్మి :** గజలక్ష్మిని పోలిన ఏనుగులతో అభిషిక్త అవుతున్నట్లుచూపిన మూర్తి రాజ్యలక్ష్మి.

**5:3:1:5:14 :** ఇన్ని రూపాలు గల లక్ష్మీదేవి అదృష్టానికి సౌభాగ్యానికి గుర్తు. మార్కండేయ ప్రకారం ఈమె పద్మ, మహాపద్మ, మకర, కచ్ఛప, ముకుంద, బిల్వ, ఆనంద, శంఖ అనే ఎనిమిది నిధులకు అధికారిణి. బౌద్ధ జైన సాంప్రదాయాలలో కూడ లక్ష్మిని చూపడం జరిగింది

## 5:3:2 భూదేవి

**5:3:2:1:** లక్ష్మీదేవి తరవాత వైష్ణవ దేవీమూర్తులలో పేర్కొన్నది భూదేవి ఈమె ఆకుపచ్చ రంగులో ఉంటుంది. ఆమె కరండమకుటాన్ని, సర్వభూషణాలను కలిగి,పసుపుపచ్చని వస్త్రాలతో ఉంటుంది. ఈమె రెండుచేతులలో పద్మాలను గాని, నీలోత్పలాలను గాని ధరించి ఉంటుంది. ఆమె పద్మ పీఠం మీద కూర్చొన్నట్లుగాని, నుంచుని ఉన్నట్లు గాని చూపడం జరుగుతుంది 'పూర్వ కారణాగమం'లో భూదేవి నీలిరంగుతో, ఎరుపు వస్త్రంతో స్వర్ణయజ్ఞోపవీతంతో ఉంటుందని చెప్పడం జరిగింది కాని 'విష్ణుధర్మోత్తరం ప్రకారం తెల్లని ఛాయతో, నాలుగు చేతులతో, వానిలో రత్నపాత్ర, సస్యపాత్ర,ఓషధీపాత్ర, పద్మాలను కలిగి, ఆమె దిగ్గజాలమీద కూర్చొని ఉండాలి.

**5:3:3: పిన్నై :**

**5:3:3:1:** ఈ మూర్తి ప్రధానంగా దక్షిణ దేశంలో వ్యాప్తిలో ఉన్నకృష్ణుని రాణులలో ఒకతె. ఈమెనే కొందరు 'రాధ' అని సమన్వయించారు. కృష్ణుని గూర్చి చెప్పిన భారతం, హరివంశం, భాగవతం వంటి ప్రధానాధార గ్రంథాలలో ఎక్కడా రాధను గూర్చి, కృష్ణుడికి రాధకు గల సాన్నిహిత్యాన్ని గూర్చి చెప్పబడలేదు. కాని జయదేవుని 'గీత గోవిందం'లో రాధామాధవ శృంగారం అభివర్ణించబడింది. 'గాథా సప్తశతి' గౌడవహో' వంటితొలి ప్రాకృత కావ్యాలు రాధను సూచిస్తాయి. క్రీ.శ 12 వ శతాబ్దంలో సేన వంశస్థుల పాలనలో అవతరించిన 'చైతన్యులవారు' (చైతన్య ప్రభువు) రాధాదేవి అవతారంగా భక్తి శాస్త్రాలలో చెప్పబడింది. ఈమెనే 'నప్పిన్నై' అని కూడా వర్ణించడం జరిగింది.

**5:3:4: ఆండాళ్ లేదా గోదాదేవి :**

**5:3:4:1:** 'సూడిక్కొడుత్తునాచ్చియార్' అని వైష్ణవ ప్రబంధాలలో చెప్పిన విల్లిపుత్తూరునకు చెందిన విష్ణుచిత్తుని కుమార్తె అయిన 'కొదై' అనే గోదాదేవి తనను తాను శ్రీరంగశాయిని వలచి అతనికి సమర్పించే పూలమాలలను తాను ధరించి తరవాత స్వామికి సమర్పణ చేసేది. ఈ రకమైన మధుర భక్తి వెలార్చిన ఈమెనే ఆముక్త మాల్యద అని, ఆమె చరిత్రను శ్రీకృష్ణదేవరాయలు 16వ శతాబ్దంలో గొప్ప కావ్యంగా రచించాడు. అది తెలుగు పంచ కావ్యాలలో ఒకటి ఈమె భూదేవి అవతారమని భావింపబడింది

**5:3:5 : సీత.**

**5:3:5:1:** రామావతరానికి చెందిన ఈ మూర్తి " స్వర్ణాభామంబుజ ముఖీంరాలోకనతత్పరాం
ధ్యాయేత్ షట్కోణమధ్య స్థవామాంకోపరిశోభితాం" అని
వర్ణింపబడింది రాముని వామాంకంపై ఉండి శోభిల్లుతూ, రాముని చూసి ఆనందించే అంబుజం వంటి ముఖం స్వర్ణం వంటి శరీర ఛ్ఛాయ కల ఈ మూర్తి కేవలం మానవిగానే చూపబడుతుంది. ఏరకమైన దివ్యచిహ్నలతోను చూపబడదు

**5:3:6: సత్యభామ.**

**5:3:6:1:** కృష్ణుని అష్టపత్నులలో ఒకర్తెగా కృష్ణుని ప్రియ భార్య అయిన ఈమె భూదేవి లాగ కుడిచేత నీలోత్పలం ధరించి కృష్ణుడికి ఎడమవైపుగా ఉండటం జరుగుతుంది.

**5:3:7: రుక్మిణి :**

**5:3:7:1:** ఈమె శ్రీకృష్ణుని పట్టపురాణి, కృష్ణుడికి కుడివైపుగా, లక్ష్మిమూర్తిలాగ ఉంటుంది.

**5:4: ఇతర మూర్తులు**

శైవ, వైష్ణవ, దేవీ మూర్తులేకాక కొన్ని ఇతర దేవీ మూర్తులు కూడా ఎంతో ప్రాశస్త్యం కలిగినవి ఉన్నాయి. వానిని గూర్చి ఈ కింది విధంగావివరించవచ్చు.

**5:4:1: సరస్వతి**

**5:4:1:1:** వేదాలలో 'వాగ్దేవత' అని, 'వేదగర్భ' అని, 'ఇల', 'భారతి' అని చెప్పబడిన సరస్వతి బ్రహ్మపుత్రిక, పత్ని. ఆమె విద్యలకు, వాక్కుకు లలిత కళలకు అధిదేవత

"సంగీతమపి సాహిత్యం సరస్వతీస్తనద్వయం

ఏకమాపాతమధురం అన్యదాలోచనామృతం" అనే సూక్తి సరస్వతికి సంగీత, సాహిత్యాలకు గల సంబంధాన్ని సూచిస్తున్నది. ఇంచుమించు అన్ని దేవాలయాలలోను సరస్వతీమూర్తులున్నా, ఆమె మూల విరాట్టుగా ఉన్న ఘట్టాలు తక్కువ బ్రహ్మ రంధ్రం నుంచి ప్రవహిస్తున్న అమృత సరస్సును కలిగి ఉండటం వల్ల ఆమెను 'సరస్వతి' అన్నట్లు వశిష్టుని 'ఆధ్యాత్మ రామాయణం'లో చెప్పడం జరిగింది. ఆమె 'భారతి', 'మహావిద్య', 'వాణి', 'మహారాణి', ఆర్య, 'బ్రాహ్మి', 'కామధేను', బీజగర్భ' 'ధరేశ్వరి', 'వాగేశ్వరి', 'శారద', 'గీర్వాణి', మొదలైన పేర్లతో పిలవబడింది భూమిమీద 'ఇడ' అని, అంతరిక్షంలో 'సరస్వతి' అని స్వర్గంలో 'భారతి' అని పిలిచే మూడు మూర్తులు వాగ్దేవతయే ఆమె మనస్సును శుద్ధి చేయడం వల్ల 'పావక' అన్నారు. సరస్వతి 'అపరవిద్య' అని కూడ చెప్పబడింది 'దేవీ భాగవత పురాణం' లో మహాసరస్వతిగా చెప్పబడిన ఈమె సత్త్వగుణానికి అధికారిణి 'బ్రహ్మవైవర్తపురాణం' ప్రకారం ఈమెను బ్రహ్మసృష్టించి తరవాత పెళ్ళాడినప్పుడు ఈమె 'బ్రహ్మణి', అయింది

**54:1:2:** ఈమెను ఎంతో మనోహరంగా హిందూ సాంప్రదాయంలో వర్ణించడం జరిగింది. ఉదాహరణకు ఒక వర్ణనలో ఈమె

"శరదిందు వికాస మందహాసినీం
స్ఫురదిందీవరలోచనాభిరామాం
అరవింద సమాన సుందరాస్యా
మరవిందాసన సుందరీము పాస్యే"

(శరత్కాల చంద్రుని వికాసం వంటి చిరునవ్వు, ప్రకాశించే కలువల వంటి సుందరమైన కన్నులు, పద్మం వంటి సుందర మైన ముఖంగల అరవిందాసునుడైన బ్రహ్మరాణి (సుందరి), అని వర్ణితమైంది ఆమె తెల్లని ఛాయతో పద్మాసనయై, భ్రూమధ్యంలో చంద్రరేఖను కలిగి ఉంటుంది. ఆమె నాలుగు లేదా ఎనిమిది చేతులు కలది నాలుగు చేతులలో వీణ, పుస్తకం, అక్షమాల, అంకుశం ఉంటాయి. ఎనిమిది చేతులలో బాణం, గద, ముద్గరం,చక్రం, శంఖం, ఘంట, హలం, విల్లు ఉంటాయి.

**5:4:1:3:** సరస్వతి కేవలం సౌమ్యమూర్తిగానే గాక ఉగ్రమూర్తిగా కూడా చెప్పబడింది. ఋగ్వేదం ప్రకారం ఆమె వృత్రాసురుణ్ణి చంపింది 'చండీకల్పం' ప్రకారం నవరాత్రులలో పూజలందే మహాసరస్వతికి ఎనిమిది చేతులు, వానిలో ఘంట, శూలం, నాగలి, శంఖం, ముసలం, చక్రం, ధనుస్సు, బాణం ఉంటాయి చంద్రుని వలె తెల్లని ఛాయగల ఈమె గౌరి శరీరం నుంచి జన్మించి శుంభ, నిశుంభులనే రాక్షసులను చంపింది. ఇంకొక ఆధారమైన 'సరస్వతీరహస్యోపనిషత్తు' ప్రకారం **ఈమె** నాలుగు చేతులు కలిగి వానిలో అక్షమాల, అంకుశం, పాశం, పుస్తకం ధరించింది. కంబుకంఠి

అయిన ఈమె ముత్యాలహారం ధరించి తన భక్తుల నాలుకలపై చరిస్తుంది. ఈమె శ్రద్ధ, మేధావాగ్దేవి, విధివల్లభ, సర్వశుక్ల సరస్వతి అని అభివర్ణించబడింది. సర్వ శుక్ల సరస్వతి అయిన ఈమె మల్లెపూవు,చంద్రుడు మంచువలె తెల్లని ఛాయ కలిగి, శ్వేతాంబర ధారిణి యై, ముత్యాలదండలను, కుండలాలను ధరించి, స్ఫటిక మండలాన్ని, ముత్యాల అక్షమాలను ధరిచింది. ఆమె వాహనం హంస ఆమె శరీరం తెల్లని గంధంతో పూయబడింది. ఆమె తెల్లని వీణను ధరిస్తుంది. ఆమె అన్ని వైపులా తెల్లని పద్మాలతో చుట్టబడింది. 'తంత్రసారం'లో సరస్వతి దావాగ్ని వంటిదని పేర్కొబడింది 'ఐం' సరస్వతీ బీజాక్షరం

**5:4:1:4:** సరస్వతి మూర్తులను కొన్నిటిని లక్షణ గ్రంధాలు పేర్కొన్నాయి 'అంశుమద్భేదాగమం' ప్రకారం తెల్లని పద్మంపై గల ఈమె నాలుగు చేతులు కలది ఈమె తెల్లని వస్త్రాలను ధరించి, జటామకుటాన్ని కలిగి ఉంటుంది. ఆమె యజ్ఞోపవీతాన్ని, చెవులకు రత్న కుండలాలను కలిగి ఉంటుంది ఒక కుడి చేయి చిన్ముద్రలో ఉండగా, ఇంకొక దానిలో అక్షసూత్రం ఉంటుంది. ఎడమ చేతులలో పద్మం, పుస్తకం ఉంటాయి మూడు కన్నులు గల ఈమెను ఋషులు సేవిస్తారు.

**5:4:1:5:** 'పూర్వకారణాగమం' ప్రకారం తెల్లని శరీరాచ్ఛాయతో మూడు కళ్ళతో, సాలంకృత కర్ణాలతో, నాలుగు చేతులతో ఉన్న ఈమె తెల్లని పద్మం మీద ఉంటుందిద ఈమె నాలుగు చేతులలో మూడింట అద్దం, పుస్తకం, అక్షమాల ఉండగా, ఒక చేయి కటక ముద్రలో ఉంటుంది.

**5:4:1:6:** ధేనువాగేశ్వరి అనే ఇంకొక సరస్వతీ మూర్తిని 'అశ్వలాయన కల్పసూత్రం' పేర్కొంది. స్ఫటికంలాగ తెల్లని రంగు కలిగి, తెల్లని దండలను, వస్త్రాలను, ముత్యాలసరాలను కలిగి, అర్థ చంద్రాలంకృతమైన జటామకుటం గల ఈమెకు నాలుగు చేతులుంటాయి వానిలో అంకుశం, అక్షమాల,పాశం, పుస్తకం ఉంటాయి ఆమె చంద్రుని వంటి ముఖాన్ని, మూడు కన్నులను, బంగారు అందెలను కలది. వాగీశ్వరిని పాంచరాత్రాగమం' కూడా పేర్కొన్నది

**5:4:1:7:** ఈ రకమైన సరస్వతీ మూర్తులు యోగానికి, తపానికి, సంగీత సాహిత్యాలకు, లలితకళలకు సంకేతంగా అక్షమాలను వీణ,ను, పుస్తకాన్ని, బలుకను కలిగి ఆనందానికి మహావారధి వంటివిగా ఉంటాయి

**5:4:2: గాయత్రి :** సరస్వతి మాత్రమే కాక ఇతర మూర్తులైన గాయత్రి, సావిత్రి, సరస్వతి అనే మూడు మూల మూర్తులున్నాయి ఉదయంపూజలనందే గాయత్రి బ్రహ్మస్వరూపిణి. మధ్యాహ్నం పూజలనందే సావిత్రి రుద్రస్వరూపిణి సాయంసంధ్యలోపూజలనందే సరస్వతి విష్ణ్వంశ కలిగినది.

**5:4:2:1:** కన్య అయిన గాయత్రి రక్త వసనాలు కలిగి రక్తగంధం పూయబడి, ఎనిమిది కళ్లు నాలుగు తలలు, నాలుగు చేతులు కలది పైనకుడిచేయి, అక్షమాలకు, కిందికుడిచేయి స్రువం కలిగి ఉన్న ఈమె పద్మపీఠంమీద పద్మాసనంలో ఉంటుంది హంస ఈమె వాహనం. ఈమె ఋగ్వేద మూర్తి.

**5:4:3: సావిత్రి :**

**5:4:3:1:** తెల్లని గంధాన్ని పూసిన, తెల్లని వస్త్రాలు కలిగి యువతి అయిన సావిత్రికి నాలుగుచేతులు, నాలుగు తలలు, ఒక్కొక్క తలకు మూడు చొప్పున పన్నెండు కళ్ళు ఉంటాయి. కుడిచేత

రుద్రాక్షమాలను, ఎడమచేత అభయముద్ర గల ఈమె స్వర్ణపీఠం మీద ఉటుంది. శాంతిమయంగా కనబడిన ఈమె యజుర్వేదమూర్తి ఆవు ఈమె వాహనం.

**5:4:4: సరస్వతి :**

**5:4:4:1:** విష్ణువలె నీలిరంగును, పసుపు పచ్చ వస్త్రాలతో, ఒక తల, నాలుగు చేతులు కల మూర్తి సరస్వతి. ఈమె మూడు చేతులలో శంఖం, చక్రం, గద ఉండగా ఒక కుడిచేయి అభయముద్రలో ఉంటుంది. గరుడుడు ఈమె వాహనం. ఈమె సామవేదమూర్తి

**5:4:4:2:** ఈ రకమైన దుర్గ, మహిషమర్దిని, లక్ష్మి, భూదేవి, సరస్వతి, వంటి దేవీమూర్తులు హైందవ ప్రతిమా సాంప్రదాయాలలోను మూడవ మితిని అభివ్యక్తం చేస్తూ, ప్రతిమా రూపాలకు పరిపూర్ణత నిస్తాయి.



# 6.

# పార్శ్వ పరివారదేవతలు

**6:1: ఉపోద్ఘాతం :**

**6:1:1:** "హైందవసంప్రదాయానికి చెందిన మూల మూర్తులైన విష్ణువు, శివుడు, శక్తి అనే మూడు ప్రధాన మతాచారాల కేంద్ర దేవతల మూర్తుల స్వరూప స్వభావాలను, వైవిధ్యాలను తెలిసికొన్న తరవాత పార్శ్వ, పరివారదేవతలను గూర్చి తెలిసికోవాలి వీరు మూల మూర్తులకు ప్రతిమా పరమైన సమగ్రత్వాన్ని ఇస్తారు.

**6:1:2** పార్శ్వదేవతలు మూలవిరాట్టుకి పక్కనే సర్వకాల సర్వావస్థలలోను ఉండేవారు పరివారదేవతలు అంటే ఆయా మూల విరాట్టుకుగల పరివారం అలాంటి దాన్నే సాహిత్యపరంగా భాగవతంలో, – "హరివెంటన్‌సిరిలచ్చినవెంటనవరోధ వ్రాతమున్, దాని వెన్కను బక్షీంద్రుడు – " పోతనామాత్యులు వర్ణించారు. అంటే ఒకమూల మూర్తికి పార్శ్వమూర్తి, పార్శ్వమూర్తి తరవాత పరివారమూర్తి హరిహరమూర్తులు ఉండడం జరుగుతుంది

**6:1:3** ఈ పార్శ్వ పరివారమూర్తులనే దేవగణాలు అంటారు. ఇవి విష్ణువుకు చెందినవైతే విష్ణుగణాలని, శివుడికి చెందినవైతే శివగణాలు లేదా రుద్రగణాలు అని అంటారు. శక్తికి చెందిన వానిని శక్తిగణాలు అని, మాతృకలు అని అంటారు.

**6:1:4.** విష్ణువుకు సంబంధించి శ్రీదేవి, భూదేవి పార్శ్వమూర్తులు కాగా, ఆదిశేషువు, గరుత్మంతుడు, నారదుడు, జయుడు, విజాయుడు పరివారమూర్తులు. ఈ రకమైన పరివార మూర్తులు అవతారాలనుగుణంగా మారుతాయి. నారసింహావతారం లక్ష్మి పార్శ్వ మూర్తికాగా, ప్రహ్లాదుడు, నారదుడు, దేవగణాలు పరివారమూర్తులు, వామనావతారంలో బలి పార్శ్వమూర్తికాగా, బలిచక్రవర్తి భార్య వింధ్యావళి, శుక్రుడు, నారదుడు పరివారమూర్తులు రామావతారంలో సీత పార్శ్వమూర్తికాగా భరతుడు, లక్ష్మణుడు, శత్రుఘ్నుడు, హనుమంతుడు, నారదుడు విభీషణుడు పరివారమూర్తులు, శ్రీ కృష్ణావతారంలో రుక్మిణీ, సత్యభామలు పార్శ్వమూర్తులు కాగా, బలరాముడు ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, సాంబుడు, అర్జునుడు, జాంబవతి మొదలైన రాణులు పరివారమూర్తులు. ఈ రకంగా పార్శ్వ పరిణామ మూర్తుల పరిణామం, విష్ణుభావం పరిణమించిన రీతులను, దానికి అనుబంధితమైన వివిధ దేవాంశల స్వభావాల రీతిలో గలశైలిని సూచిస్తుంది

**6:1:5** శివుడికి సంబంధించినంత వరకు అవతారభావం చాలా తక్కువగాఉంది. కేవల మూర్తిగాను, ఆలింగన మూర్తిగాను , ఉమాసంహితమూర్తిగాను, అనుగ్రహమూర్తిగాను, సంహారమూర్తిగాను, నృత్యమూర్తిగాను, అనేక వైవిధ్యాలుగల శివుడికి పార్వతి సాధారణమైన పార్శ్వమూర్తి నంది, భృంగి, వినాయకుడు, కుమారస్వామి, వీరభద్రుడు, భైరవుడు, నారదుడు మొదలైనవారు

పరివారమూర్తులు. ఈ పరివారమూర్తులలో ఒక ప్రాముఖ్యత ఉంది. నంది, వినాయకుడు, కుమారస్వామి, వీరభద్రుడు, భైరవుడు విడివిడిగా అనేక మతాచారాలకు మూల విరాట్టులు. నంది వీరశైవానికి, వినాయకుడు గణాధిపత్యానికి, వీరభద్రుడు, భైరవుడు తాంత్రిక సాంప్రదాయాలకు అధిపతులు. ఈ రకమైన వైవిధ్యం వైష్ణవమూర్తులైన ఆదిశేషునికి గాని, గరుత్మంతునికిగాని, జయ, విజయులకు గాని లేదు. కాని ఆంజనేయుడు, బలరాముడు, ప్రద్యుమ్నుడు మొదలైన అవతార సంబంధిత పరివారమూర్తులకు ఆలయాలు నిర్మించడం, సాంగోపాంగమైన పూజలు చేయడం ఆనవాయితీగానే ఉంది.

**6:1:6** శక్తి సాంప్రదాయానికి చెందిన మూల మూర్తులైన పార్వతి, మహాలక్ష్ములకు విస్తృతమైన స్థాయిలో దేవాలయాలు నిర్మించడం జరిగింది. అలాగే సరస్వతీదేవికి ఆలయాలు అరుదు కాదు, కానీ ఎక్కువ కాదు. గ్రామదేవతల సాంప్రదాయం శివశక్తి పరివారమూర్తులకు చెందిన ఇంద్రాణి, కాళి, వారాహి మొదలైన మాతృకల విశేషంగా భావించవచ్చు.

**6:1:7** ఇన్నిరకాలుగా ఉన్న విష్ణు,రుద్ర శక్తిగణాలను పరిశీలనచేయడానికి ముందు గణపతిని పరిశీలించడం సమంజసం

## 6:2: శైవపరివార మూర్తులు

### 6:2:1: గణపతి :

**6:2:1:1:** వినాయకుడు, గజముఖుడు, ఏకదంతుడు మొదలైన పేర్లతో పిలువబడి, "గణానాంత్వం గణపతయే త్వమేవ ప్రత్యక్షం తత్త్వమసి" (నీవేగణములకు గణపతివిః నీవే ప్రత్యక్షమైన తత్త్వానివైయున్నావు) అని అభివర్ణితమైన ఈ మూర్తి పరిణామం విశేషమైనది ఒకనాడు పార్వతీదేవి అభ్యంజన స్నానం చేస్తూ నలుగు పిండితో ఒక బాలుణ్ణి చేసి స్నానమందిరముందుంచి ఎవరినీ రానివ్వద్దని ఆదేశిస్తుంది. యుద్ధం నుండి వచ్చిన శివుడు ఆ బాలుడు అడ్డగించడంతోనే ఆబాలుని తలనరుకుతాడు స్నానమందిరం నుండి వెలికి వచ్చిన పార్వతి ఆ బాలుని మృతికి మరీమరీ విలపించగా శివుడు ఆ బాలుని శరీరానికి తాను చంపిన గజాసురుని తలనతికించి మరల జీవింప చేస్తాడు. అందువల్లనే అతడు గజముఖుడయ్యాడు. (Photo 13)

**6:2:1:2** ఈ గణపతిని గూర్చి విశేషంగా, గణపత్యధర్వశీర్షంతో అభివర్ణింపబడింది. ఇతడు వక్రతుండుడు, మహాకాయుడు, సూర్యకోటి సమప్రభుడు ఇతడు.

"ఏకదంతంచ తుర్హస్తం పాశమంకుశధారిణం

రదంచ వరదంహ స్తైర్బిభ్రాణం మూషక ధ్వజం

రక్తం లంబోదరం శూర్పకర్ణకం రక్తవాసనం

రక్తగంధానులి ప్తాంగర రక్తపు ష్పైః సుపూజితం

భక్తాను కంపినం దేవం జగత్కారణ మచ్యుతం" - అని అభివర్ణించ బడ్డాడు. ఇతడు ఒక దంతంతో నాలుగు చేతులతో ఉంటాడు. నాలుగు చేతులలో పాశం, అంకుశం, మోదకం,

వరదముద్ర ఉంటాయి ఇతడు మూషిక ధ్వజుడు ఎర్రని వస్త్రం కట్టి, ఎర్రని చందనపు పూతతో, ఎర్రనిపూలతో పూజింపబడుతున్న తోరపుబొజ్జ వెడల్పైన చెవులు కలవాడు భక్తుల పట్ల దయగలవాడు; జగత్తుకు కారణమైనవాడు, చ్యుతిలేనివాడు

**6:2:1:3** గణపతి తత్వాన్ని గూర్చికూడ 'అథర్వశీర్షంలో విశేషంగా చెప్పబడింది. దాని ప్రకారం అతడే ప్రత్యక్ష తత్త్వం అతడే కర్త, అతడే భర్త, అతడే సర్వం, అతడే బ్రహ్మం, సాక్షాత్తు ఆత్మ, అతడే వక్త, అతడే శ్రోత, అతడే తూర్పు అతడే పడమర అతడే ఉత్తరం, అతడే దక్షిణం అతడే ఊర్ధ్వం, అతడే అధోభాగం, అతడే వాఙ్మయుడు. అతడే చిన్మయుడు, అతడే ఆనందమయుడు, అతడే బ్రహ్మమయుడు సర్వజగములు అతనిలోనే జన్మించి, ఉండి, లీనమవుతన్నాయి. అతడే జ్ఞానమయుడు, విజ్ఞానమయుడు అతడే భూమి, నీరు, నిప్పు,వాయువు, ఆకాశం. అతడు గుణత్రయాతీతుడు, దేహత్రయాతీతుడు, కాల త్రయాతీతుడు అతడు మూలాధారమునందుండి గాయత్రీశక్తికి మూలభూతమైనవాడు ఈ రకమైన వేదాంతత్త్వం గలగణపతి తెలుగునాట.

"తొండమునేకదంతమును తోరపు బొజ్జయు వామహస్తమున్
మెండుగ మ్రోయు గజ్జెలును మెల్లని చూపులు, మందహాసమున్
కొండక గుజ్జురూపమును కోరిన విద్యల కెల నొజ్జయై
యుండెడు పార్వతీతనయ ఓయిగణాధిప నీకుమ్రొక్కెదన్", అని చాలాపరిచయమైనవాడు.

**6:2:1:4** ఈ గణపతికి గల మూర్తులను గూర్చి వానివాని వైవిధ్యాలను గూర్చి రకరకాలుగా రూపించడం జరిగింది. బుద్ధిగణపతి, సిద్ధిగణపతి, లక్ష్మీగణపతి, నృత్యగణపతి, ఉచ్ఛిష్ట గణపతి మొదలైన వివిధ గణపతి మూర్తులు దేవాలయాలలో శిల్పాలుగాను, మూల మూర్తులుగాను తారసపడడం జరుగుతున్నది. ఆరకమైన కొన్ని రూపాలను గూర్చి ఈ కింది విధంగా వివరించవచ్చు

**6:2:1:5** **బాలగణపతి :** ఇతడు గజముఖుడు, నాలుగు చేతులున్న బాలుడు' నాలుగుచేతులలో మామిడి పండు, అరటిపండు, పనసపండు చెరకు గడ ఉంటాయి. తొండంలో వెలగపండు ఉంటుంది. ఈ మూర్తి రంగు ఉదయించే భానుని రంగు

**6:2:1:6:** **భక్తివిఘ్నేశ్వరుడు :** శరచ్చంద్రుని రంగుతో నాలుగు చేతులు గల ఈ మూర్తి చేతులలో నారికేళం, మామిడి పండు, చక్కెర పాయసాన్నం పాత్ర ఉంటాయి.

**6:2:1:7:** **వీరవిఘ్నేశుడు:** రక్తవర్ణుడైన ఈ మూర్తి పదహారు చేతులు కలవాడు వానిలో వేతాళం, శక్తి, ధనుర్బాణాలు, కత్తి డాలు, ముద్గరం, గద, అంకుశం, పాశం, శూలం, కుంతం, పరశువు ధ్వజం ఉంటాయి

### 6:2:1:8: శక్తిగణపతులు

**6:2:1:8:1** **లక్ష్మీగణపతి :** అఘోర శివాచార్యుల, 'క్రియాక్రమద్యోతీ ప్రకారం తెల్లని రంగుగల ఈ మూర్తి ఎనిమిది చేతులు కలవాడు. వానిలో చిలుక, దానిమ్మపండు, పద్మం, రత్నభూషిత స్వర్ణకలశం, అంకుశం, పాశం, కల్పకలత, బాణవృక్షపు మొగ్గ ఉంటాయి. కాని 'మంత్రోదధి', ప్రకారం ఈ మూర్తికి మూడు కన్నులు, నాలుగు చేతులు ఉంటాయి మూడు చేతులలో రెండింట

దంతం చక్రం ఉండగా, వేరొకటి అభయముద్రలోను, మరొక్కటి లక్ష్మి సమావాగనంలోను ఉంటుంది ఈ మూర్తి బంగారు రంగులో ఉంటాడు.

**6:2:1:8:2 ఉచ్ఛిష్టగణపతి :** కామితార్థప్రదుడు (కోరినకోర్కెలు తీర్చేవాడు) అయిన ఈ మూర్తిని నేటికీ అందరూ పూజిస్తారు. "ఉత్తర కామికాగమం ప్రకారం నల్లనిరంగుతో, రత్నమకుటాన్ని ధరించి, మూడు కళ్ళున్న ఈ మూర్తి, అసీనమూర్తి, నాలుగు చేతులు కలవాడు. మూడింట పాశం, అంకుశం, చెరకుగడ ఉండగా ఇంకొక చేయి తన తొడ మీదగల నగ్న దేవీమూర్తి మర్మస్థానాన్ని చేరి ఉంటుంది. ఈ రకమైన దేవీమూర్తిని విఘ్నేశ్వరి అంటారు. 'క్రియా క్రమద్యోతి, 'మంత్రమహార్ణవం', ఈ మూర్తిని వేర్వేరుగా వర్ణించాయి. 'క్రియాక్రమద్యోతీ ప్రకారం ఈ మూర్తి ఆరుచేతులు కలిగి వానిలో ఐదింట పద్మం, దానిమ్మపండు, వీణ, ధాన్యం, అక్షమాల ధరించి మిగిలిన ఒక దానితో స్త్రీమూర్తిని తాకుతాడు 'మంత్రమహావర్ణం' ప్రకారం ఈ రకమైన స్త్రీమూర్తిగల గణపతి ఎర్రని రంగుతో, పద్మాసనంలో ఉండి చేతిలో బాణం, అంకుశం, పాశం, ధనస్సు కలిగి ఉంటాడు విశేషంగా పదిచేతులు గల ఒక ఉచ్ఛిష్ట గణపతి మూర్తిని శ్రీశైలం పడమటి ప్రకారం మీద చెక్కిన దానిని "దశభుజ లక్ష్మీగణపతి' అని స్థానికులు పిలుస్తున్నారు.

**6:2:1:8:3: మహాగణపతి :** రక్తవర్ణుడైన ఇతడు పది చేతులు కలవాడు వానిలో పద్మం, దానిమ్మ, రత్నవేష్టిత కలశం, గద, దంతం, చెరకుగడ, ధాన్యం, పాశం, ఉంటాయి. ఇతనితోగల శక్తి తెల్లని దై పద్మాన్ని ధరించి అతని తొడలపై ఉంటుంది.

**6:2:1:8:4 ఊర్ధ్వగణపతి :**బంగారు పచ్చనిరంగుగల ఈ మూర్తి ఆరు చేతులు కలవాడు ఐదుచేతులలో కలువ ధాన్యం, చెరకుగడ విల్లు, బాణం, దంతం ధరించి ఒక చేతిలో తన తొడపై గల మెరపుతీగవంటి శక్తిని కౌగిలించుకొంటాడు

**6:2:1:8:5 పింగళగణపతి :** ఆరుచేతులుగలవాడు ఈ మూర్తి వానిలో మామిడిపండు, కల్పకపుష్పాలు, చెరకుగడ, ఆవాలు, మోదకం, పరాశువు ధరించి, పక్కన లక్ష్మిని కలిగి ఉంటాడు.

**6:2:1:8:5:1** లక్ష్మిగణపతి నుంచి పింగళ గణపతివరకు గల మూర్తులను శక్తిగణపతి అని వ్యవహరిస్తారు

**6:2:1:9 హేరంబ గణపతి :** బంగారు పచ్చని రంగు గల ఈ మూర్తి ఐదుగజముఖాలు కలవాడు నాలుగు వైపుల నాలుగు ముఖాలుండగా అన్నిటికన్న పైన వేరొక ముఖం ఉంటుంది. సింహం మీద ఉన్న ఈ మూర్తి ఎనిమిది చేతులు కలవాడు వానిలో ఆరింట పాశం, దంతం, అక్షమాల, పరాశువు, మూడుతలల ముద్గరం, మోదకం ఉండగా మిగిలిన రెండు చేతులు వరద, అభయముద్రలలో ఉంటాయి

**6:2:1:10: ప్రసన్న గణపతి :** పద్మపీఠం మీద త్రిభంగిమలో గాని, సమ భాగంలోగాని ఉన్న ఉదయించే సూర్యుని రంగుగల, రక్త వస్త్రం గల ఈ మూర్తి నాలుగు చేతులు కలవాడు. వానిలో రెండింట పాశాంకు శాలుండగా,మిగిలిన రెండుచేతులు అభయ, వరద ముద్రలలో ఉంటాయి.

**6:2:1:11 ధ్వజగణపతి:** ఉగ్రమూర్తి అయిన ఇతడు నాలుగు చేతులు కలిగివానిలో పుస్తకం, అక్షమాల దండం, కమండలువు కలవాడు

**6:2:1:12** **నృత్యగణపతి :** సువర్ణచ్ఛాయ కలిగి నృత్యమూర్తి అయిన ఈ మూర్తి ఎనిమిది చేతులు కలవాడు రెండు చేతులు నృత్యంలో ఉండగా మిగిలిన ఆరుచేతులలో పాశం, అంకుశం, మోదకం, కుఠారం, దంతం, వలయం, అంగుళీయకం ఉంటాయి. ఈ రకమైన మూర్తులు తరచైనవి లేదా అధికమైనవి. (ఫోటో 14)

**6:2:1:12:1** ఇవే కాక ఉన్మత్త ఉచ్ఛిష్ట గణపతి, విఘ్నరాజ గణపతి, భువనేశ గణపతి హరిద్రగణపతి మొదలైన కొన్ని ఇతరరూపాలను కూడా చెప్పడం జరిగింది

**6:2:1:13** ఇన్ని రకాల మూర్తులతో ప్రసన్న, వరద, శృంగార, ఉగ్ర, ఉచ్ఛిష్టమూర్తులను కలిగి విఘ్ననాశకుడుగాను, సిద్ధిప్రదుడు గాని చెప్పబడిన గణపతి అనేక పురాణాలలో కూడా అనేక రకాలుగా వర్ణితమైనాడు. బ్రహ్మవైవర్త పురాణం', 'శివపురాణం'వామన పురాణం వంటివి గణపతి తత్త్వానికిగల ప్రత్యేకతలను కూడా వివరించాయి. ఈ గణపతి వ్యాసుని రాయసకాడై, (Writer)' అష్టాదశపురాణాలు రచించి ఇచ్చాడని కథనం ఇతడు సత్త్వమూర్తి విద్యా, విజ్ఞాన, విభూతులను ఇస్తాడు.

## 6:2:2: నందికేశ్వరుడు :

**6:2:2:1** గణపతి తరవాత పార్శ్వ, పరివార దేవతలలో తెలుసుకో దగిన మూర్తి నందికేశ్వరుడు. సాధారణంగా వృషభమూర్తిగా అన్ని దేవాలయాలలోను కనిపిస్తున్న ఆవిర్భావాన్ని గూర్చి తెలపడానికి వివిధ ఆధారాలున్నాయి 'శివమహాపురాణం' ప్రకారం సాలంకాయుడనే ఒక ఋషి సాలవృక్షం కింది విష్ణువుకోసం తపస్సు చేస్తాడు. విష్ణువు ప్రత్యక్షంకాగానే సురుచిర, గుణ సంపన్నుడైన ఒక కుమారుడు కావాలని కోరుకొంటాడు అ కుమారుడినే నంది కేశ్వరుడు అని అంటున్నారు. 'లింగపురాణం'లో ఇంకొక కథ ఉంది శిలాదుడనే ఒక అంధుడైన ఋషిఉండేవాడు, దైవాంశ సంభూతుడైన చిరంజీవి అయిన ఒక కుమారుని పొందాలని ఇంద్రుని, శివుని, బ్రహ్మలను ఉద్దేశించి తపస్సులను, యజ్ఞాలను కొనసాగిస్తాడు యజ్ఞశాలలో నాలుగు చేతులుండి, వానిలో శూలం, టంకం, గద, వజ్రాలుండి, మూడు కన్నులు జటాయకుటం కలిగి అచ్చంగా శివుని పోలిన ఒక మూర్తి ఆవిర్భవిస్తాడు. శివుడు అతనికి 'నంది' అనే పేరును ఇస్తాడు శిలాదునితో బాటు ఆశ్రమానికి 'కుమారుడైన నంది వస్తాడు అచిరకాలంలోనే అతడు తన దివ్యత్వాన్ని పోగొట్టుకుంటాడు. అక్కడ ఆశ్రమంలో ఉన్న అతడు ఉపనీతుడయి, వేదపారంగతుడౌతాడు మిత్రడు, వరుణుడు అనే ఇద్దరు ఋషుల వల్ల గర్భాష్టమం(పుట్టిన ఎనిమిదోఏట) నంది మృతుడవుతాడని తెలుస్తుంది. ఆ విషయం తెలిసిన నంది శివుని కోసం తపస్సు చేస్తాడు' కాగా, శివుడు ప్రత్యక్షమై ఆబాలుని కౌగలించుకొని, తనమెడలోని పూలహారాన్ని ఆబాలుని మెడలో వేయగానే తిరిగి అతడు మూడు కన్నులు, పదిచేతులు గల దివ్యరూపాన్ని పొందుతాడు. అప్పుడు ...డు అతనిని చిరంజీవిగా దీవించి, తనగణాలకు అధిపతిగా చేసి, మరుద్గణజాత అయిన ...యశస్సు'ను ఇచ్చి పెండ్లి చేస్తాడు' ఈనందికేశ్వరుడు, ఎర్రనిరంగుతో, నాలుగు చేతులలో, ...డింటి త్రిశూలం, ఖింది ధరించి, ఒక దానిని తలమీద ఉంచుకొని, నాలుగవ దానితో గణాలను ...తోను, దృష్టితోను నియమిస్తాడని విష్ణుధర్మోత్తర పురాణ ప్రవచనం, భాగవత పురాణం'

ప్రకారం నందికేశ్వరుడు యజ్ఞంలో నిరసనగా మాట్లాడిన దక్షుని క్షమించలేక అణచివేసిన శివభక్తుడు ఇతడే రావణుడు వానరుల చేత మరణించగలడని శపించడం కూడా ఉత్తరరామాయణంలో చెప్పడం జరిగింది.

**6:2:2:2** నందికేశ్వరమూర్తి మానుషరూపాన్ని అధికారనంది అనే మూర్తిలో చూడగలం, పద్మాసనం పై స్థానకమూర్తిగా ఉన్న ఈ మూర్తి చంద్రశేఖరమూర్తిని పోలి ఉంటుంది. పై న గలకుడి చేయి పరశివును, ఎడమ చేయి మృగాన్ని ధరించి ఉండగా, కింది రెండు చేతులు అంజలిముద్రంలో ఉంటాయి. ఈ మూర్తి జటామకుటాన్ని, గంగను, అర్థచంద్రుని కలిగి ఉంటుంది. ఈ స్థానకమూర్తి త్రిభంగిమలో ఉండగా ఎడమ వైపు త్రిభంగిమలో సుయశన్మూర్తి ఉంటుంది ప్రసిద్ధమైన నందీ మూర్తులను లేపాక్షిహాలేబీడు హనుమకొండ మొదలైన ప్రాంతాలలో చూడగలం. ఐదుమూర్తులు గల నందికేశ్వర మూర్తిని రాయదుర్గం (అనంతపురం జిల్లా) సమీపంలో చూడగలం, వృషభరూపుడైన ఈ నందీశ్వరమూర్తినే బసవడు, బసవయ్య, బసవణ్ణ అనడం కూడా కద్దు.

**6:2:2:3** కళ్యాణకటకంలో వీరశైవమతాన్ని ప్రవచించి, ప్రోత్సహించిన మండెగమాడిగ రాజు కుమారుడైన బసవణ్ణ, నందీశ్వరుని అవతారమని 'బసవపురాణం', వంటి ఆధార గ్రంథాలు చెప్పాయి. ఈ రకంగా నందీశ్వరుడు కూడా మతాచారాలకు మూల ప్రాయమైన ఒక దేవుడు.

**6:2:3 భృంగీశ్వరుడు :** శివుని పార్శ్వదేవతలలో నంది తరువాత భృంగీశ్వరుణ్ణికూడా చెప్పడం జరుగుతుంది. భృంగీశ్వరుని పార్శ్వ దేవతలలో కాక, పరివార దేవతలలో చేర్చడం కూడా జరిగింది.

### 6:2:4 కార్తికేయుడు:

**5:2:4:1** దేవతలకు ప్రధాన సేనాధిపతిగాను, నటరాజతాండవంలో మార్దింగి కుడు గాను చెప్పబడిన కార్తికేయుడు సుబ్రహ్మణ్యస్వామి అని, కుమారస్వామి, షణ్ముఖుడు అని బహుధాపిలువడం జరిగింది. ఇతని కృత్తికలు పెంచడం వల్ల కార్తి కేయుడని, ఆరుముఖాలు ఉండడం వల్ల షణ్ముఖుడని పిలుస్తారు. తారకుడు అనే రాక్షసుని చంపడానికి గాను శివపార్వతుల వివాహం ద్వారా జన్మించిన కుమారుడే కార్తికేయుడు ఇతడు నెమలిని వాహనంగా కలవాడు

**6:2:4:2** దక్షిణ భారతదేశంలో గణపతివలనే మరింత గౌరవాన్ని, భక్తిని, అభిమానాన్ని చూరగొన్న దేవతామూర్తి కార్తికేయుడు, కాని ఉత్తర భారత దేశంలో సుబ్రహ్మణ్యస్వామి దేవాలయాలు అంతప్రాచుర్యం పొంద లేదు బెంగాలు రాష్ట్రంలో కార్తికేయుడిని అనాథలైనవారు పూజిస్తుంటారు. మహరాష్ట్రలో సుమంగళి అయిన ఏ స్త్రీ కార్తికేయుని పూజించదు.

**6:2:4:3** కార్తికేయుని గూర్చి రామాయణంలో బాలకాండ, మహభారతంలో వనపర్వం, 'కుమారతంత్రం', కాళిదాసు రచించిన 'కుమారసంభవం', వంటి కావ్యాలు సుబ్రహ్మణ్యస్వామి ఉత్పత్తిని గూర్చి, వివిధ మూర్తులను గూర్చి తెలియజేస్తున్నాయి.

**6:2:4:4** , సామాన్యంగా సుబ్రహ్మణ్యేశ్వరుని ఆలయం ఏ ఊళ్ళోనయినా తూర్పువేపున కట్టరు. ఆ ఆలయం ఏ ముఖంగా ఉన్నా అభ్యంతరం లేదు. ఈ రకమైన ఆలయం స్వయం ప్రధాన

దేవాలయంగా, తనంతట తానుగా ఉండే నిర్మాణంగా ఉండాలి. ఏడు తలలు గల గర్భ గృహం ప్రాకారం వేతగాని, మండలాకార పరిధితో గాని, మండపాలతోగాని, చుట్టబడి ఉండి,వానిలో యక్షేంద్రుడు,రాక్షసేంద్రుడు, పిశాచేంద్రుడు, భూతరాట్టు, గంధర్వులు, కిన్నరులు, దైత్యనాయకుడు, దానవాది ప్రుడు అనే ఎనిమిదిమంది పరివార దేవతలను స్థాపించడం జరుగుతుంది షణ్ముఖుడు, శక్తిపాణి, కార్తికేయుడు, గుహుడు, స్కందుడు, మయూరవాహణుడు, సేనాని, శక్తిహస్తవంతుడు అనే ఎనిమిదిమంది అంగరక్షకులను కూడా స్థాపించడం జరుగుతుంది.

**6:2:4:5** సుబ్రహ్మణ్యేశ్వరాలయంలో ఈశాన్యదిశలో స్కందచండుడు అనే మూర్తిని స్థాపిస్తారు.. స్కందచండుడికి నాలుగు లేదా రెండు చేతులు ఉంటాయి. ఆ మూర్తికి నాలుగు చేతులుంటే ముందున్న రెండు చేతులు అభయ వరద ముద్రలలో ఉండగా వెనుక ఉన్న చేతులు వజ్రాయుధాన్ని, పద్మాన్ని కలిగి ఉంటాయి

**6:2:4:6** సుబ్రహమణ్యస్వామిని ఆరుముఖాలతోను ఒక ముఖంతోను, అలాగేస్థానకమూర్తిగాను, ఆ సీనమూర్తిగాను కూడా చూడగలం కొన్ని ప్రతిమలలో కేవలం రెండు చేతులే ఉండగా, మరొకొన్నింట నాలుగుగాని పన్నెండు గాని చేతులు చూడగలం ఆసీనమూర్తిగా ఉంటే పద్మాసనంలోగాని, మయూరవాహనంపై ఉన్నట్లుగాని చూపబడుతుంటుంది.

**6:2:4:7:** సుబ్రహ్మణ్యస్వామికి ఆరుచేతులు ఉన్నట్లైతే కుడి చేతులు అభయముద్రను, ఖడ్గమును, శక్తిని, ఎడమచేతులు ఖేటకమును, అక్షమాలను కుక్కుటాన్ని ధరించి ఉండాలి. ఆ మూర్తి ఎనిమిది చేతులు కలిగిన వాడైతే ఆ చేతులలో వజ్రం, శక్తి, అభయముద్ర, వరద ముద్ర, ఖడ్గం, ఖేటకం, బాణం, ధనస్సుకాని, పద్మం, వజ్రం, శక్తి, అభయముద్ర, వరద ముద్ర, ఖడ్గం, ఖేటకం, పాశం కాని ఉంటాయి ఈ మూర్తికి పన్నెండు చేతులుకలిగి ఆరు రీతులలో చూపడం జరిగింది.

**6:2:4:8** రాజధాని నగరంలో ఉండే సుబ్రహ్మణ్యస్వామి మూర్తి ఆరు ముఖాలు, ఆరు చేతులు, పన్నెండు కన్నులు, పన్నెండు లేదా ఆరు చెవులు కలిగి చేతులలో శక్తి, ఖడ్గం, అక్షమాల, అభయముద్ర, కుక్కుటం, ఖేటకం ఉంటాయి. గ్రామంలో కాని, ప్రాసాదంలో కాని గల ఈమూర్తి పన్నెండు చేతులు కలిగి వానిలో శక్తి, ముసలం, ఖడ్గం, చక్రం, పాశం, అభయముద్ర కుడి చేతుల లోను, వజ్రంధనుస్సు, ఖేటకం, శిఖిధ్వజం, అంకుశం, వరదముద్ర ఎడమ చేతులలోను ఉంటాయి.

**6:2:4:9** 'కుమారతంత్రం'లో మొత్తం పదహారు రకాలమూర్తులు: శక్తిధరుడు, స్కందుడు, సేనాపతి, సుబ్రహ్మణ్యేశ్వరుడు, గజవాహనుడు, శరవణభవుడు కార్తికేయుడు, కుమారుడు, షణ్ముఖుడు, తారకారి, సేనాని, బ్రహ్మశాస్త్ర, వల్లీ కళ్యాణ సుందరమూర్తి, బాలస్వామి, క్రౌంచభిత్తు శిఖివాహనుడు అనే వానిని పేర్కొనడం జరిగింది 'శ్రీతత్త్వ నిధి వంటి ఆధారాలలో దీనిలోని విశేషాలను వర్ణించడం జరిగింది ' శ్రీతత్త్వనిధి'లో అగ్నిజాత సుబ్రహ్మణ్యస్వామి, సౌరభేయ సుబ్రహ్మణ్యస్వామి, గాంగేయ సుబ్రహ్మణ్యస్వామి గుహ సుబ్రహ్మణ్యేశ్వరుడు, బ్రహ్మచారి సుబ్రహ్మణ్యేశ్వరుడు, దేశిక సుబ్రహ్మణ్యేశ్వరువంటి మూర్తులను సూచించడం జరిగింది. దేవసేన,

శ్రీవల్లి ఈ దేవుని దేవీ మూర్తులు, ఇతని శక్తి ఇచ్ఛ, జ్ఞాన క్రియావంటి శక్తులపై అధికారాన్ని సూచిస్తుంది. అగ్నిజాతమూర్తికి గల రెండుముఖాలు, సౌరభేయ మూర్తికి నాల్గు ముఖాలు వంటివి అరుదైన రూపాలు దేశిక సుబ్రహ్మణ్యేశ్వరుని వంటి మూర్తినే 'మానసారంలో "శిష్యభావమూర్తి" అనే శివుని గురువైన సుబ్రహ్మణ్యమూర్తికి దగ్గరగా భావించబడుతుంది.

### 6:2:5 చండేశ్వరమూర్తి :

**6:2:5:1:** శిద్ధిని భూతగణాలకు అధిపతి అయినవారిలో చ ండేశ్వరుడొక్కడు, సాధారణంగా ప్రతి శివాలయంలోను ఈశాన్యదిశలో తప్పక ఈ చండేశ్వరమూర్తిని ఉంచడం జరుగుతుంది.

**6:2:5:2** చండేశ్వరుని దేవాలయాలు స్వతంత్రాలు, పరతంత్రాలు అని రెండురకాలు. స్వంతంత్రమైన ఈ ఆలయం ఏ దిక్కులో నైనాగాని, ఏ మూలలోగాని, నివాసస్థలాల మధ్య భాగంలో గాని ఉంచవచ్చు స్వతంత్రములైన దేవాలయాలు ఉత్తరముఖంగా ఉండరాదు. దీని ప్రాకారాలలో ఎనిమిది మంది పరివారమూర్తులను – రుద్రభక్తుడు, రుద్ర చండుడు, చండముడు, మహాబలుడు, వీర్యుడు, టంకపాణి, ఈశ సేవకుడు, రుద్ర కోపజుడు అనబడే వారిని – ఉంచడం జరుగుతుంది. వీరందరు ఊర్థ్వకాయులు, శ్వేతదేహులు, గజచర్మాంబర ధారులు, వీరాసన స్థితులు, రుద్రముఖులు.

**6:2:5:3** స్వతంత్ర చండేశ్వరమూర్తి ప్రతిమను మధ్యమద శతాళవిధముగాని, అధమ దశతాళ విధిలోగాని తీర్చిదిద్దడం జరుగుతుంది ఆగమాలలో చండేశ్వరమూర్తిని నాలుగు తరహాలుగా వర్ణించడం జరిగింది.

**6:2:5:4** **ఒకరీతిగా :** చండేశ్వరమూర్తి పద్మాసనస్తుడు; అగ్ని సదృశాముఖుడు, కలదేహుడు. శరీరంపై సర్పయజ్ఞోపవీతం ఉంటుంది. శివునికి వలె శిరస్సుమీద జటామకుటం, చంద్రకళ ఉంటాయి ఇతడికి నాలుగు ముఖాలు, నాలుగు చేతులు, పన్నెండు కళ్లు ఉంటాయి కుడి చేతులలో అక్షమాల త్రిశూలం ఉండగా, ఎడమ చేతులలో టంకం, కమండలువు ఉంటాయి.

**6:2:5:5** **రెండవరీతిగా :** చండేశ్వరమూర్తి శంఖ సదృశదేహుడు శివుడికి వలె మూడుకళ్ళు నాలుగు చేతులు, జటామకుటం, చంద్రకళకలవాడు. ఇతడిని వీరాసనంలో చూపడం జరుగుతుంది. ఇతడు వెనుక చేతులలో పినాకం అనే ధనస్సు, అమోఘం అనే బాణాన్ని కలిగి ఉండగా, ముందు చేతులు అభయముద్రలోను, వరదముద్రలోను ఉంటాయి

**6:2:5:7:** నాలుగోరీతిగా, ఇతడికి నాలుగు చేతులంటాయి మూడింటటంకం, పాశం, శూలం ఉండగా, వేరొకటి అభయముద్రలో ఉంటుంది. చండేశ్వరుని దేవిధర్మనీతి. ఆమెనల్లనిధి సర్వాభరణ భూషిత చేతులలో నిలోత్పలం గలది.

**6:2:5:8:** పరతంత్ర చండేశ్వరమూర్తిని దక్షిణ ముఖంగా, ఆలయ ఈశాన్య దిశలో ప్రథమ ప్రాకారంలో ఉంచాలి. ' కారణాగమం', ప్రకారం పరతంత్ర చండేశ్వర మూర్తి మూడు కళ్ళు, నాలుగు చేతులుగాని, రెండు కళ్లు రెండు చేతులుగాని కలిగి భీకరమైన ముఖం, జటామకుటం గలవాడు నాలుగు చేతులుంటే అభయ, వరదముద్రలలో ఉండగా, మిగిలిన రెండింటిలో

ఒకదానిలో పాశం వేరొకదానిలో పరశువు ఉండాలి. కేవలం రెండు చేతులే ఉన్నట్లైతే ఒకటి వరదముద్రలో ఉండగా వేరొకటి టంకాన్ని ధరించి ఉండాలి. తిరువొర్రియూర్, మరుదాంత నల్లూరు వంటి చోట్ల ఈ పరతంత్ర చండేశ్వరమూర్తిని చూడగలం.

**6:2:6 క్షేత్రపాలుడు.**

**6:2:6:1** వీరభద్రుడని, భైరవుడని కూడా పిలిచే క్షేత్రపాలుడు శైవపరివారమూర్తులలో ముఖ్యమైనవాడు, సాధారణంగా ఈ మూర్తిని ఈశాన్య దిశలో ఉంచి, సాంగో పాంగమైన పూజను నిర్వహించడం జరుగుతుంది ఈ క్షేత్రపాలుడు పశ్చిమ ముఖంగా ఉండడం ఉత్తమమైంది; దక్షిణముఖంగా ఉండడం మధ్యమం తూర్పుముఖంగా ఉండడం అధమం. ఇతడు ముక్కంటి, దిగంబరుడు. ఈ రకమైన ప్రతిమలు రెండుకాని, నాలుగుకాని, ఆరుకాని, ఎనిమిదికాని చేతులు కలిగి ఉంటాయి సాత్త్విక మూర్తులైతే రెండు కాని, నాలుగు కాని చేతులు కలిగి ఉంటాయి రాజసికమూర్తులు ఆరుచేతులను తామసిక మూర్తులు ఎనిమిది చేతులను కలిగి ఉంటాయి అలాగే సాత్త్వికమూర్తులు తెల్లని రంగులలోను, రాజసికమూర్తులు ఎర్రనిరంగులోను, తామసికమూర్తులు, నల్లనిరంగులోను ఉంటాయి (చూ. ఫోటో :15)

**6:2:6:2** సాత్త్వికమూర్తులలో రెండుచేతులుంటే కుడిచేత త్రిశూలం, ఎడమచేత కపాలం ఉండాలి. నాలుగుచేతులుంటే వెనుకకుడిచేత ఖడ్గం, వెనుక ఎడమచేత ఘంటకాని;శూలం, కపాలంకాని, శూలం, ఘంట కాని ఉండగా, ముందు చేతులలో ఒకటి వరదముద్రలోను, వేరొకటి అభయముద్రలోను ఉండాలి

**6:2:6:3** రాజసిక మూర్తులలో క్షేత్రపాలుడు మూడు కుడి చేతులలో త్రిశూలం, ఖడ్గం, ఘంటలను, మూడు ఎడమచేతులలో ఖేటకం, కపాలం, నాగపాశం కలిగి ఉంటాడు తామసిక మూర్తికి దీనికి తోడు ధనుస్సు కుడి చేతులలోను, బాణం ఎడమ చేతులోను ఉంచడం జరుగుతుంది

**6:2:6:4** ఈ రకమైన క్షేత్రపాలుడు పద్మపీఠంమీద సమభాగంలో ఉంచబడతాడు. ఇతడి ఎర్రని జుట్టుతో నగ్న దేహం కల వాడని 'అంశుమద్భేదాగమంలో చెప్పడం జరిగింది. 'సుప్రభేదాగమం ప్రకారం ఇతడు నాగయజ్ఞోపవీతాన్ని, కపాలమాలను శిరస్సుపైన ధరించి, నాలుగు చేతులు కలిగి దానిలో కుడి చేతులలో త్రిశూలం, ఖడ్గం, ఎడమచేతులలో కపాలం, ఖేటకం కలిగి ఉంటాడు. ఆరుచేతులైతే, దీనికి తోడు, ఇంకొక కుడి చేతనాగపాశం, ఎడమ చేతతోమరం చూపబడతాయి. ఎనిమిది చేతులైతే వేరొక కుడి చేతఢమరు, వేరొక ఎడమ చేత ఖట్వాంగాని జతపర్చబడి చూపడం జరుగుతుంది. ''కారణాగమం'', లో ఒక చిన్న సవరణ చెప్పబడింది ఎనిమిది చేతులుగల క్షేత్రపాలమూర్తి ఏడింట కపాలం, శూలం, ఘంట, పాశం, అగ్ని టంకం, ఖట్వాంగాలను కలిగి, వేరొక చేయి అభయముద్రలో ఉండాలి. అఘోరశివాచార్యుల ప్రకారం కుక్క క్షేత్రపాలకుని వాహనం.

**6:3: వైష్ణవ పరివారమూర్తులు**

6:3:1 వైష్ణవదేవాలయాలలో జయ, విజయులు, గరుత్మంతుడు, ఆదిశేషుడు, నారదుడు

ప్రధానపరివారమూర్తులు.

**6:3:2** వీరిలో జయ, విజయులు, ద్వారపాలకులు, స్థానకమూర్తులయి, నాలుగు చేతులుగల విష్ణువునుపోలి, పై చేతులలో శంఖం, చక్రాలను, కింది చేతులలో, ఖడ్గం, గదలను ధరించి కిరీటమకుటులై మూలవిరాట్టుకి ఇరువైపుల చూపడం జరుగుతున్నది.

**6:3:3** గరుత్మండుని మూర్తి మానవునిగా చూపినట్లైతే పక్షిముక్కు పక్షిరెక్కలు చూపి రెండు చేతులు అంజలి ముద్రలో ఉంచినట్లు చూపుతారు. సాధారణంగా గరుత్మంతుని ధ్వజస్తంభం దగ్గర, మూల విరాట్టుకి ఎదురుగా చూపడం జరుగుతుంది ఒక్కొక్కసారి ఈ మూర్తిని మానవరూపంలో కాక పూర్తిగా పక్షి రూపంలో చూపడం కూడా జరుగుతున్నది

**6:3:4:** ఆదిశేషుని పూర్తిగా పాముగాకాని, పడగలుగలదేవతామూర్తిగా కాని, అంజలిముద్రలో చూపడం జరుగుతుంది

**6:3:5:** నారదుడు తప్పని పరివారంలో ఒకడు. దేవర్షి అయిన ఇతడిని ఒకచేతిలో వీణను వాయిస్తున్నట్లుగాను, వేరొక చేతిలో సంకీర్తనను కొనసాగిస్తున్నట్లు చూపిస్తారు జటామకుటాన్ని కలిగి, రెండు చేతులతో ఉంటాడు

**6:3:6:** వీరేకాక విష్వక్సేనుడు, ఆంజనేయుడు, బలరాముడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, సాంబుడువంటి వివిధ వ్యూహమూర్తులు వైష్ణవదేవాలయాలలో ఉండడం జరుగుతుంది.

## 6:4: దేవీపరివారమూర్తులు

**6:4:1** దేవీపరివారమూర్తులలో సప్తమాతృకలు అతి ముఖ్యమైనవి 'వరాహపురాణం', కూర్మపురాణం' 'సుప్రభేదాగమం' వంటి ఆధారులు సప్తమాతృకలను గూర్చి వర్ణించాయి. వైష్ణవి, కౌమారి, చాముండ, బ్రహ్మాణి, 'సుప్రభేదాగమం', పేర్కొన్నది. అంధకాసుర సంహార సందర్భంగా ఈ మాతృకలను శివుడు సృష్టించాడు 'కూర్మపురాణం', 'వరాహపురాణం', పేర్కొన్నాయి ఈ ఏడింటి లక్షణాలను ఈ కింది విధంగా వర్ణించవచ్చు

**6:4:2: బ్రహ్మాణి:** నాలుగు ముఖాలు నాలుగు చేతులు కల ఈమె స్వర్ణచ్ఛాయను కలిగి, ఎర్రని పద్మం పై ఉండి హంసను వాహనంగాను, ధ్వజంగాను కల్గినదని, 'అంశుమద్భేదాగమం'లో పేర్కొనడం జరిగింది ఈమె వెనుక కుడి చేతిలో శూలం, వెనుక ఎడమచేత అక్షమాల ఉండగా, ముందు కుడి చేయి అభయముద్రలోను, ముందు ఎడమ చేయి వరద ముద్రలోను ఉంటాయి. కరండమకుటంగల ఈమె పలాశ వృక్షం కింది కూర్చుని ఉంటుంది కాని 'విష్ణుధర్మోత్తపురాణం', ప్రకారం ఈమె ఆరు చేతులు కలది ఎడమచేతులలో అభయముద్ర, పుస్తకం, కమండలం, కుడిచేతులలో వరదముద్ర, సూత్రం, స్రువంఉంటాయి ఈమె కృష్ణాజినం ధరించి ఉంటుంది.

**6:4:3** వైష్ణవి నాలుగు చేతులు కలవైష్ణవి అందమైన ముఖం, సుందరమైన వక్షం, కన్నులు, నీలివర్ణం కలది. ఆమె పసుపుపచ్చని వస్త్రాలను, కిరీటమకుటాన్ని కలిగి ఉంటుంది ఈమె సర్వాభరణ భూషిత ఈమె ధ్వజమూ, వాహనమూ కూడా గరుత్మంతుడే. రాజవృక్షచ్ఛాయకింది ఉన్నట్లు చూపించే ఈమె కుడిచేతులు చక్రం, అభయముద్రను, ఎడమ చేతులు శంఖం,

వరదముద్రను కలిగి ఉంటాయి.' విష్ణు ధర్మోత్తర పురాణం 'ప్రకారం బ్రహ్మాణివలెనే ఈమెకు ఆరు చేతులుంటాయి. కుడిచేతులలో గద, పద్మం, అభయముద్ర, ఎడమచేతులలో శంఖం, చక్రం, వరదముద్ర కలిగిఉంటాయి ఈమె నాలుగు చేతులు మాత్రం కలిగి శంఖం, చక్రం, గద, పద్మాలను ధరించి ఉంటుందని, 'దేవీపురాణం'లో పేర్కొనడం జరిగింది. ఆమె విష్ణువు వలెనే వనమాలను కూడా ధరించిఉంటుందని 'దేవీపురాణం', 'పూర్వకారణాగమం,'పేర్కొంటున్నాయి.

**6:4:4 ఇంద్రాణి:** ఎర్రని రంగుతో, సర్వాభరణ భూషిత యైన ఇంద్రాణి మూడు కన్నులు నాలుగు చేతులు కలది. ఆమె చేతులలో రెండింట వజ్రం, శక్తి ఉండగా, మరి రెండుచేతులు అభయ, వరద ముద్రల్లో ఉంటాయి కల్పకవృక్షఛాయలో ఉండే ఈమె ధ్వజం, వాహనం కూడా ఏనుగే. ఈమెకు కిరీటమకుటం ఉంటుంది 'విష్ణుధర్మోత్తర పురాణం' ప్రకారం ఈమెకు బంగారు ఛాయతో ఉన్న శరీరం, వేయికన్నులు ఆరుచేతులు ఉంటాయి. నాలుగు చేతులలో సూత్రం, వజ్రం, కలశం, పాత్ర ఉండగా మరి రెండుచేతులు అభయ, వరదముద్రల్లో ఉంటాయి 'దేవీపురాణం' ఈమె ఆంకుశాన్ని, వజ్రాన్ని మాత్రం 'ధరించినట్లు, 'పూర్వకారణాగమం 'ఈమె పద్మాన్ని కలిగి రెండు కళ్ళతో ఉన్నట్లు పేర్కొనడం జరిగింది

**6:4:5 చాముండ:** ఎర్రనిరంగు, మూడుకళ్ళు, నాలుగుచేతులుగల చాముండ కపాలయజ్ఞోపవీతాన్ని కలిగి, పద్మాసనంపై, వ్యాఘ్రాజినం ధరించి అత్తి వృక్షచ్ఛాయల్లో ఉంటుంది. ఈమె చేతులలో రెండింటి శూలం, కపాలం ఉండగా మరిరెండు అభయ, వరద ముద్రల్లో ఉంటాయి. 'విష్ణుధర్మోత్తరపురాణం' ప్రకారం ఈమె శవవాహన, చేతులలో ముసలం, కవచం, బాణం, అంకుశం, ఖడ్గం, ఖేటకం, పాశం, ధనస్సు, దండం పరాశువు ఉంటాయి. కాని 'పూర్వకారణాగమం,' ప్రకారం ఈమె వాహనం గుడ్లగూబ; ధ్వజం గద్ద, ఎడమ చేతులలో మాంసఖండాలతో ఉన్న కపాలం, అగ్ని, కుడిచేతులో సర్పం, అభయముద్ర చూపబడతాయి.

**6:4:6: మహేశ్వరి :** ఈమె వృషభవాహనం నాలుగు చేతులు కలిగి రెండింట శూలం, అక్షమాలను, రెండింట వరద, అభయ ముద్రలను కలిగి ఉంటుంది.' విష్ణుధర్మోత్తర పురాణం' ప్రకారం మూడేసి కళ్ళుగల ఐదుముఖాలు, ఆరుచేతులను - వానిలో సూత్రం, డమరు, శూలం, ఘంట, అభయముద్ర, వరదముద్రలను - కలిగినది ఈమె ఈమె జటామకుటాన్ని వృషభధ్వజాన్ని కలది.

**6:4:7 కౌమారి :** కుమారుని స్త్రీమూర్తియే కౌమారి నాలుగు చేతులు గల ఈమె వానిలో శక్తిని, కుక్కుటాన్ని, అభయముద్రను, వరద ముద్రను కలిగి ఉంటుంది. ఈమె వాహనం, ధ్వజం, - రెండూ, నెమలి ఈమె నివాసం ఉదుంబరమనే అత్తిచెట్టు. 'విష్ణుధర్మోత్తరం' ప్రకారం ఈమెకు ఆరు ముఖాలు, పన్నెండు చేతులు ఉండి, వానిలో రెండింట అభయ ముద్ర, వరదముద్రలు, పదింట శక్తి, ధ్వజం, దండం, ధనస్సు, బాణం, ఘంట, పద్మం, పరశువు చూపబడతాయి. దేవీపురాణం' ప్రకారం ఈమె ఎర్రని పూలను ధరించినది. 'పూర్వకారణాగమం'ప్రకారం ఈమె కుక్కుటానికి బదులుగా అంకుశాన్ని ధరించినది.

**6:4:8వారాహి :** వరాహ ముఖంతో మేఘచ్ఛాయను గల ఈమె కరండమకుటాన్ని ధరించినది.

కల్పవృక్షఛ్ఛాయలో ఉండే ఈమె హలాన్ని, శక్తి ని ధరించి ఉంటుంది. ఈమెకు వాహనం ఏనుగు, ధ్వజం. కాని "విష్ణుధర్మోత్తరం ' ప్రకారం ఈమె ఆరుచేతులు, పెద్ద కడుపు కలది రెండు చేతులు అభయవరదముద్రలలో ఉండగా మిగిలినవి నాలుగు చేతులలో దండం, ఖడ్గం,ఖేటకం పాశాలు ఉంటాయి. 'పూర్వకారణాగమం' ప్రకారం ఈమె శార్ఙధనుస్సును, హలాన్ని, ముసలాన్ని ఆయుధాలుగా కలది, నూపురాలను కలది.

**6:5: ఇతర పరివారమూర్తులు**

శైవ, వైష్ణవ,దేవీ, పరివారమూర్తులే కాక ఇతరపరివారమూర్తులను కూడ చూడగలం, వారు బ్రహ్మ దిక్పాలకులు, నవగ్రహాలు, గంధర్వులు, యక్షులు, కిన్నరులు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు వంటివారు వారిని కూర్చి ఈ కింది విధంగా వివరించవచ్చు

**6:5:1 బ్రహ్మ :**

**6:5:1:1** శైవదేవాలయల్లోను, విష్ణాలయాల్లోను ప్రధానంగా మొదటి ప్రాకారపరివార దేవతల్లో అతి ముఖ్యుడై నిత్యపూజలందుకొనేవాడు, బ్రహ్మ, 'రూపమండనం', 'శిల్పరత్నం,' విష్ణుపురాణం' వంటి ఆధార గ్రంధాలు బ్రహ్మను గూర్చి పేర్కొంటున్నాయి.

**6:5:1:2** ఒక బంగారు గుడ్డు నుంచి జన్మించి హిరణ్య గర్భుడని, విష్ణువు నాభికమలనుంచి జన్మించి పద్మ గర్భుడని పిలువబడిన బ్రహ్మ అత్రిమహర్షికి, అనసూయకు దత్తాత్రేయులవారి అంశంగా ఆవిర్భవించాడు ఇతడు దక్షుడు మొదలైన ప్రజాపతులకు తండ్రి, త్రిపురాసుర సంహార సందర్భంగా శివుడికి రధసారధిగా వ్యవహరించినవాడు బ్రహ్మ. బ్రహ్మ విష్ణునితో బాటు తన గొప్పదనం విషయంలో పోటీ పడగా శివుని లింగోద్భవమూర్తి రూపంలో అవతరించి బ్రహ్మ ఔన్నత్యాన్ని లేదని రుజువు చేయడం జరిగింది

**6:5:1:3:** 'రూపమండనం', ప్రకారం నాలుగు వేదాలకు, నాలుగు యుగాలకు నాలుగు వర్ణాలకు బ్రహ్మసంకేతం, పంచముఖుడైన బ్రహ్మ శివునిచేత ఒకతల కోల్పోయి చతుర్ముఖుడుగా ఉన్నాడు. పద్మాసనంపై గాని, కూర్చాసనంపై గాని, పద్మపీఠంపై గాని బ్రహ్మను అసీనమూర్తిగాను, స్థానక మూర్తిగాను కూడా చూపడం జరుగుతుంది జటామకుటాన్ని యజ్ఞోపవీతాన్ని, కటిసూత్రాన్ని కల బ్రహ్మ కృష్ణాజనాన్ని ధరించి ఉంటాడు. శిల్పరత్నం ప్రకారం బ్రహదేహచ్ఛాయతెలుపు.కాని విష్ణుపురాణంలో ఎర్రనిదిగా పేర్కొన్నది

**6:5:1:4** నాలుగు చేతులు కల బ్రహ్మను కుడిచేతులలో అక్షమాలను కూర్చను, ఎడమ చేతులలో కుశాంకురాలను కమండలవును ధరించినట్లు, కుడిచేతులలో (సుక్, స్రువాలను, ఎడమ చేతులలో ఆజ్యస్థాలి, కుశాంకురాలను; వెనుక చేతులలో అక్షమాల, కమండలువులను ధరించి, ముందు చేతులు అభయ, వరద ముద్రలలో ఉన్నట్లు, కుడిచేతులలో అక్షమాల, స్రుక్కులను, ఎడమచేతులలో పుస్తకం, కమండలువులను ధరించినట్లు నాలుగు ప్రధాన రకాలుగా చూపడం జరిగింది

**6:5:1:5** 'విష్ణు పురాణం' ప్రకారం బ్రహ్మ కళ్ళు ధ్యానోన్మీలితాలయి ఉండగా, 'రూపమండనం',

ప్రకారం అతడు గడ్డం కలవాడు 'విష్ణుపురాణం ప్రకారం ఏడు హంసల రథంపై ఉండే బ్రహ్మకుడిఎడమల సరస్వతి, సావిత్రి అనే ఇద్దరు దేవతలతో ఉంటాడు.

**6:5:1:6** కేవలం బ్రహ్మకు మాత్రం కేటాయించిన దేవాలయంలో అతనిని 'విశ్వకర్మ' అనే పేరిట పూజిస్తారు శ్రీశైల దేవాలయ ప్రాంగణంలో తూర్పు ప్రాకరంపై ధక్షిణదిశలో 'విశ్వకర్మ దేవర' అనే పేర ప్రత్యేక దేవతామూర్తిని చెక్కి ఉండటం విశేషంకాని ఆమూర్తి బ్రహ్మవలె చతుర్ముఖుడు కాక, ఒకే ముఖం, నాలుగు చేతులు కలిగి పద్మాసనం మీద ఉన్నవాడు, బ్రహ్మదేవాలయంలో ప్రదక్షిణంగా ఎనిమిది దిక్కులలోను ఆదిశేషుడు, గణేశుడు, మాతృకలు, ఇంద్రుడు, జలశాయి, పార్వతి, రుద్రుడు, నవగ్రహాలు, లక్ష్మి అనే పరివారమూర్తులు ఉండడం కద్దు. బ్రహ్మదేవాలయానికి సత్యుడు, సధర్ముడు, ప్రియోధ్భవుడు, యజ్ఞుడు, విజయుడు, యజ్ఞభద్రుడు, సర్వకామికుడు, విభవుడు అనే ఎనిమిదిమంది ద్వారపాలకులున్నట్లు పేర్కొనడం జరిగింది.

## 6:5:2: దిక్పాలకులు

### 6:5:2:1 ఇంద్రుడు

**6:5:2:1:1:** ఇంద్రుడు తూర్పుదిక్కుకు అధిపతి వైదిక సంహితలైన 'తైత్తిరీయ సంహిత, 'శతపథబ్రాహ్మణం' వంటి ఆధారలు విశేషంగా ఇంద్రుని పేర్కొన్నాయి. ఇతడు యజ్ఞపురుషుడైన విష్ణువుతో సర్వాధిపత్యానికి పోటీపడతాడు ఋగ్వేదంలో ఇతడిని పురందరుడని అభివర్ణించడం జరిగింది. ఇతడు వజ్రాన్ని ఆయుధంగా కలవాడు ఇతని వాహనం ఐరావతం అనే తెల్లని ఏనుగు. ఇతనిదేవిక శచీదేవి, వైదిక వృత్తాంతం ప్రకారం దేవతలకు, దానవులకు మధ్య జరిగిన పోరాటంలో దానవుల విజయానికి గల కారణం కేవలం వారు రాజును కలిగి ఉండడం వల్లనే అని గుర్తించి, దేవతలు తమకు వరుణున్ని రాజుగా చేసుకొన్నారు. అయినప్పటికీ దేవతలు పరాజయం పొందడం వల్ల వారు వరుణున్ని ఉద్వాసించి, ఇంద్రుని తమకు రాజుగా అభిషేకిస్తారు. ఆతరువాత జరిగిన యుద్ధంతో దానవులు ఓడిపోవడంవల్ల ఇంద్రుడు దేవతల అధిపతిగా అందరి గుర్తింపును పొందుతాడు. ఇతని వజ్రం దధీచి వెన్నముక నుంచి త్వష్టప్రజాపతిచే తయారుచేయబడుతుంది. ఇతడు గౌతముని భార్యఅయిన అహల్యను కామించి ఆమెపైన తన మోహాన్ని వ్యక్తపరచినప్పుడు ఆమె భర్తఅయిన గౌతముని శాపం వల్లవేయి కన్నులు గలవాడుగా మారిపోతాడు. ద్వాపర యుగంలో కుంతిభోజుని కుమార్తె అయినకుంతీదేవి ఇంద్రునివరం వల్ల అర్జునుణ్ణి కుమారుడుగా పొందుతుంది. ద్వాపరయుగంలో ఇంద్రునికోసం యాదవులు జరిపే ఇంద్రయాగాన్ని శ్రీకృష్ణుడు ఆపివేసి, ఇంద్రుడు కురిపించిన రాళ్ళవానను, గోవర్ధనపర్వతం ఎత్తిగోపకులాన్ని, గోవులని రక్షించడం ద్వారా ఇంద్రునికి గర్వభంగం కలిగిస్తాడు 'శిలప్పాదిగారం' వంటి ప్రసిద్ధతమిళ కావ్యంలో వైశాఖ పౌర్ణమినాటి నుంచి ఇరవై ఎనిమిది రోజులపాటు చోళుల రాజధాని అయిన కావేరీ పట్టణంలో ఇంద్రయాగం జరిపేవారని అభివర్ణింపబడింది మేఘాలు వర్షానికి ఆధారం గనుక, ఇంద్రుడు మేఘాలకు అధిపతి గనుక వ్యావసాయిక ప్రధానమైన భారత సంస్కృతిలో ఇంద్రయాగం చేయడం కొనసాగుతూ వచ్చింది. అలాగే దేవాలయాలలో ఇంద్రుని ప్రతిమలను నెలకొల్పడం జరిగింది.

**6:5:2:1:2** 'అంశుమద్భేదాగమం', 'విష్ణుధర్మోత్తపురాణం', బృహత్సంహిత వంటి ఆధార గ్రంధాలు ఇంద్రుని ప్రతిమా లక్షణాలను గూర్చి పేర్కొన్నాయి. 'అంశుమద్భేదాగమం' ప్రకారం నల్లని ఇంద్రుని దేహం రెండు కన్నులను, రెండు చేతులను కలిగి ఉండాలి. కిరీటకుండలాలు, కేయూరాలు, హారాలు వంటి ఆభరణాలు ఇంద్రుని శరీరాన్ని సర్వాంగసుందరంగా చేయాలి. ఇతని శరీరం రక్తవస్త్రాన్వితం కావాలి. కుడిచేతిలో శక్తిని, ఎడమచేత అంకుశాన్ని ధరించి ఉండాలి. ఇతడిని సింహాసనం మీద కాని, ఐరావతం మీద కూర్చొన్నట్లు కాని చూపించాలి ఇంద్రుని ఎడమ వైపున సర్వాభరణ భూషితయై, ఒకచేత ఉత్పలాన్ని ధరించిన సుందరాంగి అయినా ఇంద్రాణిని చూపాలి. వీరికి రెండువైపుల చామర గ్రాహిణులైన గంధర్వ స్త్రీలు ఉండాలి. ' విష్ణుధర్మోత్తర పురాణం' ప్రకారం ఇంద్రాణి ఇంద్రుని ఎడమతొడపై ఆసీన అయి ఉండాలి. ఇంద్రాణి స్వర్ణచ్ఛాయను కలిగి ఉండాలి. ఒకచేత ఇంద్రుని ఆలింగనం చేసికొంటూ, వేరొకచోట సంతానమంజరిని ధరించి ఉండాలి. కొన్ని ఇతర ఆధారాలు ఇంద్రుడు శ్వేత వర్ణుడని, వజ్రాంకుశాలు ధరించి ఉండాలని, ఇంద్రుని వాహనమైన ఐరావతం నాలుగు కుంభాలు కలిగి ఉండాలని కూడా అభివర్ణించాయి. కాని ప్రధానంగా 'అంశుమద్భేదాగమం'లోని నియమాలే ప్రాచుర్యాన్ని పొందాయి.

**6:5:2:2: అగ్ని**

**6:5:2:2:1** ఆగ్నేయ దిక్కుకు అధిపతి అయి, యజ్ఞాలకు ముఖంగాను, దేవతలందరికీ మాధ్యమంగాను యజ్ఞకర్మలు చేసేవారు పూజించే అగ్నికి వాహనం గొర్రెపోతు. ఇతని దేవి స్వాహాదేవి. అందుకనే యజ్ఞకర్మలలో యజనము చెప్పే ప్రతి మంత్రం చివర 'స్వాహా' అని ఉచ్చరిస్తారు ప్రాచీనాచారాల ప్రకారం అగ్ని ఆరని ఇంట్లో సంపదలు తొలగవనే భావన ఉండేది. అందువల్లనే నిత్యం అగ్నిపూజ చేయడం ద్విజులు విధిగా భావించేవారు భూమిలో నిప్పుగాను, అంతరిక్షంలో మెరుపుగాను, ఆకాశంలో సూర్యుడుగాను ప్రకాశిస్తూ ఏకత్వాన్ని గల ఈ మూర్తిని రాను రాను రుద్రుడని, శివుడని కూడా అభివర్ణించి,కార్తికేయుడికి తండ్రిగా కూడా భావించడం జరిగింది పంచాగ్ని విద్య అనే సాంప్రదాయిక భావన ప్రకారం ఆకాశంలోని మెరుపు నీటి ద్వారా భూమిలో కలిసి, వృక్ష సంబంధమైన ఆహారం ద్వారా వీర్యంగామారి స్త్రీలో కలిసి శుక్ల శోణితాల సంయోగంతో సృష్టికి కారణభూతమవుతుంది అలాగే ప్రతి ప్రాణి మృతి పిదప కట్టెలతోను, అగ్నితోను కలసి భస్మంగా మారి నీటిలో కలిసి వాయువుద్వారా తిరిగి ఆకాశంలో చేరడం జరుగుతుంది ఈ రకమైన భావన అగ్నికి గల శౌచాన్ని, ప్రాముఖ్యతను సూచిస్తున్నది. 'హరివంశం' ప్రకారం నీలి దుస్తులు ధరించిన అగ్ని జ్వాలా కేశుడు అతని రథం ఎర్రని గుర్రాలతో లాగ బడుతుంది గాలి అతని రథానికి చక్రాలు

**6:5:2:2:2** కాని ఆగమాలలో అగ్నిని గూర్చిన వర్ణన వేరొక విధంగా ఉంది. అగ్ని ఎర్రని దేహం కలవాడు. నాలుగు చేతులు, మూడు కన్నులు, రక్త కేశాలు కలవాడు. అతడు పొట్టేలు వాహనంగా కలవాడు. అతని ముందు చేతులు వరముద్రను, అభయముద్రను కలిగి ఉండగా, వెనుకకు కుడిచేయి స్రుక్కును, వెనుక ఎడమచేయి శక్తిని కలిగి ఉండాలి. అగ్నిశ్మశ్రువులను, యజ్ఞోపవీతాన్ని కూడా కలిగి ఉండాలి. చేతులలో అక్షమాలను, కమండలువులను ధరించి ఉండాలి. కాని

'విష్ణుధర్మోత్తరపురాణం' ప్రకారం అగ్ని కుడిచేతులలో జ్వాలలను, త్రిశూలాన్ని ధరించి ఒక ఎడమ చేతిలో త్రిశూలాన్ని కలిగి ఉండి, ఇంకొక ఎడమ చేతితో తన భార్య అయిన స్వాహాదేవిని ఆలింగనం చేసుకొని ఉండాలి దాని ప్రకారమే అగ్ని దంతాలను (కోరల వంటి వానిని) కలిగి ఉండాలి అతని రథాన్ని నాలుగు చిలకలు లాగాలి. పొగ అతని ధ్వజం, వాయువు రథ సారథి.

**6:5:2:3** అతని భార్య అయిన స్వాహాదేవి ఎర్రని వస్త్రాలు ధరించి ఉండాలి. కుంకుమను కలిగి, రత్నపాత్రను దాల్చి ఉండాలి

**6:5:2:4:** అగ్ని పసుపు పచ్చని రంగులో, స్వర్ణచ్ఛాయగల కేశాలను, పసుపు పచ్చని కన్నులను కలిగి చేతులలో అక్షమాలను, శక్తిని ధరించి, అర్ధ చంద్రాసనంలో. చూపబడాలని ఇంకొక ఆధారం పేర్కొన్నది.

**6:5:2:3: యముడు**

**6:5:2:3:1:** ఇతడు దక్షిణ దిక్కుకు అధిపతి ఋగ్వేదం ప్రకారం వివస్వతుడికి. త్వష్టప్రజాపతి కుమార్తె అయిన శరణ్యుకు జన్మించిన యముడిని వైవస్వతుడని వ్యవహరించడం జరిగింది నరక లోకానికి అధిపతిగా గుర్తించబడ్డ యముడు పాప కర్మలను శిక్షించేవాడు, మరణ కారకుడు. ఇతని భార్య శ్యామలాదేవి. ఇతని వాహనం దున్నపోతు ద్వాపర యుగంలో కుంతిభోజుని కుమార్తె అయిన కుంతీదేవికి వరం ఇవ్వడం ద్వారా పాండవులలో పెద్దవాడయిన ధర్మరాజు జన్మిస్తాడు. ఋగ్వేదంలో చెప్పబడిన "అగ్నింమిత్రం యమంవరుణ మాహురథోసనుపర్ణో గరుత్మాన్" అనే ఋక్కు ప్రకారం యముడు ఇతర దేవతలైన అగ్ని, సూర్యుడు, వరుణుడు, సుపర్ణుడు వంటి వారితో సమానమైన గౌరవాన్ని పొందాడని తెలుస్తుంది.

**6:5:2:3:2** కొన్ని సంస్కృత గ్రంథాల ప్రకారం : యముడు మేఘం వంటి నల్లని రంగు గలవాడు. రెండు చేతులు, రౌద్రమైన కన్నులు, కోరలు కలవాడు అతడు కిరీట మకుటాన్ని, ఎర్రని పూలమాలను, రక్త చందనాన్ని, రక్త వస్త్రాలను కలిగి ఉండాలి అతడు ఖడ్గాన్ని, ఖేటకాన్ని గాని, ఫలాన్ని, చివుళ్ళను గాని, లేక దండాన్ని పాశాన్ని గాని కలిగి ఉండాలి యముడికి రెండువైపుల మృత్యువు,సంహితలు నిలబడి ఉండగా, చామర గ్రాహిణులైన ఇద్దరు స్త్రీలు ఉండాలి. ద్వారం దగ్గర చిత్రగుప్తుడు, కాళి, ముందుగా అధర్మం, ధర్మం అనే ఇద్దరు బ్రాహ్మణులు ఎర్రని బట్టలలో ఉండాలి. యముడిని దేవతలు, అసురులు, ధార్మికులు,పాపులు చుట్టి ఉంటారు.

**6:5:2:3:3** కాని, 'విష్ణుధర్మోత్తర పురాణం' యముని మూర్తిని వేరొక విధంగా సూచించింది. పసుపు పచ్చని రంగు వస్త్రాలు ధరించిన యముని ఎడమ తొడపై నీలోత్పలాన్ని ధరించిన అతని సతి 'ధూమోర్ణ' ను చూపాలి. యముడు నాలుగు చేతులను, అతని దేవి రెండు చేతులను కలిగి ఉండాలి యముడు కుడి చేతులలో దండం, ఖడ్గంలను, ఎడమ చేతులలో త్రిశూలం, అక్షమాలను ధరించి ఉండాలి 'ధూమోర్ణ' కుడిచేయి యముని ఆలింగన ముద్రలో చూపబడగా,ఎడమ చేత వెలగ పండు ఉండాలి యముడికి కుడివైపున చిత్రగుప్తుడు, అపీచ్యవేషంలో ఉండాలి. అపీచ్యవేషం అంటే పాశ్చాత్య వస్త్రధారణ అని గోపీనాథరావు పేర్కొన్నారు. యముడికి ఎడమవైపున కాలమూర్తి పాశధారియై, రౌద్రస్వూరితో చూపబడాలి.

**6:5:2:4 నిరుతి :**

**6:5:2:4:1:** నైరుతీ దిశకు ఇతడు అధిపతి. వేదకాలం నుండీ పరిచయమైనా ఎక్కువ సమాచారం ఇతనిని గూర్చి అందడం లేదు. ఇతడు అలక్ష్మి లేదా జ్యేష్టాదేవి అనే రాక్షసుని అంశం.

**6:5:2:4:2:** నీలంరంగు కలిగి, పసుపు పచ్చని వస్త్రాలు ధరించి, భద్రపీఠం పైన గాని, సింహం పైన గాని, మానవుని భుజాలపై గాని ఉన్నవాడు నిరుతి. కాని 'విష్ణుధర్మోత్తర పురాణం' నిరుతిని గూర్చి వేరొక వర్ణనను ఇస్తుంది. చేతిలో దండాన్ని ధరించి గాడిదను వాహనంగాగల నిరుతి రౌద్రమైన ముఖం, కన్నులు, కోరలు గలవాడు ఇతడు సర్వాలంకార భూషితుడు. రాక్షస, అప్సరోగణ పరిసర్పితుడు అతడు రెండు చేతులు కలిగి ఒక చేత ఖడ్గాన్ని ఇంకొక చత డాలును ధరించినవాడు. దేవి, కృష్ణాంగి, కృష్ణవదన, కృష్ణపాశ అనే నలుగురు ఇతని దేవేరులు. ఇతనిని పరివేష్టించిన ఏడుగురు అప్సరసలు పచ్చని పట్టు వస్త్రాలను ధరించి సొగసైన శరీరాన్ని, చూపులను, నవ్వును కలిగి ఉండాలి.

**6:5:2:5 వరుణుడు :**

**6:5:2:5:1** ఇతడు పశ్చిమ దిక్కుకు అధిపతి తొలి రోజులలో ఇతరులైన దిక్పాలకులవలె సమానమైన గౌరవాన్ని పొందడమే కాక దేవతలకు గల రాచరికాన్ని కూడా వరుణుడు కొంత కాలం పొందగలిగాడు. కాని రాను, రాను వరుణుని ప్రాముఖ్యత సన్నగిల్లింది వర్షానికి అధికారి అయిన వరుణుడు నైమిత్తికమైన పూజలను మాత్రం పొందగలగుతున్నాడు.

**6:5:2:5:2** పసుపు పచ్చని పట్టు వస్త్రాలలో చుట్టుబడి, తెల్లని రంగు దేహాన్ని గల వరుణుడు సత్వదృష్టి గలవాడు. ఇతడు తలపైన దండ మకుటాన్ని యజ్ఞోపవీతాన్ని ధరించినవాడు మొసలి ఇతని వాహనం. ఇతనిని రెండు చేతులు గలవాడుగాను, నాలుగు చేతుల గలవాడు గాను చూపడం జరుగుతున్నది. రెండు చేతులైతే ఒకటి వరదముద్రలో ఉండగా, ఇంకొకటి పాశాన్ని ధరించి ఉండాలి. నాలుగు చేతులైతే ఒకటి వరద ముద్రలో ఉండగా, మిగిలిన మూడింట పాశం, సర్పం, కమండలువు కలిగి ఉండాలి.

**6:5:2:5:3** 'విష్ణు ధర్మోత్తరపురాణం' లో ఆగమాలకన్న వేరైన వర్ణనను చూడగలం. అతడు వైడూర్యంలాగ తెల్లని రంగు గలిగి, ఏడు హంసలు లాగుతున్న రథాన్ని ఆరోహించి ఉంటాడు. ముత్యాలహారావళులను ధరించి, తెల్లని వస్త్రాలతో ఉంటాడు మత్స్య ధ్వజాన్ని గల,శ్వేతచ్ఛత్రాన్ని కలిగి ఉంటాడు కుడి చేతులలో పద్మం, పాశం, ఎడమ చేతులలో శంఖం, రత్నపాత్ర కలిగి ఉంటాడు. వీనిలో శ్వేతచ్ఛత్రం సార్వభౌమాధికారానికి గుర్తు అతని రాణి నీలోత్పలాన్ని ధరించి ఎడమ తొడపై కూర్చొని ఉంటుంది

**6:5:2:6 వాయువు**

**6:5:2:6:1** ఇతడు వాయవ్యదిశకు అధిపతి. వైదిక వాఙ్మయం నుంచి ఇతడు అంతరిక్ష దేవతలలో ఒకడుగా గుర్తించబడినాడు. ఇతడు త్వష్ట ప్రజాపతిఅల్లుడు. ఇంద్రుడు వాయువుకు సారధి. త్రేతాయుగంలో ఆంజనేయుడైన హనుమంతునికి, ద్వాపర యుగంలో కౌంతేయుడైన భీమసేనునికి

వాయువు తండ్రి జింక ఇతని వాహనం.

**6:5:2:6:2** నల్లని దేహాన్ని గల వాయువు. యౌవన సంపత్తి కలిగి, రెండు లేదా నాలుగు చేతులు కలవాడు. వాయువు ఎర్రనికళ్ళను, తెల్లని వస్త్రాలను కలిగి ఉంటాడు. ఇతడికి కుడి చేతిలో ధ్వజం, ఎడమ చేతిలో దండం ఉంటుంది.కుడిచేయి ఉండే విధానాన్నే పతాక హస్త ముద్ర అని కూడా అనడం జరుగుతుంది కొన్ని ఆధారాల ప్రకారం కుడిచేత అంకుశం కలిగి ఉంటాడు. ఇతడు సింహాసనం మీద ఉండడం కాని, జింకపై ఉండడం గాని జరుగుతుంది. కాని 'విష్ణు ధర్మోత్తర పురాణం' ప్రకారం వాయువు నీలిరంగు శరీరచ్ఛాయ కలిగి, చక్రాన్ని, ధ్వజాన్ని కలిగి ఉండాలి.

**6:5:2:3: కుబేరుడు**

**6:5:2:7:1** ఇతడు ఉత్తర దిశకు అధిపతి. ఇతనినే ధనదుడని కూడా వ్యవహరించడం జరుగుతుంది ఇతడు బ్రహ్మ మానసపుత్రుడైన పులస్త్యుని కుమారుడు. ఇతని భార్య రిద్ధి రామాయణం ఉత్తర కాండలోను, వరాహపురాణంలోను కుబేరుని గూర్చిన ఐతిహ్యాలు చెప్పబడ్డాయి కుబేరుడు లంకా నగరంలో ఉండగా అతని సోదరుడైన రావణుడు కుబేరుని పరాజితుని చేసి,లంకా నగరాన్ని ఆక్రమిస్తాడు. అప్పుడు కుబేరుడు గంధమాదన పర్వతం చేరి, ఆ తరవాత ఉత్తర దిశ ఆధిపత్యాన్ని పొందుతాడు. బౌద్ధ వాఙ్మయంలో కూడా కుబేరుడు సంపదలకు అధిపతిగాను, ఉత్తర దిక్కునేలుతున్నట్లు, యక్షుల ప్రభువుగాను, 'హారీతి' భర్తగాను చెప్పబడింది.

**6:5:2:7:2** ఆగమాల ప్రకారం : స్వర్ణచ్ఛాయగల దేహంతో ఉన్న కుబేరుడు ఎర్రని ధోవతిని తెల్లని ఉత్తరీయాన్ని కలవాడు అతడు కిరీటంగాని, కరండమకుటం కాని ధరించినవాడు. అతడు హారాల చేత, కుండలాలచేత అలంకృతుడై ఉంటాడు. ఇతడిని రెండు చేతులు గలవాడుగా గాని, నాలుగు చేతులు గలవాడుగా గాని చూపడం జరుగుతున్నది. రెండు చేతులున్నట్లైతే కుడిచేయి వరద ముద్రలో ఉండగా, ఎడమచేయి అభయముద్రలో ఉండడం గాని, గదను ధరించి ఉండడంగాని జరుగుతుంది. నాలుగు చేతులున్నట్లైతే ఎడమ వైపున గల 'విభావ' అనే రాణిని, కుడివైపున గల వృద్ధిని కౌగిలించుకొన్నట్లు చూపబడుతుంది మిగిలిన రెండు చేతులు గదను, శక్తిని కలిగి ఉంటాయి. 'రూప మండనం' లోని వర్ణన ప్రకారం కుబేరుడు ఏనుగు వాహనంగా కలవాడు. అతడు నాలుగు చేతులు కలిగి ఉండగా, వానిలో గద, ధనం, వెలగపండు, కమండలువు ఉంటాయి. కాని 'అంశయద్భేదాగమం' అతనికి పొట్టేలు వాహనమని, కుడివైపున శంఖనిధి ఎడమవైపున పద్మ నిధి ఉంటాయని వివరించింది.

**6:5:2:8: ఈశానుడు**

**6:5:2:8:1** ఇతడు ఈశాన దిక్కుకు అధిపతి ఇతని మూర్తి శివుని పోలి ఉంటుంది. ఇతడు జటామకుటాన్ని, నాగ యజ్ఞోపవీతాన్ని, వ్యాఘ్రాజనాన్ని కలిగి ఉంటాడు ఇతడు పద్మాసనంపై ఉండడం గాని, తెల్లని ఎద్దుపై ఉండడం గాని జరుగుతుంది. ఇతడికి రెండు చేతులున్నట్లైతే ఒక చేయి కపాలాన్ని ధరించి ఉండగా, ఇంకొక చేయి వరద ముద్రలో ఉంటుంది నాలుగు చేతులు కలిగినట్లైతే ముందు రెండు చేతులు వీణను వాయిస్తున్నట్లుగాను, మిగిలినవి వరద, అభయ ముద్రలోను ఉంటాయి. కాని ఈ వర్ణన అపసవ్యమైందని గోపీనాథరావు గారి అభిప్రాయం.

## 6:5:3: నవగ్రహాలు

హిందూ దేవాలయాల్లో, ప్రధానంగా దక్షిణ భారతదేశ దేవాలయాల్లో నవగ్రహాలయ - లుండడం సాంప్రదాయం. సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బృహస్పతి,శుక్రుడు,బుధుడు, శని, రాహువు, కేతువుల అనేవి తొమ్మిది గ్రహాలు. వానిలో రాహువు, కేతువు ఛాయాగ్రహాలనీ, రాహువు శని వంటి వాడని, కేతువు కుజుని వంటి వాడని జ్యోతిషశాస్త్రంలో చెప్పబడింది. ఈ గ్రహాల రూపురేఖలన్నీ వేర్వేరుగా అభివర్ణిత మైనాయి.

### 6:5:3:1 సూర్యుడు

**6:5:3:1:1** సూర్య దేవాలయాలలో తూర్పున చం[illegible] కుజుడు, దక్షిణమున బృహస్పతి,నైరుత్యంలో రాహువు, పశ్చిమంలో శుక్రుడు, వాయవ్యంలో కేతువు, ఉత్తరాన బుధుడు, ఈశాన్యంలో శని, ఉండడం జరుగుతుంది. 'భవిష్య పురాణం' లో సూర్యునికి గల ద్వారపాలకులను, గూర్చి చెప్పడం జరిగింది మొదట ద్వారం దగ్గర ధర్మం, అర్థం, రెండవ ద్వారం వద్ద గరుడుడు, యముడు, మూడవ ద్వారం వద్ద కుబేరుడు, వినాయకుడు, నాల్గవ ద్వారం వద్ద రైవతుడు, దిండి ఉంటారు

**6:5:3:1:2:** 'అంశుమద్భేదాగమం', 'సుప్రభేదాగమం' 'శిల్పరత్నం' వంటి శాస్త్ర గ్రంధాలలో సూర్యుని మూర్తిని వర్ణించడం జరిగింది సూర్యుడు స్థానక మూర్తిగా, రెండు చేతులు కలిగి వానిలో పద్మం కలిగి ఉన్నట్లు చూపబడాలి శిరస్సు మీద కరండమకుటం, శిరస్సుచుట్టూ ప్రభా మండలం, శరీరంపై వివిధ ఆభరణాలు ఉండి ఎర్రని వస్త్రాన్ని ధరించి ఉండాలి ఇతడిని "సప్తాశ్వరధమారూఢం ప్రచండం కశ్యపాత్మజం" అని అభివర్ణించాడు ఇతడు కశ్యపుని కుమారుడు ఏడుగుర్రాలు లాగే రథాన్ని ఎక్కినవాడు ఇతని సారధి వైనతేయుడైన అనూరుడు ఇతడు యజ్ఞోపవీతం ధరించి, పద్మపీఠంపై స్థానక మూర్తిగా చూపబడతాడు సూర్యుడికి కుడివైపున ఉషస్సు, ఎడమవైపున ప్రత్యుషస్సు ఉంటారు సూర్యుడికి రజని, సువర్ణ, సువర్చస్, భయ అనే నలుగురు దేవేరులు. ఇంకొక ఆధారం ప్రకారం సంజ్ఞ ఛాయ సూర్యుని దేవేరులు 'శిల్పరత్నం' ప్రకారం మండలుడు, పింగళుడు సూర్యుని ద్వారపాలకులు 'శిల్ప రత్నం' ప్రకారం సూర్యుని కిరీటం పుష్య రాగాలతో చేయబడ్డది

**6:5:3:1:3** 'మత్స్యపురాణం' ప్రకారం సూర్యుడికి మీసాలు, నాలుగు చేతులు ఉంటాయి.

### 6:5:3:2:1 చంద్రుడు :

**6:5:3:2:1 :** 'అంశుమద్భేదాగమం' ప్రకారం చంద్రుడు ఆసీనమూర్తిగాగాని, స్థానకమూర్తిగాగాని చూపబడతాడు. ఇతడు తెల్లని దేహచ్ఛాయతో ప్రభామండలిని కలవాడు. రెండుచేతులు కలిగి వానిలో కుముద పుష్పాలు కలిగి ఉంటాడు. 'శిల్ప రత్నం' ప్రకారం చంద్రుడు పది గుర్రాలు లాగే రధాన్ని అధిరోహిస్తాడు. కుడి చేయి గదను దాల్చగా ఎడమ చేయి వరద ముద్రలో ఉంటుంది. 'మత్స్యపురాణం' ప్రకారం చంద్రుడికి ఇరువైపుల కాంతి, శోభఅనే ఇద్దరు దేవతలు చూపబడతారు. పౌరాణిక వాఙ్మయం ప్రకారం చంద్రుడు దక్షుని కుమార్తెలైన ఇరవై ఏడు మందిని వివాహమాడతాడు

ఈ భావాన్నే 'పూర్వ కారణాగమం'లో రోహిణిని చంద్రుని భార్యగా అభివర్ణించడం ద్వారా సూచించడమైంది

**6:5:3:3 కుజుడు :**

**6:5:3:3:1** ఇతనినే భౌముడని అంగారకుడని అంటారు ఇతడిని ఎనిమిది గుర్రాలులాగే బంగారు రథంపై న గాని, సింహాసనంపై గాని, మేకపై గాని చూపిస్తారు. ఎర్రని అగ్నివంటి దేహచ్ఛాయగల కుజుడు నాలుగుచేతులు కలిగి ఉంటాడు ఒక కుడిచేయి అభయముద్రలో గాని, వరదముద్రలోగాని ఉండగా వేరొక కుడిచేయి శక్తిని కలిగి ఉంటుంది ఎడమచేతులు గదను, శూలాన్ని ధరించి ఉంటాయి ఎర్రని వస్త్రాలతోను, ఎర్రని పూలతోను కుజుడు అలంకరింపబడతాడు.

**6:5:3:4: బుధుడు**

**6:5:3:4:1:** కొన్ని ఆధారాల ప్రకారం గ్రహపతి అని పిలవబడిన బుధుడు చంద్రునిపుత్రుడు. సింహం ఇతని వాహనం పసుపు పచ్చని పూలమాలలు, బంగారు నగలు ఇతని అలంకారాలు. ఇతని దుస్తులు పసుపుపచ్చగాను, దేహచ్ఛాయ కర్ణికారపుష్పం వలె పచ్చగాను ఉంటుంది. నాలుగు చేతులుగల వాడు బుధుడు. వానిలో ఒక కుడిచేయి వరదముద్రలో ఉండగా, మిగిలిన మూడింట ఖడ్గం, ఖేటకం గద ఉంటాయి ఇతడు విష్ణువు వంటి వాడని, కుజుని రథం వంటి రథం గలవాడని 'విష్ణుధర్మోత్తర పురాణం' ప్రశంసిస్తున్నది

**6:5:3 5 | 6 : గురు, శుక్రులు :**

**6:5:3: 5 | 6—:1:** దేవతలకు ఆచార్యుడు లేదా గురువుగా చెప్పబడిన బృహస్పతి గురువని కూడా పిలవబడుతుంటాడు ఇతడు బంగారు వంటి పచ్చని దేహచ్ఛాయ కలిగి నాలుగు చేతులున్నవాడు. వానిలో ఒకచేయి వరదముద్రలో ఉండగా మిగిలిన మూడింట కమండలువు, అక్షమాల, దండం ఉంటాయి రాక్షసులకు గురువుగా చెప్పబడినవాడు శుక్రుడు. ఇతడు కూడా బృహస్పతి వలెనే చూపబడతాడు శుక్రుడు భృగువు కుమారుడు 'విష్ణు ధర్మోత్తరం' ప్రకారం బృహస్పతి,శుక్రుడు రెండు చేతులు కలవారు బృహస్పతిచేతిలోపుస్తకం, అక్షమాల ఉండగా, శుక్రుని చేతిలో పుస్తకం, నిధి ఉంటాయి. శుక్రుని దేహచ్ఛాయ తెల్లనిది ఇతడుఎనిమిది గుర్రాలు పూన్చిన వెండిరథం మీద ఉంటాడు. గురువు వాహనం హంస, శుక్రుని వాహనం కప్ప

**6:5:3:7: శని :**

**6:5:3:7:1** శనినే 'శనైశ్చరుడు' అని వ్యవహరిస్తారు. ఇతడు సూర్యుని కుమారుడు. సూర్యునికి ఛాయాదేవికి కలిగినవాడు; యమునికి అన్న. ఇతని వాహనం కాకి. ఇతడు నల్లని వాడు, రెండు చేతులు కలవాడు కుడిచేతిలో దండం,ఎడమచేయి వరదముద్రలోను ఉంటాయి అని 'అంశుమద్భేదాగమం' పేర్కొంది కాని 'విష్ణు ధర్మోత్తర పురాణం' ప్రకారం ఇతడు ఒక చేతిలో దండాన్ని, వేరొక చేతిలో అక్షమాలను దాల్చి ఎనిమిది గుర్రాలు పూన్చిన ఇనుప రథాన్ని ఆరోహిస్తాడు

**6:5:3:8: రాహువు :**

**6:5:3:8:1:** ఇతడు ఛాయాగ్రహం, శనివంటివాడు. 'శిల్పరత్నం' ప్రకారం రాహువునాలుగుచేతులు కలవాడు. వానిలో ఒకటి వరదముద్రలో ఉండగా, మిగిలిన మూడింట ఖడ్గం, ఖేటకం, శూలం ఉంటాయి కాని, 'విష్ణుధర్మోత్తర పురాణం' ప్రకారం ఇతడు రెండు చేతులు కలవాడు. కుడిచేత ఒక పుస్తకం, ఉన్ని కంబళి ఉండగా, ఎడమ చేత ఏమీ ఉండదు ఇతడు ఎనిమిది గుర్రాలు పూన్చిన వెండి రథం కలవాడు. ఇతని స్థానం అగ్ని కుండం. రాహువుదిగువ భాగం పాము వలె ఉంటుంది.

**6:5:3:9:1: కేతువు :**

**6:5:3:9:1:** రాహువు లాగా ఇతడు కూడా ఛాయగ్రహం. కుజునివంటి వాడు. 'విశ్వకర్మ శిల్పం' ప్రకారం ఇతడు అన్నింటా కుజుని పోలి పదిగుర్రాలు పూన్చిన రథం కలవాడు ఇతడు రెండు చేతులు కలిగి అంజలి ముద్రలో గాని, అభయ ముద్రను గదను ధరించి గాని చూపబడతాడు.

**6:5:3:10:** వీరేకాక గంధర్వులు, యక్షులు, ఋషులు, పితృకణాలు, అప్సరసలు వంటివారిని, దివ్యదేహులను కూడా పరివారమూర్తులలో శిల్పాలుగా చూపడం జరుగుతుంది అలాగే వసువులు, నాగులు, అసురులు, మరుద్గణాలుకూడా పరివారమూర్తులలోనే భాగంగా గుర్తించబడుతున్నారు.

ఈ రకంగా పరివారమూర్తులతో కలిసి హైందవ ప్రతిమల సాంగోపాంగ మైన స్వరూపాన్ని తెలిసికోగలం.



# 7.
# బౌద్ధప్రతిమలు

## 7:1: ఉపోద్ఘాతం :

**7:1:1:** ప్రతిమా లక్షణశాస్త్రాన్ని తెలుసుకొనేటప్పుడు హైందవ ప్రతిమల స్వరూప, లక్షణ, స్వభావాలను తెలుసుకున్న తరవాత తప్పని సరిగా బుద్ధ, బౌద్ధ ప్రతిమలను గూర్చి తెలుసుకోవలసిన ఆవశ్యకత ఎంతో ఉంది. దానికి రెండు కారణాలున్నాయి. 1. బుద్ధుని విష్ణువు అవతారంగా భావించడం 2. బౌద్ధ మతం క్రీ శ.7,8 శతాబ్దాల తరువాత భారతదేశం ఎల్లలు దాటి అంతర్జాతీయ మతంగా టిబెట్టు, చైనా మొదలైన దేశాలలో వ్యాపించడం

**7:1:2:** వీనిలో మొదటి కారణాన్ని కొందరు పండితులు బుద్ధుడు శాక్యవంశ బుద్ధుడుకాడని, త్రిపురాసుర సంహార సందర్భంగా శివభక్తులలో నాస్తికత్వాన్ని పెంపొందించడానికి విష్ణువు పొందిన అవతారమనీ చెప్పి, అవతార పరంపరలు తొమ్మిదవ దైనదీనికి గల కాలాను క్రమణికను తారుమారు చేయడం జరిగింది R.C. మంజుదార్ వంటి మరికొందరు చరిత్రకారులు బౌద్ధమతం హిందూమతంలో మిళితమయ్యాక హిందువులు బుద్ధుని విష్ణ్వవతారంగా భావించారు అని వ్యాఖ్యానించారు. ఈ సందర్భంగా శ్రీరామకృష్ణ పరమహంస వ్యాఖ్యను గమనించడం సబబు: "బుద్ధుడు అవతారమూర్తి యనుట కిసుమంతయు సందియములేదు వైదిక జ్ఞాన కాండకును ఆయన సిద్ధాంతములకు బేధములేదు", ఈ వాక్యాలు ఒక పరమహంప దృక్పధాన్ని బుద్ధుని అవతారతత్వం పట్ల తెలియజేస్తున్నాయి

**7:1:3:** రెండవ కారణంగా బౌద్ధమతం అంతర్జాతీయ స్థాయిని పొందడం వల్ల భారత ఉపఖండ, ఉపఖండేతర సాంప్రదాయాలు, విశ్వాసాలు బౌద్ధమతంలో చోటు చేసుకోవడానికి ఎంతో అవకాశం ఉంది. బౌద్ధమతంలో ఏర్పడిన విగ్రహారాధన, సాంప్రదాయం దీనిని ప్రోత్సహించగలిగింది.

## 7:2: ఆధారాలు :

**7:2:1:** బౌద్ధమతంలో ఉండే ప్రతిమా స్వభావాలను గూర్చి తెలుసుకోవడానికి ఈ కింది కొన్ని ఆధారాలను గ్రహించాలి

**7:2:2:** సాధన మాల అనే గ్రంథం వజ్రయాన సాంప్రదాయపు ఒరవడిలో ఆవిర్భవించిన గ్రంథం. దీనిలో మొత్తం మూడువందల పన్నెండు సాధనలు, అనేక బౌద్ధ దేవతల లక్ష్య, లక్షణాలను ఇవ్వడం జరిగింది. ఈ సాధనమాల బౌద్ధులలో గల సిద్ధులు, మంత్రాలు, మండలాలు, మాయలు, తాంత్రిక వైవిధ్యాలు మొదలైన వజ్రాయన సాంప్రదాయ సంస్కృతి కలిగింది. ఈ కృతి ఇంచు మించు క్రీ శ. 1163 కి చెందినదిగా గ్రహిస్తున్నారు

**7:2:3:** అమృతానందుని, 'ధర్మకోశ సంగ్రహం' ఇంకొక ప్రధానమైన గ్రంథం. ఇది అముద్రితం.

**7:2:4:** విక్రమ శిలకు చెందిన మహాపండిత అభయంకర గుప్తుల వారు రచించిన 'నిష్పన్నయోగావళి' బౌద్ధ ప్రతిమాలక్షణాలను గూర్చి తెలిసికోవడానికి మరొక ఉన్నతమైన ఆధారం. ఈ గ్రంథం పాల వంశ ప్రభువైన రామపాలుని కాలానికి చెందినట్లు పండితాభిప్రాయం. ఇది క్రీ.శ. 1084-1130 మధ్యప్రాంతానికి చెందినది. 'నిష్పన్నయోగావళి' ఇరవై ఆరు అధ్యాయాల్లో ఇరవై ఆరు మండలాలను గూర్చి, బౌద్ధ సాంప్రదాయంలోని వివిధ తాంత్రిక మూర్తులను గూర్చి అసమానమైన అంశాలను అందజేస్తున్నది. దీని ఉపయోగం 'సాధనమాల' ఉపయోగం కన్న గొప్పది.

**7:2:5:** ఇవి మాత్రమే కాక వివిధ ప్రతిమలు చైనా టిబెట్ భాషలలో అనేక నామ లేఖనాలు కలిగి ఉన్నాయి వాటిని పరిశీలించడం వల్ల అనేక బౌద్ధ ప్రతిమల సాంప్రదాయాలను గూర్చి వైవిధ్యాన్ని గూర్చి తెలియచేయడం జరుగుతుంది.

**7:2:6:** తంత్రగ్రంథాలైన 'హేరు కతంత్రం' 'హేవజ్రతంత్రం,' 'చండమహారోషణ తంత్రం,' వజ్రవారాహితంత్రం', క్రియాసముచ్చయం, వజ్రావళినామమండలోపాయిక, యోగినీజాలతంత్రం,' 'అభిదినోత్తర తంత్రం' మొదలైనవి బౌద్ధ దేవతా ప్రతిమలను గూర్చి తెలియడానికి మరొక ప్రధానాధారం.

**7:2:7:** ఈ తంత్రగ్రంథాలేకాక ప్రజ్ఞా పారమిత,' 'పంచరక్ష,' కారండవ్యూహం'బోధి చర్యావతారం' మొదలైనవి సచిత్రా ధారాలుగా చెప్పబడుతున్నాయి, దీనిలో చివరి రెండు అలభ్యాలుగానే ఉన్నాయి

**7:2:8:** పైన గుర్తించిన సాహిత్యాధారాలు కాక, బౌద్ధ ప్రతిమలు, శిల్పాలు,తామ్రపట్టికలు మొదలైనవి ప్రధానాధారం ఈ రకమైన పురావస్త్వాధారాలు గాంధార శిల్పానికి చెంది, తక్షశిల శైలికి చెందినవని, మధుర శైలికి చెందినవని రెండు విధాలుగా ఉన్నాయి సాంచి, బార్హుత్, అమరావతి, సారనాథ్, మగధ, బెంగాల్, ఒరిస్సా, జావా, నేపాల్ మొదలైన ప్రాంతాలలో గల తొలి, మలి దశలకు చెందిన ప్రతిమా విశేషాలు బౌద్ధ ప్రతిమలలోని బుద్ధుని, బోధి సత్త్వుల పరిణామాలను సూచిస్తున్నాయి. సారనాథ్ నుంచి నేపాల్ వరకు గల ప్రాంతాలలో విస్తృతంగా వజ్రయాన తాంత్రిక శాఖలకు చెందినవి సూచించబడగా, సాంచి మొదలైన చోట్ల గల శిల్పమహాయాన శాఖకు చెందినవి. మహాయాన శాఖకు చెందిన శిల్పాలలో. వీమాకాడ్ఫిసెస్, కుజులా కాడ్ఫిసెస్, కనిష్కుడు మొదలైన కుషాణ వంశస్థులు గ్రీక్-రోమన్ శిల్ప సాంప్రదాయాలను, భారత సాంప్రదాయాలతో కలగలిపి బుద్ధుని ప్రతిమను ఏర్పరిచారు. తక్షశిలలోని బుద్ధుడు శ్మశ్రుసహితుడై రజోభావాన్ని, మానవునిలోని క్షత్రాన్ని సూచించగా, మధురలోని బుద్ధుడు సాత్వికతనిండిన పరివ్రాజక భావాన్ని, కారుణ్యాభావాన్ని సూచించాడు.

**7:2:9:** సారనాథ్, నలందా, కుర్కిహార్ మొదలైన ప్రాంతాలలో జరిపిన త్రవ్వకాలలో అనేక బౌద్ధ ప్రతిమలు, శిల్పాలు లభిస్తున్నాయి ఈ రకమైన ఆధారాలన్నీ బౌద్ధ మతం ప్రాచుర్యాన్ని, ప్రజలలోను, ప్రభువులలోను బౌద్ధమతం పట్ల కల అభిమానాన్ని, ఆసక్తిని వ్యక్తం చేస్తున్నాయి. ఓదంతపురి, (ఉద్దంతపురి అని కూడా పిలవబడుతుంది) విక్రమశిల, సార్నాథ్, నలందా, జగద్దలా వంటి ప్రాంతాలు ప్రధానంగా తాంత్రిక బౌద్ధ మతానికి ఆటపట్లు.

**7:3 బౌద్ధమత శాఖలు :**

**7:3:1** బౌద్ధమత సంప్రదాయంలో మూడు ముఖ్యమైన శాఖలున్నాయి. అవి హీనయానం, మహాయానం, వజ్రయానం హీనయానంలో శ్రావకయానం, ప్రత్యేబుద్ధయానం అని రెండు భాగాలున్నాయి శ్రావక యానం ప్రకారం వారు బుద్ధుని అభిభాషణలు విని, పదిమందికి చెప్పి కాలాంతరంలో మోక్షాన్ని పొందేవారు ప్రత్యేక బుద్ధయానంలో వారు తమంతట తామే నిర్వాణాన్ని పొందగలిగేవారు.

**7:3:2** మహాయానాన్నే బోధిసత్త్వయానం అంటారు. దీని ప్రకారం ఒక వ్యక్తి కేవలం నిర్వాణాన్ని పొందడం మాత్రమే గాక, బౌద్ధత్వాన్ని కూడా పొందగలడు. దీని ప్రాముఖ్యత 'మహాయాన సూత్రాలంకారం' అనే అసంగునికృతిలో చెప్పబడింది

**7:3:3** అద్వయవజ్రుడు వ్రాసిన 'తత్త్వరత్నావళి' ప్రకారం ఈ కింది బౌద్ధ సంప్రదాయాలున్నాయి.




**7:3:4:** వజ్రయానం అనేది తరవాతి దశ దీనిలో బౌద్ధతంత్రాల ప్రాముఖ్యం ఎంతగానో ఉంది. అద్వయవజ్రుడు ప్రతిపాదించిన మహాసుఖం అనే సిద్ధాంతాన్ని వజ్రయానులు విజ్ఞానవాదమని పేర్కొని, శూన్యవాదంనుంచి విజ్ఞానవాదానికి పరిణామాన్నే వజ్రయానం ప్రధాన లక్షణంగా పేర్కొన్నారు. ఈ పరిణామాన్నే "అనుత్తర సంయక్‌సంబోధి" అని గుర్తించారు ఇది హైందవ వేదాంత సాంప్రదాయంలో చెప్పిన 'తమసోమా జ్యోతిర్గమయ', 'మృత్యోర్మా అమృతంగమయ, 'అసతోమాసద్గమయ' అనే సిద్ధాంతాలకు దగ్గరైనది

**7:3:5:** ఈ రకమైన పరిణామంలో ప్రతిమా పరిణామాన్ని మూడు ప్రధాన రకాలుగా చూడగలము అవి ధ్యాని బుద్ధులు, బోధిసత్త్వులు, ఇతర దేవతలు

**7:4: ధ్యానిబుద్ధులు**

**7:4:1: వజ్రధరుడు**

**7:4:1:1** బౌద్ధ సాంప్రదాయం ప్రకారం ఈ జగతు ఐదు స్కంధాలను కలిగి ఉంది. అవిరూపం, వేదన, సంజ్ఞ, సంస్కారం, విజ్ఞానం ఇవి ఆద్యంతాలు లేని శక్తులు. వజ్రయానంలో వీటినే ఐదు

ధ్యాని బుద్ధులుగా వ్యవహరించడం జరిగింది. ఈ సంప్రధాయంలోనే ఈ ఐదుగురు ధ్యానిబుద్ధులుగా వ్యవహరించడం జరిగింది ఈ సంప్రదాయంలోనే ఈ ఐదుగురు ధ్యాని బుద్ధులు మహోన్నతుడైన ఆదిబుద్ధుడు అనే వజ్రధరుని నుంచి ఆవిర్భవించినట్లు చెప్పడం జరిగింది. కాలచక్ర తంత్రం' అనే గ్రంథం ఆది బుద్ధుని గూర్చి వివరిస్తుంది ఈ ఆది బుద్ధుని మనం వైదికమైన విరాట్పురుషునితో పోల్చవచ్చు ఆది బుద్ధ సాంప్రదాయం ఇంచుమించు క్రీ.శ. 10 నాటికి బాగా అభివృద్ధిలోకి వచ్చింది ధ్యాని బుద్ధులలో ఒకడైన అక్షోభ్యుని అంశగా గుర్తించబడిన వజ్రసత్త్వుడు, వజ్రధరుడు ఇంచుమించు ఒకటే అనే భావన లేకపోలేదు. అవి చాలా మిశ్రమమైన భావనలు రూపాలు. వజ్రధరుడనే ఈ ఆదిబుద్ధుడు పద్మాసనంలో సర్వాలంకార భూషితుడయి, వజ్రపర్యంకంపై ఉంటాడు. ఇతడు కుడిచేత వజ్రాన్ని, ఎడమచేత గంటను ధరిస్తాడు ఈ రెండుచేతులు వజ్రహుంకార ముద్రలో ఉంటాయి వజ్రహుంకార ముద్ర అంటే వక్షోభాగాన్ని తాకుతూ రెండుచేతలను, కుడిచేతిని ఎడమవైపు, ఎడమచేతిని కుడివైపు వేసి X ఆకారంలో ఉండడం.వజ్రం శూన్యానికి , గంట విజ్ఞానానికి గుర్తు ఈ మూర్తినే ఒక్కొక్క సారి పద్మ పర్యంకంపై చూపడం కూడా జరుగుతుంది వజ్రధరుని శక్తి ప్రజ్ఞాపారమిత అని చెప్పబడింది. వజ్రధరుని కన్న చిన్నది అయిన ఈ మూర్తి కుడిచేత కర్త్రిని, ఎడమచేత కపాలాన్ని ధరించి ఉంటుంది కర్త్రి అజ్ఞానాన్ని నాశనం చేయడానికి కపాలం అవిభక్తమైన, ఏకమైన 'సత్తు'కు చిహ్నాలు వజ్రధరుడు శూన్యం అనే మహోన్నత సత్యాన్ని, ప్రజ్ఞాపారమిత కరుణను వ్యక్తం చేస్తారు. వీరి కలయికలో ఒకే శూన్యత కలిగి, కరుణ వ్యక్తమై, ద్వైధీభావం నశిస్తుంది.

**7:4:1:2** 'నిష్పన్నయోగావళి' ప్రకారం వజ్రధరుడు మూడు శిరస్సులు, ఆరుచేతులు కలిగి, ఎరుపెక్కిన తెల్లని రంగుతో తాండవమూర్తిగా ఉంటాడు. 'వజ్రసత్త్వమండలం' లో ఇతడు ప్రధాన దైవతం వజ్రధరుడే ఆదిబుద్ధుడనే వాదాన్నిబౌద్ధులే ఏకగ్రీవంగా అంగీకరించడం లేదు. కొందరు ఆదిబుద్ధుడు ధ్యానిబుద్ధునిలో ఒకడని పేర్కొనగా, మరికొందరు వజ్రసత్త్వుడే ఆదిబుద్ధుడని పేర్కొనడం జరిగింది

**7:4:1:3** 'గుహ్యసమాజం' అనే గ్రంథం ప్రకారం ఈ ధ్యానిబుద్ధులు ఒక్కొక్కరు ఒక్కొక్క మంత్రాన్ని, శక్తిని, వర్ణాన్ని, దిశను, ద్వారపాలకుని కలిగి ఉంటారు. వీరినే తథాగతులని, బోధిసత్త్వులని కూడా వ్యవహరించడం జరిగింది.ఈ ఐదుగురు ధ్యానిబుద్ధులు ద్వేషం పట్ల వజ్రదృక్కుగాను, మోహం పట్ల జినజిక్‌గాను, చింతామణి పట్ల రత్నదృక్కుగాను, వజ్రరాగం పట్ల ఆరోలిక్కుగాను, సమయం పట్ల ప్రజ్ఞ దృక్కుగాను వ్యవహృతమవుతున్నారు ఈ ధ్యానిబుద్ధులలో ఒక్కొక్కరిని గూర్చి ఈ కింది విధంగా తెలియవచ్చు

### 7:4:2:1 అమితాభుడు.

**7:4:2:1** ఇతడు ఎర్రని రంగులో, నెమలి వాహనంగా కలిగి, సమాధి ముద్రలో ఉంటాడు. పద్మం ఇతని చిహ్నం. ఇతడు సుఖావతి అనే స్వర్గంలో ఉండే భద్రకల్పానికి అధిపతి కాని ఇతడు సృష్టించడు. ఇతని నుండి ఆవిర్భవించిన అవలోకితేశ్వరుడనే బోధిసత్త్వ పద్మ ప్రాణి సృష్టికి అధిపతి 'అధ్వయవజ్రసంగ్రహం'లోని 'పంచాకారం' ప్రకారం సౌరమండలం పడమటి వైపు 'హ్రీః

అనే రక్తబీజం నుంచి వచ్చిన ఎర్రని రంగు గలవాడు అమితాభుడు. ఇతడు పద్మాన్ని సంకేతంగా గలిగి సమాధి ముద్రలో ఉంటాడు ఇతడు సంజ్ఞకు అధిపతి. ఇతడు గ్రీష్మఋతువుకు,పులుపుకు గుర్తు. ఇతడు మూర్ధన్యాలను (అంగిలితో పలికే అక్షరాలయిన ట, ఠ, డ, ఢ, ర) సాయం సంధ్యను పాలిస్తాడు. ఇతడిని స్తూపాల మీద పడమటివైపు చూపిస్తారు

**7:4:2:2** 'పాండర' అనే పాండరవాసిని ఇతని శక్తి ఈమె ఎర్రని రంగులో పద్మాన్ని సంకేతంగా కలిగి ఉంటుంది. 'అద్వయ వజ్రసంగ్రహం' ప్రకారం చంద్రునికి వాయవ్యంలో 'పాం' అనే బీజం నుంచి ఆవిర్భవించిన ఈమె ఎర్రనిది, పద్మముఖి. ఈమె అగ్నితత్త్వాన్ని కలిగి రాగానికి, రజోభావానికి గుర్తు. పద్మపాణి ఈకులపు బోధిసత్త్వుడు

## 7:4:3: అక్షోభ్యుడు :

**7:4:3:1:** నీటి వర్ణంలో ఏనుగు వాహనంగా కలిగి, వజ్రం గుర్తుగా కలిగి, భూస్పర్శముద్రలో ఉండే అక్షోభ్యుడు 'అమితాయుస్సూత్రం'లో తథాగతుడుగా పేర్కొన్నబడ్డాడు. 'అద్వయ వజ్రసంగ్రహం' ప్రకారం సౌరమండలపు పరిధిపై గల 'మహూం' అనే బీజం నుంచి జన్మించిన అక్షోభ్యుడు రెండుచేతులు, ఒక ముఖం కలిగి, భూస్పర్శముద్రలో వజ్ర పర్యం కాసనంపై ఉంటాడు. ఇతడు విజ్ఞానా సంకేతం. ఇతడు శీతాకాలాన్ని, మధ్యాహ్నన్ని, చేదును, శ్రవణాన్ని, వాయుభావాన్ని ·, తాలవ్యాలను (దౌడలతో పలికే చఛజఝ వంటివి) కలిగి ఉంటాడు, వానికి అధిపతి. ఇతడు స్తూపంపై తూర్పున సూచింపబడతాడు జంట ఏనుగులు ఇతని వాహనం, వజ్రం ఇతని సంకేతం.

**7:4:3:2:** మామకి అనే దేవత అక్షోభ్యుని శక్తి. ఈమె చంద్రునికి నైరుత్యంలో 'మాం' అనే బీజం నుండి ఆవిర్భవించింది. వజ్రం ఈమె గుర్తు. ఈమె జలస్వభావాన్ని కలిగి, ద్వేషానికి గుర్తు. వజ్రపాణి ఈకులపు బోధిసత్త్వుడు.

## 7:4: వైరోచనుడు

**7:4:4:1** శ్వేతవర్ణంలో జలసర్పం వాహనంగా గలిగి, ధర్మచక్రముద్రలో ఉన్న వైరోచనుడికి చక్రం చిహ్నం 'గుహ్య సమాజం' ప్రకారం ఇతడు తొలి ధ్యాని బుద్ధుడు 'అద్వయం వజ్రసంగ్రహం' ప్రకారం 'ఓం' అనే బీజాక్షరం నుంచి ఆవిర్భవించిన వైరోచనుడు చంద్రునికితూర్పున ఉంచబడ్డాడు. తెల్లని రంగు గల ఇతనికి తెల్లని చక్రం గుర్తు. ఇతడు బోధయాంగిముద్రలో రూపాన్ని ప్రకటిస్తాడు. ఇతడు మోహతత్త్వాన్ని కలిగినవాడు, ఆదర్శానికి స్ఫూర్తి. హేమంత ఋతువుకు, తీయ దనానికి, కంఠ్యాలకు (కంఠంతో పలికే క, ఖ, గ, ఘ వంటివి), ఉషస్సు, అస్తమయాలకు అధిపతి. వైరోచనుని ప్రతిమలో చూపినపుడు గుండెలకు ఆన్చిన రెండు చేతులు చిన్ముద్రలో చూపబడతాయి. జంట జలసర్పాలు ఇతని వాహనాలు. తెల్లని చక్రం ఇతని గుర్తు 'నిష్పన్న యోగావళి' ప్రకారం ఇతడు అనేక చేతులు కలవాడు

**7:4:4:2** నాలుగు ముఖాలు, ఎనిమిది చేతులు ఉంటే ఇతడినే వజ్రధాతువు అని పిలుస్తారు. 'నిష్పన్నయోగావళి' లోని 'వజ్రధాతుమండలం' ప్రకారం వైరోచనుడు వజ్రపర్యంకాసనంపై ఉన్న తెలైని రంగు గలవాడు అతని నాలుగు ముఖాలు తెలుపు, పసుపపచ్చ, ఎరుపు, ఆకుపచ్చ అనే

రంగులు కలవి. ఇతనికి ఎనిమిది చేతులుంటాయి. రెండు చేతులు వజ్రాన్ని ధరించి ఉండి ధర్మ చక్ర ముద్రలో ఉంటాయి. మిగిలిన నాలుగింట రెండు చేతులు జపమాలను, బాణాన్ని ధరించగా, మిగిలిన రెండు చేతులు చక్రాన్ని విల్లును ధరిస్తాయి. లోచనవైరోచనుని శక్తి. చంద్రునికి ఆగ్నేయంలో గల ఈమె 'లోం' అనే శ్వేతబీజం నుంచి జన్మించిన, తెల్లని రంగు గల, చక్రం చిహ్నం గల, పృథివీ తత్త్వాన్ని రూపించే శక్తి అని 'అద్వయవజ్ర సంగ్రహం' పేర్కొంటుంది సమంత భద్రుడు వీరి బోధిసత్త్వుడు.

## 7:4:5 అమోఘసిద్ధి :

**7:4:5:1** ఆకుపచ్చని రంగులో గరుడ వాహనం మీద అభయముద్ర గలిగి, విశ్వవజ్రం సంకేతంగా గల అమోఘ సిద్ధి నేపాల్ సాంప్రదాయం ప్రకారం ఐదవవాడు ఎడమ చేయితొడపై ఉండగా, కుడిచేయి అభయముద్రలో గలవాడు 'అద్వయ వజ్ర సంగ్రహం' ప్రకారం 'ఖం' అనే ఆకుపచ్చని బీజం నుంచి జన్మించి, సూర్యమండలానికి ఉత్తర దిశన గల ఇతడు ఆకుపచ్చని రంగువాడు విశ్వవజ్రం ఇతని గుర్తు ఇతడు అభయముద్రలో ఉండి, సంస్కారాన్ని అభివ్యక్తం చేస్తాడు. ఇతడు వర్షర్తు స్వభావాన్ని, పైశాచిక తత్త్వాన్ని కలిగి ఉంటాడు. కారమునకు, ఓష్ఠ్యములకు (పెదవులతో పలికే అక్షరాలైన ప, ఫ, బ,భ వంటివి) అర్ధరాత్రికి ఇతడు అధిపతి ఆకుపచ్చని రంగులో ఇతడిని ఉత్తరముఖుడుగా చూపడం జరుగుతుంది. ఇతడు రెండు గరుడపక్షులు వాహనంగా, విశ్వ వజ్రం (రెండు వజ్రాలు) చిహ్నంగా ఉంటాడు. ఒక్కొక్కప్పుడు ఏడుపడగలపాము, ఛత్రం కూడా చూపబడతాయి.

**7:4:5:2** ఆకుపచ్చని రంగులో ఉత్పలాన్ని చిహ్నంగా గల తార (చూడుడు ఫోటో 16) అమోఘసిద్ధి శక్తి. చంద్రుడికి ఈశాన్యంగా 'తాం' అనే కనక శ్యామ బీజం నుంచి ఆవిర్భవించిన తారిణి ఆకుపచ్చని కలువ గుర్తుగా కలది ఆమె వాతతత్త్వానికి సంకేతం విశ్వపాణి వీరిబోధిసత్త్వుడు.

## 7:4:6: రత్న సంభవుడు. :

**7:4:6:1** పసుపుపచ్చని రంగుతో సింహవాహనుడై వరదముద్రలో ఉన్న రత్నసంభవుడు ఆభరణాలు, రత్నం గుర్తుగాగలవాడు నేపాల్ సాంప్రదాయం ప్రకారం ఇతడు మూడవ ధ్యానిబుద్ధుడు. 'అద్వయవజ్రసంభవుడు సూర్యునికి దక్షిణానగలవాడు. ఇతడు పసుపుపచ్చని రంగులో రత్నం సంకేతంగా గలిగి అభయముద్రలో ఉన్నవాడు ఇతడు పిశున స్వభావం కలిగి, వేదనకు గుర్తు ఇతడు రక్తానికి, వసంత ఋతువుకు, క్షార గుణానికి, దంత్యాలకు (దంతములతో పలకబడే త,థ,ద,ధ వంటివి) పగటికి, రాత్రి మూడవ, నాల్గవ యామాలకు అధిపతి. ఇతడు సమతా గుణం కలవాడు.

**7:4:6:2** ప్రతిమలలో పసుపుపచ్చని రంగులో ఎప్పుడూ దక్షిణ ముఖంగా చూపబడతాడు. ఇతని ఎడమచేయి తొడ మీద ఉండగా, కుడిచేయి అభయముద్రలో ఉంటుంది. జంట సింహాలు ఇతని వాహనం కాగా, రత్నచ్ఛట ఇతని సంకేతం. 'నిష్పన్నయోగావళి ప్రకారంఇతడు రెండు కన్నా ఎక్కువైన చేతులు కలవాడు.

**7:4:6:3** పచ్చని రంగులో రత్నచ్ఛట సంకేతంగా గల వజ్రధాత్వీశ్వరి రత్న సంభవుని శక్తి ఈమె తథత, శూన్యత, ప్రజ్ఞాపారమిత మొదలుగా చెప్పబడ్డ నిత్యసత్యానికి గుర్తు. రత్నపాణి వీరి బోధిసత్త్వుడు

### 7:4:7 వజ్రసత్త్వుడు :

**7:4:7:1** నేపాల్ దేశంలో ఐదుగురు ధ్యాని బుద్ధులకు అర్చకుడుగా భావింపబడి తెల్లని రంగులో వజ్రం, గంట గుర్తుగా గలవాడు వజ్రసత్త్వుడు 'అద్వయవజ్ర సంగ్రహం' ప్రకారం 'హూం' అనే తెల్లని బీజాక్షరం నుంచి జన్మించి ఒక ముఖం, రెండుచేతులు కలిగి, రెండు చేతులలో వజ్రం, వజ్రం గుర్తుగల గంటను ధరించి ఉంటాడు. ఇతడు చేదుకు, శిశిర ఋతువుకు, య, ర, ల, వ లకు, అర్ధరాత్రి నుంచి ఉషోదయం వరకు గల కాలానికి అధిపతి ఇతనిని 'ధర్మధాతు' అనికూడా అంటారు.

**7:4:7:2** తెల్లని వర్ణం గలిగి, కర్త్రి, కపాలాలు రెండు చిహ్నాలుగా రెండుచేతులు గల 'వజ్రసత్వాత్మిక' వజ్రసత్త్వుని శక్తి. ఘంటాపాణి వీరి బోధిసత్త్వుడు

**7:4:7:3** ధ్యాని బుద్ధులేకాక విడశ్వి, శిఖి, విశ్వభువు,(కకుచ్ఛందుడు, కనకముని కశ్యపుడు, నాయక సింహుడు అనే ఏడుగురు మనుషులైన బుద్ధులను మహాయానం పేర్కొన్నది కాని వారి చారిత్రకత అసంగతంగా ఉన్నట్లు పండితులు పేర్కొంటున్నారు.

## 7:5 బోధిసత్త్వులు

**7:5:0** బుద్ధికి, సత్వానికికూడా ప్రాతినిధ్యాన్ని వహించిన బోధిసత్త్వులు ధ్యాని బుద్ధుల ఆధ్యాత్మికవారసులు భారతదేశం, నేపాల్, టిబెట్, చైనా మొదలైన దేశాల్లో ఈ బోధిసత్త్వుల ప్రాముఖ్యత విశేషంగా కనిపిస్తుంది. మహా పండిత అభయంకర గుప్తుని 'నిష్పన్నయోగావళిలో మొత్తం నలభై ఎనిమిది మంది బోధిసత్త్వులను మూడు గణాలుగా విభజించడం జరిగింది. ఈ మూడింటిలోను కేవలం 25 మంది సామాన్యమైనవారు సమంతభద్రుడు, మైత్రేయుడు ఈ మూడు గణాలకు అధిపతులుగా గుర్తించబడ్డారు ఈ బోధిసత్త్వులను గూర్చి ఈ కింది విధంగా తెలియవచ్చు

### 7:5:1 సమంతభద్రుడు :

**7:5:1:1** 'నిష్పన్నయోగావళి' లోని 'ధర్మధాతువాగేశ్వరమండలం', 'దుర్గతి పరిశోధన మండలం', 'కాలచక్రమండలం' 'సాధనమాల' లలో సమంతభద్రుడు పసుపుపచ్చ, నీలి రంగులలో ఉండి, రత్నచ్ఛట సంకేతంగా కలిగి, కుడిచేతిని వరదముద్రలో ఉంచి, ఎడమ చేతిని తొడపై ఉంచువాడు. ఇతనినే ఆరు చేతులతో సూచించినట్లైతే కుడిచేతులలో వజ్ర, కర్త్రి, పరశువులను ధరించి, ఎడమ చేతులలో ఘంట, కపాలం, చితికిన బ్రహ్మ శిరస్సుగాని,నీలోత్పలంగాని కలిగి ఉంటాడు. ఇతని శక్తి ధర్మవజ్ర

### 7:5:2 అక్షయమతి :

**7:5:2:1** 'మంజువజ్రమండలం', 'ధర్మధాతువాగేశ్వర మండలం' 'దుర్గతి పరిశోధన మండలం'

అక్షయ మతిని వర్ణించాయి పసుపుపచ్చని రంగులోని ఇతడు ఎడమ చేతిని వక్షోభాగమందుంచి, కుడిచేతిని వరదముద్రలో ఉంచుతాడు. ఖడ్గం లేదా కలశం ఇతని సంకేతం. ఇతడు తెల్లని రంగులో రెండు చేతుల జ్ఞానామృతాన్ని కలిగిన కలశాన్ని ఉంచుకొన్నట్లు కూడా 'నిష్పన్న యోగావళి' లో చెప్పబడింది

**7:5:3: క్షితిగర్భుడు**

**7:5:3:1:** 'నిష్పన్న యోగావళి' లోను, సాధనమాల' లోను ఇతడిని పేర్కొనడం జరిగింది. పసుపు పచ్చని లేదా ఆకుపచ్చని రంగులో ఉండే ఇతడు కలశంలో ఉన్న కల్పవృక్షం సంకేతంగా గలవాడు ఇతని కుడిచేయి భూస్పర్శముద్రలో ఉంగా, ఎడమ చేత కల్పవృక్షం కలిగి ఉంటాడు. 'సాధనమాల' ప్రకారం ఒక చేయి అభయముద్రలో ఉంటుంది.

**7:5:4: ఆకాశగర్భుడు :**

**7:5:4:1:** 'ధర్మధాతువాగేశ్వర మండలం' లోను, 'సాధనమాల' లోను ఆకాశగర్భుడు వర్ణితమైనాడు. ఆకుపచ్చని రంగులోని ఈ బోధిసత్త్వుడు రత్నవృట సంకేతంగా గలవాడు. కుడిచేతకొన్ని రత్నాలను, ఎడమ చేత చింతామణిని ధరించి ఉంటాడు.ఇతనినే భూగర్భుడని వ్యవహరిస్తారు.

**7:5:5: గగనగంజుడు :**

**7:5:5:1:** 'మంజువజ్రమండలం', 'ధర్మధాతువాగేశ్వరమండలం' 'దుర్గతి పరిశోధన మండలం' 'సాధన మాల' ల్లో ఇతడిని పేర్కొనడం జరిగింది పసుపు పచ్చని లేదా ఎర్రని రంగు గల ఇతడికి కల్పవృక్షం సంకేతంగా ఉండి, రత్నసంభవునికి సంబంధించినవాడుఎడమచేత వజ్రాన్ని ధరించి, తొడమీద ఉంచుకొని,కుడిచేతిని ఆకాశముద్రలో ఉంచుకోవడం జరుగుతుంది. ఒక్కొక్కసారి కుడిచేత చింతామణిని, ఎడమచేత కలశాన్ని కూడ చూపడం జరుగుతుంది ఇతడిని కుడి చేత పద్మాన్ని ధరించినట్లు కూడా చూపడం జరిగింది

**7:5:6: రత్నపాణి:**

**7:5:6:1:** 'నిష్పన్నయోగావళి' లో ఇతడు ఆకుపచ్చని రంగు కలిగి, కుడిచేత రత్నాన్ని, ఎడమచేత ఉత్పలంపై చంద్ర చక్రాన్ని ధరించినట్లు చెప్పబడ్డాడు చంద్రుడు ఇతని సంకేతం.

**7:5:7: సాగరమతి:**

**7:5:7:1:** 'మంజువజ్రమండలం', 'ధర్మధాతువాగేశ్వరమండలం' సాగర మతిని పేర్కొన్నవి. ఇతడు తెల్లని రంగువాడు సాగర కెరటం లేదా శంఖం గుర్తుగా గలవాడు. ఇతడు కుడిచేత శంఖాన్ని ధరించి ఎడమ చేత వజ్రముదితమైన ఖడ్గాన్ని ధరించి ఉంటాడు

**7:5:8: వజ్రగర్భుడు :**

**7:5:8:1:** 'ధర్మధాతువాగేశ్వరమండలం', 'దుర్గతి పరిశోధన మండలం', 'వజ్రగర్భుని పేర్కొన్నవి ఇతడు నీలోత్పల ధవళవర్ణాన్ని కలిగి, కుడిచేత వజ్రాన్ని, ఎడమచేత దశభూమిక పుస్తకాన్ని ధరించి ఉంటాడు దశ భూమిక పుస్తకం ఇతని గుర్తు.

**7:5:21: భద్రపాలుడు :**

**7:5:21:1:** 'మంజువజ్రమండలం', 'దుర్గతి పరిశోధనమండలం' ఇతనిని వర్ణించాయి. ఎర్రని లేదా తెల్లని రంగు గల ఇతడు ఒక చేతమణిని ధరించగా, వేరొక చేయి వరదముద్రలో గాని, కటి హస్తముద్రలో గాని ఉంటుంది. రత్నంఇతని గుర్తు

**7:5:22: సర్వాపాయనజహుడు:**

**7:5:22:1:** 'మంజువజ్రమండలం', 'దుర్గతి పరిశోధన మండలం' ఇతనిని వర్ణించాయి. తెల్లని రంగు గల ఇతడు రెండు చేతుల అంకుశం ధరించి ఉంటాడు. అంకుశం కాని,పాపవినాశనం కాని ఇతని గుర్తులు

**7:5:23: అమోఘదర్శి :**

**7:5:23:1:** దుర్గతి పరిశోధనమండలం' ప్రకారం ఇతడు పసుపు పచ్చనిరంగువాడు. కుడిచేత పద్మాన్ని ధరించి, ఎడమచేతిని కటిహస్తముద్రలో గలవాడు, పద్మం ఇతని సంకేతం.

**7:5:24: సురంగము డు :**

**7:5:24:1:** 'దుర్గతి పరిశోధన మండలం' ప్రకారం తెల్లని రంగుగల ఇతడు కుడిచేత ఖడ్గాన్ని ధరించగా ఎడమచేయి కటిహస్తముద్రలో ఉంటుంది. ఖడ్గం ఇతని గుర్తు

**7:5:25 వజ్రపాణి :**

**7:5:25:1:** ఇతడిని 'సాధనమాల' లో పేర్కొనడం జరిగింది. తెల్లని రంగుగల ఇతడు ఒక చేత వజ్రాన్ని ధరించగా వేరొక చేయి అభయముద్రలో ఉంటుంది.

**7:5:26:** 'వజ్రధాతుమండలం' ప్రకారం ఈ బోధిసత్త్వులలో నలుగురు అక్షోభ్యునికి, నలుగురు రత్నసంభవునికి, నలుగురు అమితాభునికి, నలుగురు అమోఘసిద్ధికి చెందినవారు.

## 7:6: ఇతరదేవతలు

**7:6:0:** ధ్యాని బుద్ధులు, బోధిసత్త్వులను గూర్చి తెలిసికొన్న తరవాత బౌద్ధ మతంలోని కొందరు ఇతర దేవతలను గురించి తెలిసికోవలసిన అవసరం ఉంది. వీళ్ళలో దిక్పాలకు లైన దేవతలు, ఉష్ణీషదేవతలు, రక్షాదేవతలు, గౌరీదేవతలు, దీపదేవతలు,జంత్వాస్యదేవతలు, హిందూ దేవతలు అనేవారి గూర్చి ఈ కింది విధంగా తెలుసుకోవచ్చు

**7:6:1: దిక్పాలక దేవతలు :**

**7:6:1:1: యమాంతకుడు :** ఇతడిని యమారి అని కూడా పిలుస్తారు ఇతని దిక్కు తూర్పు 'నిష్పన్నయోగావళి' ప్రకారం ఇతడు నీలిరంగు వాడు నీలి, తెలుపు, ఎరుపు రంగులు గల మూడు ముఖాలు గలవాడు. నాలుగు చేతులలో కృష్ణ వజ్రముద్గరం, ఖడ్గం, మణి, కమలాలు ధరిస్తాడు. రెండు చేతులలో శక్తిని ధరిస్తాడు

**7:6:1:2: ప్రజ్ఞాంతకుడు:** ఇతడు దక్షిణ దిక్కుకు అధిపతి తెల్లని రంగు గల ఇతడు శ్వేత, నీలి,

ఎరుపు రంగులు గల మూడు ముఖాలు గలవాడు. నాలుగు చేతులలో వజ్రాంకితత్రిశూలం దండం, అసి, మణి, పద్మాలను, రెండు చేతులలో శక్తిని ధరిస్తాడు.

**7:6:1:3: పద్మాంతకుడు:** పశ్చిమ దిశను పాలించే ఇతడు ఎర్రని రంగు వాడు. ఎర్రని, నీలి, తెల్లని మూడు ముఖాలు గలవాడు. నాలుగు చేతులలో ఎర్రని కమలాన్ని ఖడ్గాన్ని, మణిని, చక్రాన్ని రెండు చేతులలో శక్తిని కలవాడు. వజ్రహుంకార మండలం'లో ఇతనినే వజ్రోష్ణీషుడు అని వ్యవహరిస్తారు

**7:6:1:4: విఘ్నాంతకుడు:** ఉత్తర దిశకు ఇతడు పాలకుడు ఇతడు ఆకుపచ్చని రంగువాడు ఆకుపచ్చని, తెల్లని, ఎర్రని రంగులు గలమూడు ముఖాలు గలవాడు అతడు కరాళవజ్రం,ఖడ్గం, మణి, పద్మాలను నాలుగు చేతులలోను, శక్తిని రెండు చేతులలోను ధరిస్తాడు 'వజ్రహుంకార మండలం' ఇతనిని 'అనలార్కుడు' అని పేర్కొన్నది.

**7:6:1:5: తక్కిరాజు:** ఇతడు ఆగ్నేయ దిశకు అధిపతి ఇతడు నీలిరంగు గలవాడు నీలి, తెల్లని, ఎర్రని రంగులు గల మూడు ముఖాలు గలవాడు నాలుగు చేతులలో నీలదండం,ఖడ్గం, మణి, అబ్జాలను రెండు చేతులలో శక్తిని ధరిస్తాడు. ఇతడిని వజ్రయక్షుడని,వజ్రజ్వాలానలార్కుడని కూడా పేర్కొనడం జరిగింది

**7:6:1:6: నీలదండుడు:** ఇతడు నైఋతీదిశకు అధిపతి. ఇతడు నీలిరంగుగల వాడు నీలి, తెల్లని, ఎర్రని మూడు రంగులు గల మూడు ముఖాలు గలవాడు. ఇతడు నీలదండం, ఖడ్గం, మణి, అబ్జాలను నాలుగు చేతులతోను, శక్తిని రెండు చేతులతోను ధరిస్తాడు ఇతణ్ణి వజ్రకాలుడని, హేరుక వజ్రుడని కూడా పేర్కొనడం జరిగింది

**7:6:1:7: మహాబలుడు:** వాయవ్యదిశకు అధిపతి అయిన మహాబలుడు నీలి రంగు దేహం కలవాడు నీలి, తెలుపు, ఎర్రని రంగులు గల మూడు ముఖాలు గలవాడు నాలుగు చేతులలో త్రిశూలం,ఖడ్గం, మణి కమలాలను, రెండు చేతులలో శక్తిని కలిగి ఉంటాడు ఇతడిని మహాకాలుడు, పరమాశ్వుడు అని కూడా పేర్కొనడం జరిగింది

**7:6:1:8: అచలుడు :** ఈశాన్యదిశకు అధిపతి అయిన అచలుడు నీలిరంగు శరీరం గలవాడు ఇతడు నీలి, తెల్లని, ఎర్రని రంగులలో గలమూడు ముఖాలు గలవాడు. నాలుగు చేతులలో ఖడ్గం, వజ్రం, మణి,పద్మాలను రెండు చేతులలో శక్తిని ధరించినవాడు ఇతణ్ణి చండరోషణుడని, వజ్రభీషణుడని, త్రైలోక్యవిజయుడని పేర్కొనడమైంది

**7:6:1:9: ఉష్ణీషుడు:** ఉష్ణీష చక్రవర్తి అని కూడా వ్యవహృతుడయ్యే ఇతడు ఆకాశానికి అధిపతి. పసుపు పచ్చని రంగు గల ఇతడు పసుపు పచ్చ, నీలి, ఎర్రని రంగులు గల మూడు ముఖాలు గలవాడు నాలుగు చేతులలో పీత చక్రం, ఖడ్గం, మణి, పద్మాలను రెండు చేతులలో శక్తిని ధరించినవాడు.

**7:6:1:10: సుంభరాజుడు:** ఇతడు పాతాళ లోకానికి అధిపతి. ఇతడు నీలి రంగు దేహం కలవాడు నీలి, తెలుపు రంగులు గల మూడు ముఖాలు గలవాడు. నాలుగు చేతులలో వజ్రం, ఖడ్గం, మణి,

కమలాలను, రెండుచేతులలో శక్తిని కలవాడు. ఇతడిని వజ్రపాతాళుడని కూడా పేర్కొన్నారు.

**7:6:1:11:** వీరేకాక వజ్రాంకుశి, వజ్రపాశి, వజ్రస్ఫోట, వజ్రఘంట, ఉష్ణీష విజయ, సుంభ అనే దేవతలు వరుసగా తూర్పు, దక్షిణం, పశ్చిమం,ఉత్తరం, ఆకాశం,పాతాళం లలో కలవారు.

**7:6:2: ఉష్ణీష దేవతలు:** వీరందరు ఒక ముఖాన్ని, రెండు చేతులను కలిగి, సర్వాభరణ భూషితులై, మణి మకుటాన్ని ధరించి మానవులపై ఉన్నవారు. తెల్లని వజ్రోష్ణీషుడు తూర్పున, నీలిరంగు రత్నోష్ణీషుడుదక్షిణాన,ఎర్రని పద్మోష్ణీషుడు పశ్చిమదిక్కులోను, ఆకుపచ్చని విశ్వోష్ణీషుడు ఉత్తర దిక్కులోను, ఎరుపెక్కిన తెల్లని రంగు గల తేజోష్ణీషుడు అగ్నేయ దిక్కులోను, ఎరుపు నీలం రంగు గల ధ్వజోష్ణీషుడు నైఋతీ దిక్కులోను, ఆకాశపు ఆకుపచ్చ రంగుగల తీక్ష్ణోష్ణీడు వాయవ్యంలోను, తెల్లని ఛత్రోష్ణీషుడు ఈశాన్యంలోను ఉన్నారు.

### 7:6:3: రక్షాదేవతలు

**7:6:3:0:** వీరిని 'సాధనమాలలోను' తాంత్రిక గ్రంథాలలోను పేర్కొనడం జరిగింది. సాధనమాలప్రకారం వీరు ఆయుర్దాయాన్ని, రాజ్యాలను, గ్రామాలను, బీళ్ళను రక్షిస్తారు. అందరినీ భూతప్రేత పిశాచాల నుంచి, వ్యాధుల నుంచి, కరువుకాటకాల నుంచి, అన్ని రకాల ప్రమాదాల నుంచి రక్షిస్తారు. రోగాలు ప్రమాదాలు,కష్టాలు, ఆస్తి నష్టం, పశునష్టం, మొదలైన వాటి నుంచి రక్షించడాన్ని పంచరక్షలు అని పేర్కొన్నారు.సాధనమాలలోని 'పంచరక్షా మండలం', 'నిష్పన్న యోగావళి' ఈ రక్షాదేవతలను పేర్కొన్నాయి.

**7:6:3:1: మహాప్రతిసర:** పసుపు పచ్చని రంగు గల ఈమె నాలుగు ముఖాలు కలది మొదటి ముఖం పసుపు రంగులోను, కుడిముఖం తెలుపు రంగులోను, వెనుక ముఖంనీలిరంగులోను ఎడమ ముఖం ఎర్రని రంగులోను ఉంటాయి. ఈమె పన్నెండు చేతులు కలది.కుడి చేతులలో మణి,చక్రం,వజ్రం, బాణం,ఖడ్గం, వరదముద్ర ఉండగా, ఎడమ చేతులలో వజ్రం,పాశం, శూలం, విల్లు, పరశువు శంఖం ఉంటాయి. ఈమె వజ్ర పర్యంకాసనంలో ఉంటుంది. ఈమె కేంద్రంలో ఉంటుంది.

**7:6:3:2: మహాసాహస్రప్రమర్దిని:** ఈమె మండలానికి తూర్పున ఉంటుంది. తెల్లని రంగు గలది. నాలుగు ముఖాలు, పదిచేతులు ఉంటాయి. నాలుగు ముఖాలలో మధ్యది. తెల్లని రంగులోను, కుడివైపు ముఖం నీలి రంగులోను, వెనుక గల ముఖం పసుపుపచ్చని రంగులోను,ఎడమ వైపు ముఖం ఆకుపచ్చని రంగులోను ఉంటాయి. కుడిచేతులలో ఆమె పద్మంపై గల షష్టారచక్రాన్ని వరదముద్రను, అంకుశాన్ని, బాణాన్ని, ఖడ్గాన్ని కలిగిఉంటుంది. ఎడమ చేతులలో వజ్రం, తర్జనిముద్ర, విల్లు, పాశం ఉంటాయి.

**7:6:3:3: మహామంత్రానుసారిణి:** దక్షిణ దిశలో గల ఈమె నీలిరంగు గలది. మూడు ముఖాలు, పన్నెండు చేతులు కలది ఈమె మధ్య ముఖం నీలిరంగులోను, కుడిది తెల్లగాను, ఎడమది ఎర్రగాను ఉంటాయి. ఈమె రెండు చేతులు ధర్మ చక్రముద్రలో ఉండగా,రెండు చేతులు సమాధి ముద్రలో ఉంటాయి. మిగిలిన నాలుగు కుడిచేతులలో వజ్రం, బాణం,వరదముద్ర,అభయముద్ర

ఉండగా, ఎడమ చేతులలో తర్జని ముద్రతో పాశం, విల్లు, మణి, పద్మ కుశం ఉంటాయి.

**7:6:3:4: మహాసిరవతి :** పశ్చిమ దిశలో గల ఈమె ఎర్రనిది. మూడు ముఖాలను, ఎనిమిది చేతులను కలది. మధ్యముఖం ఎరుపు రంగులోను, కుడి ముఖం తెలుపు రంగులోను, ఎడమ ముఖం నీలి రంగులోను ఉంటాయి. కుడివైపుగల నాలుగు చేతులలో పద్మంతో అభయముద్ర, బాణం, వజ్రం, ఖడ్గం ఉండగా,ఎడమవైపు గల చేతులలో పాశంతో గల తర్జని, విల్లు, మణిచ్ఛట, హృదయానికి హత్తుకొన్న పుస్తకం ఉంటాయి.

**7:6:3:5: మహామయూరి:** ఉత్తరదిశలో గల ఈమె ఆకుపచ్చని రంగు కలది. మూడు ముఖాలు, ఎనిమిది చేతులు కలది మధ్యముఖం, ఆకుపచ్చ రంగులోను, కుడివైపు ముఖం తెల్లని రంగులోను, ఎడమ వైపు ముఖం నీలి రంగులోను ఉంటాయి. కుడివైపు గల నాలుగు చేతులలో మణి, బాణం, వరదముద్ర, ఖడ్గం ఉండగా, ఎడమవైపు పాత్రోపేతి భిక్షువు, మణి, కలశం, వజ్రచ్ఛట, రత్నచ్ఛట ఉంటాయి.

**7:6:4: గౌరీదేవతలు :** గౌరి, చౌరి, వేతాళి, ఘస్మరి, పుక్కసి, శబరి, చండాలి, డొంబి అనే ఈ దేవతలు వజ్రయానంలో ఎక్కువ పలుకుబడి గలవారు 'సాధనమాల', 'నిష్పన్నయోగావళి' వీరిని వర్ణించాయి 'నిష్పన్నయోగావళి' లోని 'పంచడాకమండలం' ప్రకారం వీరందరు తామసిక ప్రవృత్తితో కపాల మాలికలను ధరించిన క్రోధప్రవృత్తిగల దేవతలు. వీరు ప్రత్యాలీఢంలో ఉండి ఎదకు హత్తుకొన్న తర్జని భావాన్ని గలవారు వీరందరు రెండు చేతులు కలవారే. గౌరి తెల్లనిది. ఈమె గుర్తు అంకుశం చౌరి పసుపు పచ్చనిది; ఈమె గుర్తు పాశం వేతాళి ఎర్రనిది; ఈమె గుర్తు మాల; ఘస్మరి ఆకుపచ్చనిది; ఈమె గుర్తు ఘంట. పుక్కసి నీలిరంగు కలది, ఈమె గుర్తు బోధి చిత్తఘటం శబరి తెల్లనిది, ఈమె గుర్తు మేరువు. చండాలి నీలిరంగు గలది, ఈమె గుర్తు అగ్నికుండం డొంబి మిశ్రవర్ణం కలది, ఈమె గుర్తు ధ్వజం

**7:6:5: దీపదేవతలు:** 'నిష్పన్నయోగావళి' లోని 'పంచడాకమండలం' లో వర్ణితమైన ఈ దేవతలు కపాలమాలలను, పగిలిన తలలను కలిగి, ప్రత్యాలీఢంలో ఉన్న నగ్న దేవతలు వీరు వజ్రయానంలో ఎక్కువ ప్రాచుర్యం గలవారు వీరందరు రెండు చేతులను, ఒక ముఖాన్ని కలవారు. తెల్లని 'సూర్యహస్త' గుర్తు సూర్యుడు నీలిరంగు లోని 'దీప' గుర్తు దీపస్తంభం. పసుపు పచ్చని రత్నో గుర్తుమణి ఆకుపచ్చని తడిత్కరగుర్తు విద్యుల్లత.

**7:6:6: జంత్వాస్యదేవతలు:** 'నిష్పన్నయోగావళి', కాలచక్రమండలం' ఈ జంత్వాస్యదేవతలను పేర్కొన్నవి దీంతో ఎక్కువగా వర్ణించబడ్డ దేవతలు నలుగురు. వీరందరు రెండు చేతులు గలవారే. వీరిలో తెలుపు కలిసిన నీలిరంగు దేహం గలది హయాస్య ఈమె గుర్తు గుర్రం ముఖం. 'నైరాత్మమండలం' ప్రకారం ఈమె తూర్పు ద్వారపాలిక పసుపుపచ్చ నీలిరంగుల దేహం గలది సూకరాస్య. ఈమె గుర్తు పందిముఖం. ఈమె దక్షిణ ద్వారపాలిక. ఎర్రని నీలి రంగులు గల దేహం గలది శ్వానాస్య ఈమె గుర్తుకుక్క ముఖం. ఈమె పశ్చిమ ద్వారపాలిక ఎర్రని, నీలిరంగులు గల దేహం గలది సింహాస్య ఈమె గుర్తు సింహం ముఖం. ఈమె ఉత్తర ద్వారపాలిక వీరందరు కుడిచేత కర్త్రిని,ఎడమచేత కపాలాన్ని ధరిస్తారు.

### 7:6:7: హిందూ దేవతలు :

**7:6:7:1:** 'నిష్పన్నయోగావళి'లోని 'ధర్మధాతువాగీశ్వరమండలం', 'సాధన మాల మొదలైన ఆధారాల పరిశీలన ద్వారా బౌద్ధమతంలో కేవలం బౌద్ధదేవతలు మాత్రమే కాక, అనేకమంది హిందూ దేవతలు కూడా ఉన్నట్లు తెలుస్తుంది ఈ రకమైన దేవతలలో మహాకాలుడు, గణపతి, సరస్వతి (మహాసరస్వతి, వజ్రవీణసరస్వతి, వజ్రశారద, ఆర్యసరస్వతి, వజ్రసరస్వతి మొదలైన రూపాలు కలది), ఇంద్ర, యమ, వరుణ, కుబేర, ఈశాన, అగ్ని, ఋతి, వాయు మొదలైన దిక్పాలులు, బ్రహ్మ, విష్ణు,మహేశ్వరులు; కార్తికేయుడు, వారాహి,చాముండ, భృంగి అనే దేవతలు, ఆదిత్యుడు, చంద్రుడు, మంగళుడు, బుధుడు, బృహస్పతి, శుక్రుడు, శని, రాహువు,కేతువు వంటి నవగ్రహాలు,యక్ష, కిన్నర, గంధర్వ, విద్యాధరులు మొదలైన హైందవ దేవతలు అధిక ప్రాచుర్యాన్ని వహించినట్లు తెలుస్తుంది

**7:6:7:2: మహాకాలుడు:** 'సాధనమాల' ప్రకారం ఇతడు నీలిరంగు దేహం గలవాడు. ఒక ముఖం రెండు చేతులు గలవాడు. ఇతడు మూడు కన్నులు కలిగి ఉగ్రస్వభావం గలవాడు. ఇతడు కుడిచేత కర్త్రిని, ఎడమ చేత కపాలాన్ని ధరించినవాడు కుడి, ఎడమ భుజాలపై వాలిన పింగళ కేశాలపై ఐదు కపాలాలు ధరించిన వాడు అతడు కపాల మాలను, సర్పయజ్ఞోపవీతాన్ని కలవాడు. ఇతడు ఓడుతున్న నెత్తురు గల ముఖం గలవాడు ఇతడు నాలుగు చేతులు కల మూర్తిగా కర్త్రి, కపాలం, ఖడ్గం,ఖట్వాంగం ధరించినవాడు ఆరు చేతులమూర్తిగా కర్త్రి, జపమాల, ఢమరుక, కపాలం, శూలం, వజ్రపాశం కలవాడు. ఇతడు పదహారు చేతుల మూర్తిగా ఎనిమిది శిరస్సులు, నాలుగు కాళ్ళు కలవాడు ఇతడు కుడి ఏడుచేతులలో కర్త్రి, వజ్రం, గజచర్మం, ముద్గరం, త్రిశూలం,ఖడ్గం, యమదండం ధరించంగా, మిగిలిన ఏడు ఎడమ చేతులలో రక్తపూర్ణకపాలం, గజచర్మం, ఘంట, అకుశం, శ్వేత చామరం, డమరు, మానవ శిరస్సు కలవాడు మిగిలిన రెండు చేతులతో ప్రజ్ఞను కౌగిలించుకొని ఆలింగన మూర్తిగా ఉంటాడు. ఇతని ఇరవై నాలుగు కన్నులు ఒక ప్రత్యేకత

**7:6:7:3: గణపతి:** ఎర్రని రంగు గల గణపతి జటామకుటం కలవాడు అన్ని ఆభరణాలతో ఉన్న లంబోదరుడు, ఏకముఖుడు, పన్నెండు చేతులు కలవాడు అర్థ పర్యంకాసనంలో నృత్యమూర్తిగా ఉన్న ఇతడు మూడు కన్నులు ఒక దంతం కలవాడు కుడిచేతులలో కుఠారం, బాణం, అంకుశం, వజ్రం, ఖడ్గం, శూలం,ఎడమ చేతులలో ముసలం, విల్లు, ఖట్వాంగం, రక్తపూర్ణకపాలం, అసృక్కపాలం, ఫట్కము కలిగి ఎర్రని పద్మంపై ఎలుకపై తిరిగేవాడు.

**7:6:7:4:** పై ఉదాహరణలలో పేర్కొన్న స్వరూపాల వల్ల ఈ హిందూ దేవత లందరూ ప్రధానంగా తాంత్రిక పరమైన ప్రాముఖ్యం గల వారేనని తెలుస్తుంది. సరస్వతి లోని ఆర్య సరస్వతి అనే రూపం ప్రధానంగా బాల, కౌమారి అనే చిచ్ఛక్తిరూపం వలె ఉంది వజ్ర శారద మూడు కన్నులు కలిగి ఆదిమ శక్తిమత్వాన్ని,శార్వణి స్తితిని సూచిస్తుంది దిక్పాలకులు, గ్రహాలు యధాతథ స్వరూప స్వభావాలనే బౌద్ధ సంప్రదాయంలో కూడా కలిగి ఉన్నారు

**7:6:7:5:** ఇన్ని రకాలైన ప్రతిమా స్వరూపాలు గల బౌద్ధ ప్రతిమా సాంప్రదాయాల్లో జాతక కథలు అనేవి బౌద్ధ పురాణాలుగా ఉండి బోధిసత్త్వుని పరిణామాన్ని సూచిస్తున్నాయి అవి ఒక అట్టడుగున

గల ఆత్మ, విజ్ఞానవంతమై బోధిసత్త్వునిగా ఏ విధంగా పరిణమించింది అనేదానికి నిర్వచనంగా ఉన్నాయి. ఈ జాతక కథలు తొలి రోజులలోని బౌద్ధ సాంప్రదాయాలలోని నమ్మకాలను, ఆచారాలను వివరిస్తాయి. ఇవి ప్రత్యక్షంగా ప్రతిమాలక్షణాన్ని తెలిసికోవడానికి లక్షణ గ్రంథాల్లా ఉపయోగించకపోయినా వీటి ప్రాముఖ్యతను త్రోసిరాజనలేము.

**7:6:7:6:** ఈ విధంగా బౌద్ధ ప్రతిమా లక్షణంలో వివిధ సాంప్రదాయాలు,తత్సంబంధమైన ఆధారాలు, వానిలోని వైవిధ్యాలు గమనించగలం.

•••

# 8

# జైన ప్రతిమలు

**8:1 ఉపోద్ఘాతం :**

**8:1:1:** భారతీయ ప్రతిమా లక్షణ స్వరూప స్వభావాలను అవగాహన చేసికోవడంలో హైందవ బౌద్ధ సాంప్రదాయాలను పరిశీలించిన తరువాత జైన సాంప్రదాయపు ప్రతిమలను గూర్చి వాని లక్షణాలను గూర్చితెలుసుకోవాలి. క్రీ పూ. ఆరవ శతాబ్దంలో బౌద్ధమతంతో పాటే ప్రాచుర్యం పొందినా, బౌద్ధ మతం పొంది నటువంటి విశేష గౌరవాన్నిగాని, మహాభినిష్క్రమణను గాని పొందని మతం జైనమతం. జైనమతం భారతదేశంలో సజీవంగా నిల్చిన మతాలలో ఒకటి. రాజస్థాన్‌లోని మౌంట్ అబూ, కర్ణాటక లోని శ్రావణ బెళగొళ, ఆంధ్రప్రదేశ్‌లోని పిఠాపురం (తూర్పుగోదావరి జిల్లా) వంటి ప్రాంతాలలో జైన మతం విస్తృతాదరణను పొందినా, ఆంధ్రప్రదేశ్ తీర ప్రాంతంలో వీరశైవ ప్రాబల్యంలో బౌద్ధ జైన మతాలు రెండు నశించి పోయాయని పండితారాధ్య చరిత్ర వంటి ఆధార గ్రంథాలవల్ల తెలుస్తుంది.

**8:1:2:** జైనమతంలో ఋషభనాథుడు పార్శ్వనాథుడు మొదలైన తీర్థంకరులు ప్రవక్తలుగా వ్యవహరించారు. వారిలో చివరవాడు, ఇరవై నాలగవవాడు అయిన వర్ధమానుడు గౌతమ బుద్ధుని వలెనే క్షత్రియ వంశంలో జన్మించినా, రాగద్వేషాలను అధిగమించి, సాంప్రదాయిక మత సిద్ధాంతాలను అవలంభించి జినుడయ్యాడు. అతని మతమే జైన మతం.

**8:1:3:** ఈ రకమైన జైనమతం ఎక్కువగా కళింగ దేశంలో విశేషవ్యాప్తిని పొందింది. ప్రధానంగా ఖండగిరి వంటి ప్రాంతాలలో వివిధ దేవాలయాలను నిర్మించి, అనేక రకాలైన ప్రతిమలలో అలంకరించడం జరిగింది ఆంధ్రదేశంలో ప్రధానంగా ఉత్తరంగాను, ఈశాన్యంగాను గోదావరికి ఆ తట్టున ఎక్కువగా జైన ఆధారాలు, పిఠాపురం వంటి చోట్లలో లభ్యం కావడంవల్ల కళింగ ప్రాంతంనుంచి ఆమతం దక్షిణంగా గోదావరి తీరానికి వ్యాప్తి పొంది ఉంటుందని ఊహించవచ్చు. అదే విధంగా, తెలంగాణ ఆప్రాంతంలో మెదక్ జిల్లాలోని పటాన్ చెరువు, జోగిపేట వంటి ప్రాంతాలలొ గల జైన సాంప్రదాయం దృష్ట్యాను, జైన మత దేవళాలు దృష్ట్యాను ఈ ప్రాంతం అంతా కాకతీయులకు ముందుకాలంలో కళ్యాణి చాళుక్యుల ఏలుబడిలో ఉండడంవల్ల కర్ణాటక లోవిస్తృతంగా జైన మత వ్యాప్తి చెంది ఉండడం వల్ల; పశ్చిమాంధ్రంలోని జైన మతం ప్రధానంగా కర్ణాటక రాష్ట్రం నుంచి వ్యాపించి ఉందనడానికి అవకాశం హెచ్చుగా ఉంది. అలాగే కృష్ణానదీ పరీవాహక ప్రాంతంలోనికర్నూలు జిల్లాలోగల అశోక శాసనాల దృష్ట్యా, బౌద్ధమతం కృష్ణానదీపరివాహక ప్రదేశంలో విరివిగా వ్యాపించిందనడానికి దృష్టాంతం కృష్ణాతీరంలోని నాగార్జున కొండ, అమరావతి జగ్గయ్యపేట వంటి వివిధ స్థలాలలో స్తూపాలుండడమే పై అంశాలదృష్ట్యా. జైన మత విస్తరణ కళింగ నుంచి దక్షిణంగా తీరాంధ్రంలోనికిగోదావరి పర్యంతం; కర్ణాటక నుండి ఉత్తరంగా

పశ్చిమాంధ్రం మొదలైన దక్కనులోని ప్రాంతాలకు విస్తరించి ఉందనటానికి చారిత్రక అవకాశాలు, అధారాలు హెచ్చుగా ఉన్నాయి. అలాగే గంగానదీ పరీవాహక ప్రదేశంలో బౌద్ధమత ప్రాబల్యం విశేషంగా ఉండటం వల్ల జైన సాంప్రదాయం యమున నదిని తరించి పశ్చిమంగా రాజస్థాన్ ప్రాంతాలలో విస్తరించింది. అంటే ఈ రకంగా జైనమతం ఉత్తర భారతదేశంలో గంగా-యమునా పరీవాహక ప్రదేశంలో తన ఉనికి కోల్పోయి ఆగ్నేయంగా చేదిరాజ్యానికి, ఉత్కళ రాజ్యానికి వచ్చి అక్కడి నుంచి గోదావరి వరకు వ్యాపించింది. అదే విధంగా పశ్చిమాన రాజస్థాన్‌లోను, దక్షిణాన కర్ణాటక లోను వివిధ కేంద్రాలు ఏర్పరచుకొని సమీప ప్రాంతాలలో జైన మతం ఇబ్బడి ముబ్బడి అయిన (రెండింతలు, మూడింతలు అయిన) గౌరవాన్ని పొందింది.

**8:1:4:** జైనులు స్తూపాలను గాక ఆలయాలనే నిర్మించుకున్నారు. వారిలో దిగంబరులు, శ్వేతాంబరులు అనే రెండు శాఖలున్నా దిగంబరులు రాను రాను తమ స్థితి కోల్పోయి, మారుతున్న పరిస్థితులు దృష్ట్యా శ్వేతాంబరులులో కలసిపోయి ఉంటారు, అని అనడానికి అవకాశాలు హెచ్చు మథురలో మాత్రం ఒక జైన స్తూపం కుషాణుల కాలానిది ఉన్నట్లు చెప్పబడింది

**8:1:5:** జైన మతంలోని ప్రతిమలలో హిందూసాంప్రదాయాలు విశేషంగా చోటు చేసుకున్నాయి. వినాయకుడు, సరస్వతి వంటి దేవతామూర్తులు యధాతథంగా జైనుల పూజలందుకొన్నారు. అలాగే వారు వాస్తు శైలిలో త్రికూట దేవాలయాలు వంటి దేవాలయ స్వరూపాలను కూడా తమ నిర్మాణ వ్యవస్థలో చేర్చుకున్నారు తద్వారా, హిందూమతానికి జైన మతానికి మధ్య దూరంబాగా తగ్గింది

**8:1:6:** జైన ప్రతిమలలో రెండు ప్రధాన రకాలను చూడగలం. అవి స్థానకమూర్తులు అసీన మూర్తులు ఎక్కువగా వర్ధమాన మహావీరుడు ఎప్పుడు స్థానకమూర్తిగా దిగంబరుడుగానే చూపబడ్డాడు. అదేవిధంగా మిగిలిన దేవతలను హెచ్చుగా అసీనమూర్తులుగానే చూపడం జరిగింది

**8:1:7:** జైన తీర్థంకరులు విశాలవక్షస్థలంలో, అర్ధనిమీలత నేత్రాలతో చూపబడ్డారు. వారి చెవులకు పెద్ద పెద్ద కుండలాలు ఉండడం కద్దు కొన్ని శిల్పాలలో జైన తీర్థంకరులు పద్మంపై కూర్చొన్నట్లు చూపబడి ఉండగా, మరికొన్నింట వారు ఏడు తరాల పాము పడగ గొడుగులాగా కలిగి ఉన్నట్లు చూపడం జరిగింది పద్మం మీద కూర్చున్నట్లు చూపడం వారి ఆధ్యాత్మిక వికాసానికి, నాగచ్ఛత్రమూర్తులుగా చూపడం వారి కి గల భాగవత్తత్వానికి గుర్తులుగా మనం గమనించవచ్చు

**8:8:** వివిధ ప్రాంతాలలో తీర్థంకరుల ప్రతిమలు లభ్యం కావడం జరిగింది. వాని వాని స్వరూపాలను గూర్చి ఈ కింది విధంగా తెలుస్తుంది

**8:2: తీర్థంకరులు**

**8:2:1: ఋషభనాథుడు : (చూడుడు ఫోటో. 17)**

**8:2:1:1:** ఇతని ప్రతిమలు ఎక్కువగా ఒరిస్సాలో లభ్యమయ్యాయి పూరీ జిల్లాకు చెందిన బగల్పూర్, ఛదియబార్, ఖడగిరి, నిభరణ, బ్రహ్మేశ్వరపట్నం, కొరాపూట్ జిల్లాకు చెందిన

సుఆయిజేపూర్, కుచేలా మొదలైన చోట్లనే గాక, కటక్ లోని జైనాలయం మొదలైనవి ఈ తీర్థంకరుని ప్రతిమలను కలిగి ఉన్నాయి ఇతడు తీర్థంకరులలో మొట్టమొదటి వాడుగా జైన సాంప్రదాయం ధ్రువపరుస్తుంది ఇతని ప్రతిమలు ఎక్కువగా 'కాయోత్సర్గ' ముద్రలో నిలబడి గాని, ధ్యానముద్రలో ఒకటి లేదా రెండు రేకులు గల పద్మ పీఠం మీద కూర్చొని ఉన్నట్లుగాని ఉంటాయి ఆసీన ప్రతిమలు ఒక్కొక్కసారి అలంకృతమైన పీఠాలపై కూడా చూపడం జరిగింది. పీఠం మధ్యభాగలలో అతని లాంఛనమైన ఎద్దును కూర్చున్నట్లు చూపడం తప్పనిసరిగా జరుగుతుంది అరుదుగా ఈ రకమైన లాంఛనం చూపడం జరుగదు ఉదాహరణకు భాగ్‌పూర్ ప్రతిమలలో ఇది లేదని మొహాపాత్రా తెలుపుతున్నారు ఇతని శిరస్సుపై భుజాల వరకు వేలాడేంత పెద్ద జటాభారం ఉంది. స్థానక మూర్తిగా ఇతడిని చూపుతున్నప్పుడు ఇతనికిరువైపులా చామరగ్రాహిణులను, శిరస్సు చుట్టు ప్రభావళి చూపడం జరిగింది. జటాభారాన్ని అరుదుగా కొప్పుగా ముడివేసి, జటామకుటంలాగా తీర్చిదిద్దడం జరుగుతుంది ఒక్కొక్కసారి పీఠభాగంలో లాంఛనంతో బాటుగా సాంజలు లయి మొక్కుతున్న భక్తులను కూడా చూపడం జరిగింది. సుఆయి, కచేలా మొదలైన ప్రాంతాలలో లభ్యమైన ప్రతిమలలో గరుడవాహన అయిన చాక్రేశ్వరి అనే శాసనదేవి, నిలబడిన గోముఖుడనే యక్షుడు, పీఠానికి ముందుగా ఇరువైపులచూపబడ్డారు. కేవల వృక్షమని పేరొందిన న్యగ్రోధం (రావిచెట్టు) ఆకులు ఇరువైపులా రావడం, మూడు రేఖలుగా చూపిన గోడును, శిరస్సు వెనుక గుండ్రని లేదా కోల ప్రభావళి, మాలాహస్తులయిన ఎగురుతున్న గంధర్వులు కనపడని గంధర్వుల చేతిలో గల తాళాలు లేదా తప్పెటలు, వివిధ దేవతా మూర్తులు మోస్తున్న శంఖాలు సామాన్యంగా ఈ ప్రతిమ ప్రధానరూపానికి ఉండడం జరుగుతుంది వీనిని అష్ట ప్రతిహార్యాలు అని వ్యవహరించడం జరిగింది ఋషభనాధుని ప్రతిమలకు ఇరువైపులా కేతువు మినహా మిగిలిన ఎనిమిది గ్రహాల ప్రతిమలను కూడా చెక్కడం జరుగుతుంది

**8:2:1:2:** ఋషభనాధుడు జైన మతస్థాపకుడు ఇతనిని మూలనాయకుడని కూడా వ్యవహరించడం జరిగింది. అతనికిరువైపులా మిగిలిన ఇరవై రెండు మంది తీర్థంకరులను చిన్న చిన్న ప్రతిమలుగా కూడా చూపడం జరుగుతుంది ఆది నాధుడు అని కూడా అనే ఋషభనాధుని మెడమీద మూడుగీతలు (త్రివళి) తప్ప కుండా ఉంటుంది కాని అతని హృదయంపై శ్రీవత్సలాంఛనం కనిపించడం ఒరిస్సా ప్రాంతంలో తక్కువగా ఉంది. రెండు వైపులా పద్మం, చంపక్రకాల చిహ్నాలు మోరలకెత్తిన లేదా సామాన్యంగా ఉన్న ఏనుగులు, కీర్తిముఖచిహ్నం, గజవిదాళములచే మోయబడిన మకర తోరణాలు కూడా ఋషభనాధుని ప్రతిమలతో పాటు కన్పడుతున్నాయి. వృషభ లాంఛనం మినహా అష్ట ప్రతిహారాలను లేని ఋషభ నాధుని ప్రతిమలను అరుదుగా చూడగలం ఉదాహరణకు కోరాపూట్ జిల్లాకు చెందిన బి సింగపూర్ లో అటువంటి ఆసీన ప్రతిమలను చూడగలం సామాన్యంగా ఋషభనాధుని ప్రతిమలన్నింటా యౌవనోద్దీపమైన శరీరం, దేహయష్టి, పొడవైన చెవులు కనబడతాయి ఆసీన ప్రతిమలలో విశాలవక్షం, నాసాగ్రంపై దృష్టి పరపిన కన్నులు, అంతరవలో కనం కనిపిస్తాయి. కంచు ప్రతిమలు కూడకాయోత్సర్గ ముద్రలో (యోగాసన) గలవి లభ్యమవుతున్నాయి

**8:2:2: అజితనాథుడు :**

**8:2:2:1:** ఇతడు తీర్థంకరులలో రెండవవాడు. ఇతని తల్లి స్వప్నంలో ఏనుగును చూసింది. అతడు జన్మించిన తరువాత అతని తండ్రి తన శత్రువులందరిని జయించడం వల్ల అతనికి అజితనాథుడనే పేరువచ్చింది. ఇతని ప్రతిమలన్నీ పద్మాలంకృతమైన లేదా నిరలంకృతమైన పీఠాలపై కాయోత్సర్గముద్రలో చూపబడుతున్నాయి మహావీర గుంఫా, చరంపా, బి.సింగపూర్ వంటి చోట్ల గల ఈ ప్రతిమల్లో పీఠాలను సింహాలు మోస్తున్నట్లు చూపడం జరిగింది. అజితనాథుని స్థానకమూర్తిగా చూపినపుడు ఇతని లాంఛనమైన ఏనుగును చూపిస్తారు. అష్ట ప్రతిహార్యాలు కూడా సామాన్యంగా చూపబడతాయి. అంజలి ముద్రలో మొక్కుతున్నభక్తులను కూడా చూపడం జరుగుతుంది. ఆరు చేతులు గలిగి, కూర్చొని ఉన్న స్థితిలో గల 'రోహిణి'ని కూడా అజితనాథుని తో బాటుగా చూడగలం రోహిణి అజితనాథుని శాసన దేవిగా చెప్పబడింది. ఇతని ప్రతిమలలోకేశపాశం అంతా జటామకుటంలా మలిచారు. మహావీరగుంఫాలో అజితనాథుని సమీపంలో సూర్యచంద్రులు సంకేతాలు, మూడు రేఖలతో రణం, అంజలి ముద్రలో ఉన్న నాగశరణులు, పవిత్ర జలాన్ని చిలుకుతున్న వివిధ దేవతలను చూపడమైంది.

**8:2:3: సంభవనాథుడు :**

**8:2:3:1:** ఇతని ప్రతిమలు చాలా అరుదు ఖండగిరికి చెందిన నవముని, బారభుజి, మహావీర గుహలలో ఇతని ప్రతిమను చూడగలం ఇతనికి గుర్రం లాంఛనం రెండు జతలసింహాలు మోస్తున్న పద్మ పీఠికలపై, అశ్వలాంఛనుడైన సంభవనాథుణ్ణి చూపడం జరుగుతుంది అష్ట ప్రతిహార్యాలలో శాలి, కేవలవృక్షం, త్రిరేఖా ఛత్రం మాత్రం చూపడం జరిగింది ప్రతిమ కిరువైపులా చామరగ్రాహిణులు కూడా ఉంచబడ్డారు శిరస్సు వెనుక కోలగా ఉన్న ప్రభావళి, మాలా హస్తులైన విద్యాధారలు కూడా చూపబడ్డారు

**8:2:4: అభినందన నాథుడు :**

**8:2:4:1:** కోతి ఇతని లాంఛనం శిరస్సుపై త్రిరేఖా ఛత్రం, ఇరువైపులాఛమర గ్రాహిణులు, పద్మపీఠాన్ని మోస్తున్న ఏనుగులు, ప్రభావళి, మాలాహస్తులైన ఖేచరులు ఇతనికి గుర్తులు

**8:2:5: సుమతినాథుడు :**

**8:2:5:1:** బాతువంటి నీటి పక్షి ఇతని లాంఛనం ఇతని శిరస్సు వెనుక ప్రభావళి, ఇరువైపులా చమర గ్రాహిణులు, పద్మపీఠం దిగువన దానిని మోస్తున్న సింహాలు మాలాహస్తులైన ఖేచరులను చూపడం జరిగింది. ఒక చిన్న ప్రతిమలో ఇతని శిరోభారానికి ఇరువైపులా నీటిని చిమ్ముతున్న ఏనుగులు, ఒక చక్రం చూపడం జరిగింది ఇతడు ప్రియాంగు వృక్షం కింద కేవలుడైనట్లు చెప్పబడింది

**8:2:6: పద్మప్రభు :**

**8:2:6:1:** బాగా వికసించిన పద్మం ఇతని లాంఛనం. ఇతడిని ఆసీన మూర్తిగాను, స్థానకమూర్తిగాను కూడా చూపడం జరిగింది. ఇతడు ఆసీనుడైన పద్మ పీఠికను సింహాలు మోస్తాయి ప్రభామండం, మాలాహస్తు లైన ఖేచరులు, కేవలం వృక్షం కొన్ని చోట్ల చూపబడలేదు ఉదాహరణకు

ఖండగిరిలోని మహావీర గుంఫాలో అటువంటి ప్రతిమ ఉంది. కాని సాంప్రదాయికమైన చామర గ్రాహిణులు, మూడు రేఖల ఛత్రం, మాలావహస్తులైన గంధర్వులు వంటివి చూపడం జరిగింది పద్మప్రభుని కేవలవృక్షాన్ని ఛత్రభ అంటారు

**8:2:7: సుపార్శ్వనాథుడు :**

**8:2:7:1:** ఇతని లాంఛనం స్వస్తిక గుర్తు ఇతడు పద్మ పీఠంపై, ధ్యానముద్రలో ఉన్న ప్రతిమలు బారభుజి గుంఫా, మహావీర గుంఫాలలో ఉన్నాయి. పద్మపీఠాన్ని రెండు సింహాలు మోస్తున్నట్లు చూపడం జరిగింది. శిరీషవృక్షం కింద ఇతడు కేవలుడైనాడు. వింజామర గ్రాహిణులు, త్రిరేఖాచంత్రం, శిరీషవృక్షం, మాతాహస్తులైన ఖేచరులు చూపబడినారు. ఇతడు ఒకటి లేదా ఐదు లేదా తొమ్మిది పడగల పాముతో ఉండాలని కొన్ని జైన లక్షణ గ్రంధాలు ఆదేశిస్తున్నాయి బాలాసోర్ జిల్లాలోని మాణిక్‌భాక్ వంటి చోట్ల దొరికిన ప్రతిమలలో జింకను ఇతని లాంఛనంగా చూపడం జరిగింది కాని దానిని లాంఛనంగా లక్షణ గ్రంధాలలో చెప్పలేదు బరిపాద వద్దగల బాదజగన్నాధస్వామి దేవళంలో తొమ్మిది పడగల పాముతో కప్పబడిన సుపార్శ్వనాధుని ఆసీన మూర్తిని చూడవచ్చు.

**8:2:8: చంద్రప్రభ :**

**8:2:8:1:** ఇతని తల్లి చంద్రుని స్వప్నంలో కనడం వల్ల ఇతనికి చంద్రప్రభ అనే పేరు వచ్చిందని జైన గ్రంథాలు చెప్తున్నాయి. అంతేగాక ఇతడు చంద్రుని వంటి తేజస్సు (ప్రభ) ను కలిగి ఉండడం వల్ల ఇతనిని చంద్రప్రభ అనే పేరుతో పిలవడం జరిగింది. ఇతనికి అర్ధచంద్రుడు లాంఛనం. నరసింహపురం వద్ద దొరికిన ఒక ప్రతిమలో ఇతడు నిరలంకృతమైన పీఠికపై, కాయోత్సర్గముద్రలో త్రిరేఖా ఛత్రం, మాలహస్తులైన ఖేచరులు, చంద్రరేఖలతో చూపబడినట్లు, అష్ట ప్రతీహార్యాలు లేనట్లు గాను తెలుస్తుంది ఖండగిరి దగ్గర దొరికిన ప్రతిమలులో ఇద్దరు చామ గ్రాహిణులు, సింహాలు మోస్తున్న పద్మపీఠికలు, త్రిరేఖాచత్రం సామాన్యంగా ఉన్నాయి ఇతడు నాగకేసర వృక్షం కింద కేవలత్వాన్ని పొందాడు నాగకేసర వృక్షం, అదృశ్యులైన ఖేచరుల చేతిలోని తాళాలు, కోలగా ఉన్న ప్రభావళి, మాలాహస్తులైన గంధర్వులు బారభుజి గుంఫాలో గల ప్రతిమలో చూడగలం. దిగంబరుడైన చంద్రప్రభ ఆసీనుడయి సమపర్యంకాసనం (పాదాలు అడుగు కనపడేటట్లు పైకి ఏర్పరచడం) లో యోగముద్ర (ఎడమ అరచేయికి పైన కుడి అరచేతిని పొత్తికడుపు వద్ద ఉంచడం) లో ఉన్న ప్రతిమలు కూడా ఉన్నాయి.

**8:2:9: సువిధనాథుడు లేక పుష్పదంతుడు:**

**8:2:9:1:** ఇతడు జన్మించడం తోడనే బంధువర్గాల మధ్య సంఘర్షణ సమసిపోయి సువిధి ఏర్పడడం వల్ల ఇతని సువిధుడని ఇతని దంతాలు పూవుల మొగ్గల వలె ఉండడంవల్ల ఇతనిని పుష్ప దంతుడని వ్యవహరించడం జరిగింది మొసలి (Alligator) ఇతని లాంఛనం నాగమల్లి వృక్షం కింద ఇతడు కేవలత్వాన్ని పొందాడు ఇతని తల వెనుక కోల వంటి ప్రభామండలం, మాలాహస్తులైన ఖేచరులు, అదృశ్యులైన గంధర్వులు మ్రోయిస్తున్న తాళాలు ఇతనితో బాటుగా చూపడం జరిగింది. అరుదుగా సంకేతాత్మకమైన పద్మ పుష్పాలు, శిరస్సుకు పైన అర్ధగోళాకార తోరణం కనపడుతున్నాయి.

కింద కేవలత్వం పొందాడు సాంప్రదాయికమైన అష్ట ప్రతీహార్యాలు ఇతని ప్రతిమలలో ఉన్నాయి

**8:2:15 ధర్మనాథుడు :**

**8:2:15:1** తల్లి గర్భంలో ఇతనున్నపుడు ఆమె అనేక రకాల ధర్మ కార్యాలు చేయడం వల్ల ఇతనికి ధర్మనాధుడనే పేరు వచ్చింది. అదే విధంగా ఇతడు అనేకుల దుఃఖాన్ని అణచివేయడం వల్ల ఇతడిని ధర్మనాధుడని పిలవడం జరిగింది ఇతని చిహ్నం వజ్రం, ఇతడు దధిపర్ణ వృక్షం కింద కేవలత్వం పొందాడు.

**8:2:16 శాంతినాథుడు**

**8:2:16:1** పదహారవ తీర్థంకరుడైన శాంతినాధుడు జైన మతాన్ని క్షీణత్వం బారినుండి రక్షించి బలపరిచాడు. ఇతని తల్లి దేశంలో అంటురోగం వ్యాపించినప్పుడు, బాధితులను శాంతితీర్థంతో రక్షించినందువల్ల ఇతనికి శాంతినాధుడనే పేరువచ్చింది. ఇతడు నందివృక్షం కింద కేవలత్వం పొందాడు ఇతని లాంఛనం జింక (deer) ఇతని ప్రతిమలో ఒకదానిలో ఐదు పడగల పాముతో పరివేష్టితుడిగా చూపబడడం అరుదైన లక్షణం. ఈ ప్రతిమను ఒరిస్సాలోని మాణిక్పక్‌లో చూడగలం ఇతడు కేతువు మినహా మిగిలిన ఎనిమిది గ్రహాలతోను పరివేష్టితుడైనట్లు కూడా చూపబడింది. ఇతని కేశాలను జటామకుటం లాగా చూపడం జరిగింది. మార్టసాల్‌లో దొరికిన ప్రతిమలో ఇతని శాసనదేవి మహామానసి కూడా చూపబడింది

**8:2:17 కుంథునాథుడు :**

**8:2:17:1** 'అభిధాన చింతామణి' ప్రకారం ఇతనికి ఈ పేరు రావడానికి రెండు కారణాలున్నాయి అవి ఒకటి అతని తల్లికలలో రత్నాలకుప్ప (కుంథ) ను చూడడం, అంతేగాక అతడు స్థిరంగా భూమిమీద నిలవడం వల్ల ఇతనికి కుంథునాధుడు అనిపేరు వచ్చింది. ఇతడు తిలక వృక్షం కింద కేవలత్వాన్ని పొందాడు ఇతని చిహ్నం మేక. ఇతనికేశపాశం ఉష్ణీషంతో కూడిన జటామకుటంలాగా తీర్చబడింది.

**8:2:18 అరానాథుడు :**

**8:2:18:1** ఇతని తల్లి కలలో రత్నాలు పొదిగిన అర (చక్రం) ను చూడడం వల్ల ఇతనికి అరానాధుడనే పేరు వచ్చింది. ఇతడు చూత (మామిడి) వృక్షం కింద కేవలత్వాన్ని పొందాడు. నంద్యావ్రతమనే ఒక రకమైన స్వస్తిక ఇతని లాంఛనం కోలవంటి ప్రభామండలం, మాలాహస్తులైన ఖేచరులు, సూర్యచంద్రులు, ఇతని ప్రతిమలలో అరుదుగా కనిపిస్తారు

**8:2:19 మల్లినాథుడు :**

**8:2:19:1** ఇతని తల్లి, ఇతడు గర్భస్థుడై ఉండగా మల్లెపూవులను కోరడం వల్ల ఇతని మల్లినాథుడనడం జరిగింది ఇతడు అశోక వృక్షం కింద కేవలత్వాన్ని పొందాడు. ఇతని చిహ్నం జలకలశం ఇది అష్టమంగకాలలో ఒకటిగా చెప్పబడింది ఇతడు స్త్రీ అని శ్వేతాంబర సాంప్రదాయంలో చెప్పడం జరిగింది కాని అతనిని ఎక్కడా స్త్రీలక్షణాలతో చూపడం జరగలేదు.

**8:2:20 మునిసువ్రతుడు**

**8:2:20:1** ఇతడు ముని అంతేగాక ఇతడు ఆడిన మాటను నిలిబెట్టుకొనే వాడైనందువల్ల ఇతనిని మునిసువ్రతుడనడం జరిగింది. ఇతడు చంపక వృక్షం కింద కేవలత్వం పొందాడు. తాబేలు ఇతని చిహ్నం

**8:2:2.1 నేమినాథుడు**

**8:2:21:1** ఇతడు అరిష్టనేమి అని, శ్రీకృష్ణునికి పినతండ్రి అని కూడా చెప్తారు. ఇతని తల్లి కలలో ఇంద్రనీలాలు పొదిగిన చక్రాన్ని చూడటం వల్ల ఇతనికి నేమినాధుడనే పేరువచ్చింది. ఇతని పరిధి ధర్మ చక్రం, అంటే ధర్మాన్ని దాటిపోడు గనుక ఇతనిని నేమినాధుడని కూడా వ్యవహరించడం జరిగింది. ఇతడు మహావేణు వృక్షం కింద కేవలత్వం పొందాడు శంఖం ఇతని చిహ్నం ఇతనిని తన శాసన దేవి అయిన అంబికతో కలిసి అంబికలేకను కూడా వివిధ ప్రతిమలలో చూపడం జరిగింది ఇతని పీఠాన్ని సింహాలు కాక నెమళ్లు మోస్తున్నట్లున్న ఒక ప్రతిమను బారభుజి గుంఫా లో గమనించడం జరిగింది ఇది లక్షణపరంగా అరుదైన అంశం

**8:2:23 పార్శ్వనాథుడు (చూడుడు 18 ఫోటో)**

**8:2:23:1** ఇతడు ఋషభనాధుని తరవాత ఎక్కువ ప్రఖ్యాతి పొందినవాడు ఇతని తల్లి కలలో కృష్ణవర్ణంతో కూడిన సర్పాన్ని చూడటంవల్ల, ఇతడు పార్శ్వుడనే యక్షునికి నాధుడవడం వల్ల, ఇతడు జ్ఞానంద్వారా వివిధ అభిప్రాయలను తాకగలిగినా వాడవడం వల్ల పార్శ్వ నాధుడని పేరు వచ్చినట్లు జైన సాంప్రదాయం ద్వారా తెలుస్తుంది ఇతడు దేవదారు వృక్షం కింద కేవలత్వాన్ని పొందాడు కాని శిల్పాలలో 3,7,11 పడగలు కూడా చూపినట్లు భట్టాచార్యులు తెలుపుతున్నారు. కాని ఇతనిపై తొమ్మిది పడగల ఛత్రం ఉండాలని గణధరసరధా శతకంలో వివరించబడింది ఇది సాంప్రదాయ వైవిధ్యాన్ని సూచిస్తుంది ఇతడు శరీరంపై శ్రీవత్సలాంఛనం కలవాడు పద్మావతి ఇతని శాసన దేవి. సర్పం ఇతని లాంఛనం.

**8:2:24 మహావీరుడు (చూడుడు 19 ఫోటో)**

**8:2:24:1** తీర్థంకరులలో ఆఖరివాడు క్రీ పూ 6వ శతాబ్దిలో జైన మతాన్ని విస్తృతంగా వ్యాప్తి చేసిన వాడయిన మహావీరుడు వర్ధమానుడని, మహావీరుడని పిలువబడినాడు ఇతడు 'జినుడు' అవడం వల్ల ఇతడు వ్యాప్తి చేసిన ఈ మతానికి జైన మతం అనే పేరు వచ్చింది జినులనే కేవలులు అని వ్యవహరించడం కూడా ఈ మత సాంప్రదాయంలో జరిగింది సిద్ధాయిక ఇతని శాసన దేవి ఇతడు మతంగుడనే యక్షునికి అధినాధుడు ఇతడు కర్మదూరుడవడం వల్ల ఇతనికి వీరుడని, మహావీరుడని పేరు వచ్చింది. ఇతని లాంఛనం సింహం ఇతడు సాలవృక్షం కింద కేవలంత్వం పొందాడు·

**8:2:25** తీర్థంకరులందరూ సర్వసాధారణంగా వారి వారి లాంఛనాలతోను, వారి వారి కేవల వృక్షాలతోను ఆసీనులయి ధ్యానముద్రలోను, స్థానికమూర్తులుగా కాయోత్సర్గముద్రలోను చూపబడతారు అష్టగ్రహాలు, యక్షులు, విద్యాధరులు, ఖేచరులు, సర్పాలు, ఏనుగులు, సింహాలు మొదలైన జంతువులు మొక్కుతున్నట్లుగానిరలంకృతమైన పీఠాలపైగాని, పద్మపీఠికలపైగాని

చూపబడతారు. వీరందరినీ ఒక్కొక్కసారి వారివారి శాసన దేవులతో కలిసి ఉన్నట్లు, కలవకవిడిగా ఉన్నట్లు కూడ చూపించడం జరిగింది.

**8:3 శాసనదేవులు**

**8:3:0** తీర్థంకరులుగా చెప్పబడి, కైవల్యాన్ని పొంది, జీనులయి, జైన మతాన్ని వ్యాప్తి చేసిన ఇరవైనలుగురు పొందిన శక్తికి మూర్తిమత్వంగా వారికి 'శాసనదేవి' అనే పేరిట విడివిడిగా ఇరవైనాలుగు మూర్తులను ఏర్పరచడం జరిగింది దానిని గూర్చి ఈ కింది విధంగా తెలియవచ్చు.

**8:3:1 చక్రేశ్వరి :** ఈమె మొట్టమొదటి తీర్థంకరుడైన ఋషభనాధుని శాసనదేవి. ఈమెకు గరుడుడు వాహనం ఈమెను రెండు, నాలుగు, ఆరు, పది, పన్నెండు, పదహారు చేతులతో కూడ చూపడం జరిగింది ఆమెను విడిగా కాని, ఋషభనాధుని పీఠంపై కాని చూపడం జరిగింది. ఆమెను పీఠం మీద చూపినపుడు లలితాసనంలోగాని, పద్మాసనంలోగాని చూపడం జరుగుతుంది. పదిచేతులు గల ఈమె ప్రతిమను బారభుజి గుహలో చూడగలం. (చూడుడు ఫోటో 20) ఈమెకు సాంప్రదాయికమైన వాహనమైన గద్ద (గరుడుడు) తో బాటు నెమలిని కూడ చూపడం జరిగింది. ఆమెను పదహారు చేతులతో చూపినపుడు కుడి చేతులలో ఖడ్గం, గోళం, చంద్రరేఖ, చక్రం, శంఖం, వజ్రం, జపమాల, వరదముద్ర చూపగా, ఎడమచేతిలో గోళం, గద, చక్రం, శూలం, వజ్రం, కలశం, మరొక వస్తువు, డాలు కలిగి ఉంది ఈమె నెన్నుదుట మూడవ కన్ను ఉంటుంది.

**8:3:2 రోహిణి :** ఈమె అజిత నాధుని శాసన దేవి ఈమె వాహనం ఏనుగు కాని బారభుజి గుహలో ఈమెకు ఎద్దువాహనంగా చూపబడింది. ఈమెను, లలితాసనంలోగాని, పద్మాసనంలోగాని చూపడం జరుగుతుంది నెన్నుదుట మూడవ కన్ను ఉంటుంది. ఈమె నాలుగు చేతులతో చూపబడినప్పుడు కుడివైపు వజ్రం, అభయముద్ర ఎడమవైపు అంకుశం, శూలం ఉంటాయి. పద్మాసనంలో ఉన్న ఒక రోహిణీ మూర్తిలో రెండు చేతులు ఒకదానిపై ఒకటి ఉంచబడగా ఎడమవైపున పాత్ర, డాలు,ఘంట, త్రిదండి,విల్లుండగా, కుడివైపు వజ్రం, చక్రం, ఖడ్గం, అమ్ము ఉండి ఒక చేయి విరిగినట్లు సువాయి ప్రతిమలో తెలుస్తుంది రోహిణీ మూర్తిని హారాలు, దుద్దులు, కుండలాలు, గాజులు, కంకణాలు, కడియాలు వంటి ఆభరణాలతోను, చీరతోను అలంకరించడం జరిగింది (చూడుడు ఫోటో 21)

**8:3:3 ప్రజ్ఞాప్తి :** ఈమె మూడవ తీర్థంకరుడైన సంభవనాధుని శాసనదేవి ఈమె రెండు చేతులు గల మూర్తి ఎడమ చేత నీలికలువను దాల్చి, కుడిచేయి అభయముద్రలో ఉండగా, లలితాసనంలో చూపబడుతుంది. ఈమె హారం, గాజులు, అందెలు దరించి జటామకుటాన్ని కలిగి ఉంటుంది. ఈమెను నాలుగు, ఆరుచేతులతో కూడ చూపడం జరిగింది ఈమెకు శ్వేతాంబరదురితారికి పోలికలు హెచ్చు

**8:3:4 వజ్రశృంఖల :** ఈమె నాలుగవ తీర్థంకరుడైన అభినందన నాధుని శాసనదేవి. ఈమె లాంఛనం కోతి. ఈమె లలితాసనంలో నిరలంకృతమైన పీఠంపై చూపబడింది లక్షణ గ్రంథాల ప్రకారం ఈమె లాంఛనం హంస. ఈమె నాలుగు చేతులు గల మూర్తి. ఎడమవైపు శంఖాన్ని, శిశువును, కుడివైపున చక్రం ధరించి వేరొక చేతితో అభయమును సూచించుచుంది. ఈమె సప్త

మాతృకలలో ఒకరైన వైష్ణవితో పోలి ఉంది ఈమెను ఎనిమిది చేతులతో కూడ చూపడం కద్దు.

**8:3:5 పురుషదత్త :** ఈమె ఐదవ తీర్థంకరుడైన సుమతీనాథుని శాసనదేవి ఈమె విద్యాదేవి అని, కోయిల వాహనంగా కలది అని జైన లక్షణ గ్రంధాల్లో చెప్పబడింది. కాని బారభుజి గుంఫా మొదలైన చోట్ల ఆమె మొసలిని వాహనంగా కలిగినట్లు చెప్పడం జరిగింది అలాగే అసాంప్రదాయికమైన రీతిలో ఆమెను పదిచేతులగల శక్తిగా చూపడం జరిగింది. కుడిచేతులలో ఒకటి వరద ముద్రలో నుండగా, మిగిలిన వానిలో చక్రం, బల్లెం, ఖడ్గం, స్ఫుటంగా ఉండి, ఒకదానికి ఇదమిత్థమైన రూపు పోయింది. ఎడమ చేతులలో పాశం, డాలు , హలం, సమ్మెట, నీలి కలువ చూపబడ్డాయి.

**8:3:6 మనోవేగ :** ఈమె ఆరవతీర్థంకరుడైన పద్మ ప్రభుని శాసనదేవి. ఈమె వాహనం హంస ఈమె నిరలంకృతమైన పీఠంపై లలితాసనంలో ఉంటుంది. లక్షణ గ్రంథాలలో ఈమె వాహనం గుర్రం అని, ఈమెకు నాలుగు చేతులు ఉండి వానిలో ఖడ్గం, బల్లెం, ఫలం, వేరొకటి వరద ముద్రలో ఉంటుందని చెప్పబడింది కాని ఎడమ చేతులలో శంఖం, ధ్వజం ఉండగా పై కుడిచేత ~~ధ్వజం ధరించి~~, దిగువకుడిచేయి వరద ముద్రలో ఉన్నట్లు చూపబడింది.

**8:3:7 కాళి :** ఈమె ఏడవ తీర్థంకరుడైన సుపార్శ్వనాథుని శాసనదేవి నెమలి ఈమె చిహ్నం. ఈమె ఎనిమిది చేతులు కలది కుడిచేతులలో ఒకటి వరద ముద్రలో ఉండగా,, మిగిలిన వానిలో ఫలపాత్ర, బల్లెం, ఖడ్గం, ఎడమ చేతులలో శంఖం, సమ్మెట, ఈటెలతో చూపబడింది. ఇది అసాంప్రదాయకమే. ఆమె నాలుగు చేతులలో శూలం, ఫలం, వరద ముద్ర, ఘంట చూపబడాలని, ఆమె వాహనం ఎద్దు అని చెప్పబడింది

**8:3:8 జ్వాలామాలిని :** ఎనిమిదవ తీర్థంకరుడైన చంద్రప్రభుని శాసనదేవి ఈమె ఈమె పన్నెండు చేతులు గలది కుడిచేతులలో వరదముద్ర, ఛుంక, చక్రం, అమ్ము, గద, ఖడ్గం, ఉండగా, ఎడమచేతులలో వరద ముద్ర, డాలు, విల్లు, శంఖం, పాశం, ఘంట ఉంటాయి లక్షణం ప్రకారం ఈమెకు వాహనం మహిషం, చేతులు ఎనిమిది మాత్రమే.

**8:3:9: మహాకాళి :** ఈమె తొమ్మిదవ తీర్థంకరుడైన పుష్పదం తుని శాసనదేవి. లక్షణం ప్రకారం ఈమె కూర్మవాహనం కలిగి, కుడిచేతులలో వజ్రం, గద,హలం, వరద ముద్ర, చక్రం, పక్షి, ఫలపాత్ర,చక్రం, ఎడమచేతులలో చంద్రరేఖ, తర్జని ముద్ర, పాము, ఫలం వృక్షశాఖ లేదా నెమలి పింఛం ఉంచబడాలని ఆదేశం కాని ఈమె శ్వేతాంబర శాఖలోని సుత్తారవలె, అప్పుడప్పుడు ఎద్దుపైన గూడ చూపబడతుంది. ఈమె లలితాసనంలో ఉంటుంది.

**8:3:10 మానవి :** ఈమె పదవతీర్థంకరుడైన శీతలనాథుని శాసనదేవి లక్షణ గ్రంథాల ప్రకారం ఈమె ఒక వరాహం (Hog) వాహనంగా కలిగి చేతులలో ఫలం, వరదముద్ర, విల్లువంటివి చూప బడాలని ఉండగా, ఈమె కుడిచేతులలో చక్రం, వరదముద్ర, ఎడమచేతులలో శంఖం (లేదా ఫలం) దండం గా చూపబడడం జరిగింది

**8:3:11 గౌరి :** ఈమె పదకొండవ తీర్థంకరుడైన శ్రేయాంసనాథుని శాసనదేవి ఈమె లాంఛనం హరిణం. ఈమెకు నాలుగు చేతులుండి వానిలో గద, పద్మం, కడవ, వరదముద్ర ఉండాలని శాస్త్రం. కాని కొన్ని ఉదాహరణల్లో ఎడమచేతులలో జలకలశం, పుస్తకం, కుడిచేతులలో వరద ముద్ర

జపమాల ఉండడం జరిగింది.

**8:3:12 గాంధారి :** ఈమె పన్నెండవ తీర్థంకరుడైన వసు పూజ్యుని శాసనదేవి. ఈమెకు శాస్త్ర ప్రకారం మొసలివాహనం కాని ఉదాహరణల్లో ఈమెకు నెమలి వాహనంగా చూపబడింది. ఈమె నాలుగు చేతులు కలదిగాను, ఎనిమిది చేతులు కలదిగాను కూడా చూపడం జరిగింది నాలుగు చేతులుండగా ఎగువ ఎడమ చేత శక్తి, దిగువ ఎడమచేత శిశువు, ఎగువ కుడిచేత ముతులుంగము (మాతులుంగఫలం) ఉండి దిగువ కుడిచేయి వరద ముద్రతోను ఉండడం జరిగింది. ఎనిమిది చేతులుండగా కుడిచేతులలో వరద ముద్ర, మాతులుంగం, జపమాల, నీలి కలువ, ఎడమ చేతులలో జలకలశం, శంఖం, పూలగుత్తి, వికసించిన నీలి కలువల కట్ట ఉంటాయి.

**8:3:13 వైరోతి :** ఈమె పదమూడవ తీర్థంకరుడైన విమలనాధుని శాసనదేవి ఈమె సాంప్రదాయిక లాంఛనం పాము, కాగా, వైరోతిని ఎక్కువగా కొంగవాహనం గలదిగా చూపడం జరుగుతుంది. సాంప్రదాయికంగా ఈమె కేవలం నాలుగు చేతులు కలదిగా ఉండాలి కాని ఒరిస్సాలోని బారభుజి గుంఫాలో ఈమె ఎనిమిది చేతులు కలిగినట్లు చూపబడింది వానిలో కుడిచేతులలో వరద ముద్ర, అమ్ము, ఖడ్గం, పరశువు, ఎడమచేతులలో వజ్రం, విల్లు, బల్లెం, డాలు చూపడం జరిగింది ఈమె తల వెనుకలోతైన కొలవంటి ప్రభామండలం చూపబడింది

**8:3:14 అనంతమతి :** ఈమె పధ్నాలుగువ తీర్థం కరుడైన అనంతనాధుని శాసనదేవి సంప్రదాయం ప్రకారం ఈమె హంస వాహనం. నాలుగు చేతులు కలిగి వానిలో విల్లు, అమ్ములు, ఫలం, వరద ముద్ర ఉండాలి. కాగా, బారభుజి గుంఫాలోని ఉదాహరణలో ఆమె ఎనిమిది చేతులు కలిగి, ఎడమ చేతులలో వేత్రం, వజ్రం, వికసించిన పద్మాల కట్టడాలు, సమ్మెట కుడిచేతులలో వరదముద్ర, ఛురిక,బల్లెం, ఖడ్గం చూపడం జరిగింది వేత్రం అనేది సరిగా లేదు దానివల్లనే మిత్రా దానిని ఎనిమిది చేతుల మూర్తి అని వర్ణించారు

**8:3:15 మానసి :** ఈమె పదిహేనవతీర్థంకరుడైన ధర్మనాధునికి శాసనదేవి సంప్రదాయంప్రకారం ఈమె వాహనం వ్యాఘ్రం. ఈమె ఆరు చేతులలో వరద ముద్ర, రెండు పద్మాలు, అమ్ము, అకుశం, విల్లు ధరించి ఉండాలి. కాని బారభుజి గుంఫాలోని ఉదాహరణలో ఆమెకు వాహనంగా అశ్వం చూపబడింది ఆమె ఎడమ చేతులలో వరద ముద్ర, బంతి వంటి గుండ్రని వస్తువు, త్రిశూలం, కుడిచేతులలో ఘంట, ధ్వజం, శంఖం, ధరించి ఉంటుంది.

**8:3:16 మహామానసి :** ఈమె పదహారవ తీర్థంకరుడైన శాంతి నాధుని శాసనదేవి. సాంప్రదాయకంగా ఈమె లాంఛనం నెమలి. ఈమె నాలుగుచేతులు కలిగి వానిలో చక్రం, ఫలం, ఖడ్గం, వరద ముద్ర కలిగి ఉండాలి. కాని ఖండగిరిలో ఈమెను అభిషేక లక్ష్మి వలె ఇరుచేతులలో పద్మాలు, ఇరువైపుల ఏనుగులు జలాభిషేకం చేస్తున్నట్లు చూపించడం జరిగింది

**8:3:17 : విజయ :** ఈమె పదిహేడవ తీర్థం కరుడైన కుంధునాధుని శాసనదేవి సాంప్రదాయం ప్రకారం ఈమె నల్లని పందిని వాహనంగా కలిగి, నాలుగు చేతులతో వానిలో శంఖం, ఖడ్గం, చక్రం, వరదముద్ర ఉండాలని చెప్పబడింది కాగా, బారభుజి గుంఫాలలోని ఉదాహరణలో ఆమెకు మహిషం వాహనంగాఉంచి, పదిచేతులు కలమూర్తిగా, వానిలో వరద ముద్ర, వేత్రం, అంకుశం,చక్రం,

జపమాల కుడిచేతులలోను, త్రిశూలం, రంధ్రంగల చక్రం, శంఖం, నిండుగా వికసించిన పద్మాల కట్ట, జలకలశం ఎడమచేతులలోను చూపబడ్డాయి

**8:3:18 తార :** ఈమె పదునెనిమిదివ తీర్థంకరుడైన అరనాథుని శాసనదేవి సాంప్రదాయం ప్రకారం ఈమె వాహనం హంస (Swan) నాలుగు చేతులు కలది. కాని, ఒరిస్సాలో గల ఈ మూర్తి రెండు చేతులు మాత్రం కలిగి, వానిలో ఒక దానిలో వరదముద్రను, వేరొకదానిలో తామరపూల బొత్తిని కలిగి బౌద్ధుల తారవలె ఉంది.

**8:3:19 అపరాజిత :** ఈమె పందొమ్మిదవ తీర్థంకరుడైన మల్లినాథుని శాసనదేవి ఈమె పొట్టేలు వాహనంగా కలిగిన ఎనిమిది చేతుల మూర్తి ఆమె కుడిచేతులలో వరద ముద్ర, శక్తి, అమ్ము, ఖడ్గం, ఎడమచేతులలో శంఖం, విల్లు, డాలు, ధ్వజం కలిగి ఉంది ఇది కేవలం ఒక అసాంప్రదాయికమైన మూర్తి అని మహాపాత్ర అభివర్ణిస్తున్నారు

**8:3:20 బహురూపిణి :** ఈమె ఇరవయ్యవ తీర్థంకరుడైన ముని సువ్రతుని శాసన దేవి. సాంద్రాయం ప్రకారం ఈమె వాహనం కృష్ణసర్పం నాలుగు చేతులు కలిగి వానిలో డాలు, ఫలం, ఖడ్గం, వరదముద్ర ఉండాలి.కాని ఒరిస్సాలోని ఉదాహరణలో జలకలశం ఈమె లాంఛనంగా, రెండు చేతులు కలిగి ఎడమచేయి తల కిందుగా ఉంచి కుడిచేయి శరీరంపై ఉంచుకొన్నట్లు, అంటే శయనమూర్తిలాగా చూపించడం జరిగింది

**8:3:21: చాముండ :** ఈమె ఇరవయ్యొకటవ తీర్థంకరుడైన నమినాథుని శాసనదేవి. సంప్రదాయం ప్రకారం ఈమె మత్స్యవాహన, నాలుగు చేతులలో జపమాల, వేత్రం, డాలు, ఖడ్గం కలిగి హైందవ బ్రహ్మాణి వలె ఉండాలి కాని ఈమెను హంస వాహనం, నాలుగుచేతులలోను చూపడం జరిగింది.

**8:3:22: ఆమ్రమ లేదా అంబిక :** ఈమె ఇరవై రెండవ తీర్థంకంరుడైన నేమినాథుని శాసనదేవి. ఈమె వాహనం సింహం మిత్రా అభిప్రాయం ప్రకారం ఈమెను బ్రాహ్మణ (హిందూ) మతంనుంచి జైనులు గ్రహించడం జరిగింది బౌద్ధహారీతికి అంబికకు ఎంతో సామ్యం ఉంది ఈమె తూర్పు భారతదేశంలో ఎక్కువ ప్రచారం పొందిన మూర్తి. సామాన్యంగా ఆమె ఒడిలో శిశువుగాని, ప్రక్కన కొంచెం ఎదిగిన శిశువుగాని ఉండి ఆమె కుడిచేత మామిడి పళ్ళ గుత్తి ధరించగా, ఆమెకు నేపథ్యంలో వాలిన పళ్ళతో గల మామిడి కొమ్మలు చూపబడతాయి ఈమెకు సప్త మాతృకలవలె ప్రత్యేక భావన ఉంది ఈమె లలితాసనంలో ఉండగా, పీఠం కింద సింహం ఆమె లాంఛనం ఉండగా, పైన గల మామిడి వృక్షం పై కైవల్యం పొందిన నేమినాథుని చూపడం జరుగుతుంది ఒక్కొక్క సారి నేమినాథుని చూపడం కూడా జరుగదు ఈమె ప్రతిమ జైనమతంలోకి వచ్చిన బౌద్ధ, హిందూ అభిప్రాయాల ప్రాబల్యానికి ఒక గుర్తు

**8:3:23: పద్మావతి :** ఈమె ఇరవై మూడవ తీర్థంకరుడైన పార్శ్వనాథుని శాసన దేవి. జైనమతంలోని పద్మావతికి, హిందూమతం లోని మానసకుగల సాన్నిహిత్యం జైనపురాణాలలో చెప్పున్నారు. జైన వాఙ్మయంలో 'కాథా' అని చెప్పబడిన జరత్కారుడు అనే ఋషి పాతాళ ప్రభువైన శేషుడయ్యాడని భావించడం జరిగింది. ఈమెను మూడు కన్నులు కలదిగాను, ఏడు

పడగల పాము ఛత్రం వలె గలదిగాను చూపడం జరిగింది. ఈమె రెండు చేతులతోను, నాలుగు చేతులతోను, ఎనిమిది **చేతులతో**ను చూపబడింది సాంప్రదాయం ప్రకారం ఈమె వాహనం పాముగాని, నెమలిగాని ఉండాలి నాలుగు చేతులు కలిగి వానిలో అంకుశం, జపమాల, పద్మాలు ఉండాలి.

**8:3:24 సిద్ధాయిక :** ఈమె ఇరవై నాలుగవ తీర్థంకరుడైన వర్ధమాన మహావీరుని శాసనదేవి. దిగంబర సాంప్రదాయం ప్రకారం ఈమె సింహం వాహనంయై చేతులలో వరదముద్రను, పుస్తకం కలిగి ఉండాలి కాగా ఈమెను ఏనుగు వాహనం గలదిగా, ఇరవై చేతులతో చూపడం జరిగింది. కుడిచేతులలో వరద ముద్ర, బల్లె, జపమాల, అమ్ము, దండం, సమ్మెట, హలం. ఘంట, విల్లు, నాగపాశం,డాలు ఉన్నాయి. మిగిలినవి సరిగా చూపబడలేదు.

**8:4:1** జైనప్రతిమా రీతులలో పైన చెప్పిన తీర్థంకరులు, శాసనదేవులు, మాత్రమేగాక నవగ్రహాలు, దిక్పాలకులు, బ్రహ్మ, సరస్వతి, వినాయకుడు, మొదలైన హైందవ ప్రతిమలు, విద్యాధరులు, గంధర్వులు, సిద్ధులు, సాధ్యులు, ఖేచరులు వంటి పార్శ్వమూర్తులు వివరించబడడం జరిగింది.

**8:4:2** జైనంలో గలది గంబరులు, శ్వేతాంబరులు అనే రెండు ప్రధాన సాంద్రాయాలతోబాటుగా వివిధ మాండలిక సాంప్రదాయాలు కూడా వ్యాప్తిలోనికి వచ్చినట్లు శాసనదేవీమూర్తులను చూపడంలోని విస్తృత మైన అసంప్రదాయికత వల్ల తెలియవచ్చు. అదే విధంగా దక్షిణ భారత దేశంలోకి వ్యాపింప జేసిన భద్రబాహుని శిష్యపరంపరలోని కొండకుందాచార్యుడు, అతని సతీర్థులు, అతని శిష్యులు వీరందరూ దక్షిణ భారత దేశంలో ఈజైన మతాన్ని విస్తరింపచేశారు. గోదావరీ తీరస్థమైన నిజామాబాద్ జిల్లాలోని బోధన్ దక్షిణ దేశం(దక్కను, తమిళ దేశం)లోని జైన విధానాలకు ఒక ప్రధానమైన ఉత్తర దిశలోగల కేంద్రంగా చెప్పబడింది కాని మహారాష్ట్రలోని ఔరంగాబాద్ జిల్లా, ఛాలీస్‌గాం జిల్లా మొదలైన చోట్ల జైనం వ్యాప్తి పొందిన దృష్ట్యా ఈమతం ఆసేతు నర్మదా పర్యంతం విస్తరించి ఉంటుందని చెప్పడానిక అవకాశం హెచ్చు.

**8:4:3** 'నేమినాథపురాణం' 'జైనపురాణం' వంటి గ్రంథాలు జైనమతం లోని వివిధ తీర్థం కుల విశేషాలను గూర్చి ప్రజల వరకు తీసికొని వచ్చి జైన మతానికి ఒక ఆదరణ కలిగించాయి. అందువల్లనే బౌద్ధం దేశాంతర గతమయినా, జైనం భారతదేశంలోని ఒక ప్రాచీన మైన ముఖ్యమైన మతంగా పై విధాలయిన ప్రతిమా విశేషాలతో అలరారుతుంది.



# 9

# ఉప సంహరణ

**9:1** పై అధ్యాయాలలో వివరించిన హైందవ బౌద్ధ ప్రతిమా లక్షణాలు వేర్వేరు అధారగ్రంథాలను ప్రమాణంగా చేసుకొని వర్ణించినవి హైందవ ప్రతిమలకు సంబంధించి, 'అంశుమద్భేదాగమం', 'ఉత్తరకామికాగమం', 'శిల్పరత్నం', 'పూర్వకారణాగమం', 'సుప్రభేదాగమం', 'విష్ణుధర్మోత్తర పురాణం', 'శ్రీతత్త్వనిధి', 'మానసారం', 'రూపమండనం', 'శైవకారణాగమం', 'విశ్వకర్మశాస్త్రం', 'కుమార తంత్రాంగమం', 'బృహత్సంహిత', ' విష్ణుపురాణం', 'ఆదిత్యపురాణం', 'మయమతం', 'బ్రహ్మాండపురాణం', 'వైఖానసాగమం', 'క్రియాక్రమద్యోతి', మహామంత్రార్ణవం', 'అగ్నిపురాణం', 'పాంచరాత్రాగంమం', 'శారదాతిలకం' వంటి తంత్ర ఆగమ, శాస్త్ర పురాణ గ్రంధాలు ఆధారాలుగా స్వీకరించబడ్డాయి అదే విధంగా బౌద్ధమతానికి చెందిన 'సాధసమాల', నిష్పన్నయోగావళి, 'హేరుకతంత్రం', 'హేవజ్రతంత్రం', ప్రజ్ఞాపారమిత' వంటి వివిధ శాస్త్ర తంత్ర, మత గ్రంధాలు బుద్ధుని ప్రతిమలను గూర్చి తెలిసికోవడానికి తోడ్పడ్డాయి జైనమతానికి చెంది ప్రధానంగా లభ్యమవుతున్న ప్రతిమలలోనే విశేషాధారాలు గ్రహించడం జరిగింది. దానికి కారణం జైనమతం, బౌద్ధమతం వలె విస్తృతమైనదీ కాదు, వివిధ దశలలో పరిణమించినది కాదు.

**9:2** ఇన్ని రకాలుగా చెప్పబడిన ప్రతిమలను గూర్చి చిట్టచివరిగా తెలియవలసింది ఆప్రతిమలను చెక్కడంలో అనుసరించిన విధానం గురించి, ఆ రకమైన విధానాన్నే దశతాళమానం అంటారు ఇది ఉత్తమం, మధ్యమం అధమం అని మూడు రకాలు మూలమూర్తులను, ఛలబేరమూర్తులను చెక్కడంలో ఎక్కువగా ఉత్తమ దశతాళమానాన్ని అనుసరిస్తారు. దీనిని గూర్చి ప్రాధమికంగా మరిచీప్రోక్తమైన వైఖాన సాగమం లోని పటాలలో చెప్పడం జరిగింది. పార్శ్వ పరిహార దేవతలు మధ్యమ, అధమ దశతాళ విధులలో చెక్కబడతాయి

**9:3** ఈ మానంలో అతిప్రాథమికమైన మానం ఈ కింది విధంగా చెప్పబడింది

| | | | |
|---|---|---|---|
| 8 పరమాణువులు | : | 1 | రథ రేణువు |
| 8 రధ రేణువులు | : | 1 | రోమాగ్రం |
| 8 రోమాగ్రాలు | : | 1 | లీక్షం |
| 8 లీక్షాలు | : | 1 | యుక |
| 8 యుకలు | : | 1 | యువ |
| 8 యవలు | : | 1 | ఉత్తమ మానాంగుళం |
| 7 యవలు | : | 1 | మధ్యమ మానాంగుళం |
| 6 యవలు | : | 1 | అధమ మానాంగుళం |

**9:4** అదేవిధంగా పొడవును గూర్చి చెప్పేటప్పుడు ఈ కింది మానం గ్రహిస్తారు.

| | | | |
|---|---|---|---|
| 24 అంగుళాలు లేదా మానంగుళాలు | : | 1 | కిష్కు |
| 25 మానంగుళాలు | : | 1 | ప్రాజాపత్యం |
| 26 మానాంగుళాలు | : | 1 | ధనురగ్రం |
| 27 మానాంగుళాలు | : | 1 | ధనుర్ముష్టి |
| 4 ధనుర్ముష్టులు | : | 1 | దండం |

**9:5** ఇవే కాక ఆరురకాలైన కొలతలు సూచితమైనాయి. ఒక శరీరం పొడుగును మానం అంటారు. శరీరం వెడల్పును ప్రమాణం అంటారు శరీరం మందాన్ని ఉన్మానం అంటారు ప్రతిమలలోని వలయ భాగాన్ని పరిమాణం అంటారు వేర్వేరు అవయవాలమధ్య గల దూరాన్ని ఉపమానం అంటారు వీదంబం ప్రకారం తీసికొనే కొలతను లంబమానం అంటారు మానం, ప్రమాణం, ఉన్మానం, పరిమాణం వస్తువు పరిమాణాన్ని చూపగా, ఉపమానం, లంబమానం దానికి అంతరిక్షం (Space) లో గల సాపేక్ష సంబంధాన్ని సూచిస్తాయి.

**9:6** మానాన్నే ఆయమని, ఆయతమని, దీర్ఘమని అంటారు. ప్రమాణాన్నే విస్తారమని, తారమని, స్తృది అని, విస్తృతి అని, శృతమని, వ్యాసమని, విసారితమని, విపులమని, తతమని, విష్కంభమని , విశాలమని వ్యవహరిస్తారు ఉన్మానాన్నే బహళమని, గహనమని, మితిఅని, ఉచ్ఛ్రాయమని, తుంగమని, ఉన్నతమని, ఉదయమని, ఉత్సేధమని, నిష్క్రమమని, నిష్కృతి అని, నిర్గమమని, నిర్గతి అని, ఉద్గమమని కూడా పిలుస్తారు పరిమాణాన్నే మార్గమని, ప్రవేశమని, పరిణామమని, నాహమని వృతి అని, ఆవృతమని, నతమని కూడ అంటారు. ఉపమానం నే నీవరమని, వివరమని, అంతరమని కూడా వ్యవహరిస్తారు లంబమానాన్నే సూత్రమని, లంబనమని, ఉన్మితమని కూడా పిలుస్తారు

**9:7:** ఈ రకమైన మానంలో అతిచిన్న దేహంగుళం మాత్రమేకాక, పెద్దవి అయిన ప్రాదేశం, తాళం, వితస్తి, గోకర్ణం వంటివి కూడా ప్రపంచంలో ఉన్నాయి బొటనవేలిపై భాగానికి, చూపుడు వేలిపై భాగానికి వానిని చాపినపుడు ఉండే దూరాన్ని ప్రాదేశమంటారు బొటనవేలిపై భాగానికి మధ్య వేలిపై భాగానికి మధ్య గల దూరాన్ని తాళం అంటారు. బటనవేలిపై భాగానికి, ఉంగరపు వేలిపై భాగానికి మధ్యగల దూరాన్ని వితస్తి అంటారు బొటన వేలిపై భాగానికి చిటికెన వేలిపై భాగానకి మధ్య గల దూరాన్ని గోకర్ణం అంటారు

**9:8:** ఆగమాలలలో వేర్వేరు నియాల ను చూడగలం 124 దేహంగుళాలు ప్రయాణంగా గల ఉత్తమ దశతాళమా నాన్ని బ్రహ్మ విష్ణువు శివుడు అనే మూడు మూర్తులకు నియమించారు. 120 దేహాంగుళాలు ప్రమాణంగాగల మధ్య మ దశతాళమానాన్ని శ్రీదేవిభూదేవి, పార్వతి, సరస్వతి, దుర్గ, మాతృకలు,ఉష, జ్యేష్ఠా దేవి వంటి వారికి ఆదేశించారు. 116 దేహాంగుళాలు ప్రమాణంగా

గల అధమ దశతాళ మానాన్ని దిక్పాలకులకు, సూర్య చంద్రులకు, రుద్రులకు, వసువులకు, రుషులకు, క్షేత్రపాలకులకు, గరుత్మంతునికి, ఆది శేషునికి, కుమారస్వామికి, అశ్వనీ దేవతలకు, దుర్గకు నియమించడం జరిగింది

**9:9:** ఇవేకాక నవార్థతాళం,ఉత్తమ నవతాళం, సత్ర్యంగుళ నవతాళం, అష్టతాళం, సప్తతాళం, షటాళం, పంచతాళం, చతుస్తాళం, త్రితాళం, ద్వితాళ, ఏకతాళం అనేనిబంధనలను కూడా 'కారణాగమం' వంటి గ్రంధాలలో చూపడం జరిగింది.

**9:10:** ఇన్ని రకాలైన మానబేధాలతో చెక్కిన ఈ ప్రతిమల్నీ భారతీయమత భావనలకు వానిని అనుసరించి ఏర్పడిన ఆచారవ్యవహారలకు ఏర్పడిన భౌతిక మైన సూచికలుగా గ్రహించాలి విగ్రహారాధనలోగల వివిధ దశలకు, వివిధ స్వభావాలకు వివిధ విశ్వాసాలకు ప్రతిమలన్నీ సాలంకృతమైన మానవ ప్రతిబింబాలే ప్రతిమలన్నీ శిల్పాలుః శిల్పాలన్నీ ప్రతిమలు కావు ఈ సూత్రం దృష్ట్యా భారతీయమైన ఈ ప్రతిమలుకేవలం మత పరమైన అభిప్రాయాలను వ్యక్తీ కరించడమే కాక, ప్రకృతికి, మానవ జీవితానికి గల దగ్గర తనాన్ని పరస్పర ప్రభావాన్ని ద్యోతకం చేస్తున్నాయి. అందువల్లనే మానవ స్వభావంలోని సాత్విక, రాజసిక, తామసిక ధోరణులన్నీ ఈ ప్రతిమలలో అభివ్యక్తం అవుతున్నాయి ఈ ప్రతిమలకు గల నేపధ్యాన్ని సూచించే పౌరాణిక గాధలను పరిశీలించడం ద్వారా ఆకాలం చరిత్రలో మానవనాగరికత, మానవ స్వభావం ఏయే పరిణామాలకు గురి అయి ఉంటాయో చెప్పడం వీలవుతుంది తదృష్ట్యా , ప్రతిమా లక్షణ శాస్త్ర పరనం కేవలం ఏదో దేవాలయాల్లో దేవ, దేవీ మూర్తుల రూపురేఖలను చెప్పడానికే గాక, ఒక సశాస్త్రీయ మైన, సామాజిక ప్రయోజనాన్ని అందించడానికి కూడా తోడ్పడుతుంది. అనేది విశదమవుతుంది. కాని చరిత్ర పరిశోధనల్లో ఈ రకమైన అంశం ఇంకా వెలుగు చూడలేక పోయింది అనేది కూడా నిర్వివాదాంశమే

•••




1. వీణ




2. వీణ




3. ఢమరుకం




4. ఘంట




5. వేణువు లేదా మురళి




6. మృగం




7. సర్పం




8. కపాలం



9. దంతం



10 పక్షి




11. కమలం




12. నీలోత్పలం

**3. పరికరాలు** (చూ. అధ్యాయం - 1)



1. అభయహస్తం



2. వరదహస్తం



3. గజహస్తం లేదా దండహస్తం



4. కటక హస్తం



5. సింహకర్ణహస్తం



6. సూచిహస్తం

## 1. హస్తములు - ముద్రలు (చూ. అధ్యాయం -1)



7. ధనుర్హస్తం



8. కటిహస్తం



9. అంజలిహస్తం



10. సూచీహస్తం లేదా తర్జనిహస్తం



11. ఆయుధహస్తం



12. గోవాలహస్తం



13. పుస్తకహస్తం



14. విస్మయహస్తం



15. జ్ఞానహస్తం



16. జ్ఞానహస్తం



17. భూస్పర్శముద్ర



1. సమపాదస్థానకము



2. పద్మాసనం



3. సుఖాసనం



4. విషమపాదం



5. విషమపాదం



6. యోగాసనం లేదా ఉత్కుటికాసనం



7. నృత్యాసనం (నవనీతకృష్ణమూర్తి)



8. ఆలీఢాసనం

ఆసన-స్థానకరూపాలు (చూ. అధ్యాయం - 1)



1. కమండలువు



2. అర్ఘ్యపాత్ర



3. స్రుక్కు



4. స్రువం



5. పుస్తకం



6. దర్పణం



7-8 కిరీటమకుటం
9 బాలకృష్ణ కిరీటం



10-11 జటామకుటం



12. జటామకుటం

పరికరాలు - అలంకరాలు (చూ. అధ్యాయం - 1)





2. టంకం



1. అక్షమాల

4. అగ్ని



3. ఖట్వాంగం







5. శీలం

6. పరశువు

7. అంకుశం







8. విల్లు

9. గంగ

10. అంకుశం







11. పాశం

13. వజ్రం

12

12. శక్తి

. ఆయుధాలు (చూ. అధ్యాయం - 1)



6. ఉగ్రనరసింహమూర్తి, శ్రీరంగం (పేజి 24)



7. కాళియమర్దన మూర్తి
సుందర పెరుమాళ్‌కోయిల్ (పేజి 31)



8. లక్ష్మీనారాయణ మూర్తితిరుపతి (పేజి 33)



9. శివలింగం - మానుషలింగం (పేజి 37)



10. రావణానుగ్రమూర్తి శిల్పం, మాచెర్ల (పేజి 42)




11. నటరాజతాండవం, శ్రీశైలం (పేజి 52)



12. మహిషమర్దిని, డాకూర్,
మెదక్ జిల్లా (పేజి 68)
(Courtesy N. Markandeya Sarma)



13. గణపతి, వీరభద్రాలయం, డాకూర్, మెదక్‌జిల్లా (పేజి 7
(Courtesy N. Markandeya Sarma)





14. వేణువునూదుతున్న గణపతి, శ్రీశైలం (పేజి 80)    15. వీరభద్రుడు, భద్రకాళి, శ్రీశైలం (పేజి 80)





16. మహాశ్రీతార (పేజి 101)    17. ఋషభనాథుడు, మహావీర, గుంఫా, ఖండగిరి (పేజి 113)



18. పార్శ్వనాదుడు, పొడసింగిడిన యెంఘర్ జిల్లా, ఒరిస్సా (పేజి 119)



19. మహావీరుడు, జముండ, కోరాపుట్, ఒరిస్సా (పేజి 119)



20. చక్రేశ్వరి భగవతి (పేజి 120)



21. రోహిణి, భారభుజీ గుంఫా, ఖండగిరి (పేజి 120)

# పారిభాషిక పదకోశం

| పదం పేరు | వివరణ |
| --- | --- |
| అర్చామూర్తులు | పూజాయోగ్యమైన ప్రతిమలు |
| శిల్పం | ఆలంకారిక ప్రాధాన్యత గల చెక్కడాలు |
| మూలమూర్తులు | దేవాలయాల్లో ప్రధానమైనవి మూల విరాట్టులు |
| పార్శ్వమూర్తులు | మూలమూర్తుల పక్కన ఉండే ప్రతిమలు |
| పరివారమూర్తులు | ఆవరణదేవతలు |
| ఆసీనమూర్తులు | కూర్చొన్నట్లు చూపబడిన ప్రతిమలు |
| శయనమూర్తులు. | పడుకొన్నట్లు చూపబడిన ప్రతిమలు |
| ఉత్థానమూర్తులు | లేచినట్లు చూపబడిన ప్రతిమలు. వీనిని స్థానక మూర్తులు అనీ అంటారు. |
| పద్మాసనం | ఎడమకాలుపై కుడికాలు వేసికొని కూర్చుండుట |
| భద్రాసనం | రెండుకాళ్ళు వేలాడవేసి కూర్చుండటం |
| సుఖాసనం | అదే |
| ఉత్కుటికాసనం | రెండుకాళ్ళను పట్టబంధంతో చూపబడి కూర్చుండడం |
| స్వస్తికాసనం | పాదాలను స్వస్తిక వలె ఏర్పరచి ఉండడం |
| వజ్రాసనం | ఉత్కుటికాసనం వంటిదే |
| పర్యంకాసనం | పడుకున్నట్లు చూపేది |
| అర్థ పర్యంకాసనం | నడుభాగం వరకు పడుకొని పై భాగం లేచినట్లు చూపడం |
| ఆసనం | కరచరణాది సంస్థాన విశేషాలు కలది |
| ఉపచరాసనం | దేవుడికి సేవచేసే స్థితిలో ఉన్నరూపు |
| అలంకారాసనం | దేవునికి అలంకరించే టప్పుడు గల రూపు |
| స్నానాసనం | దేవునికి అభిషేచనం చేసే స్థితి |
| భోజనాసనం | దేవునికి నైవేద్యం చేసే స్థితి |
| యాత్రాసనం | దేవుని ఉత్సవమూర్తిగా చూపే స్థితి |
| ద్విభంగిమమూర్తి . | మెడ దగ్గర పాదం వద్ద వంపు చూసే స్థితి |
| త్రిభంగిమమూర్తి | మెడదగ్గర, కటివద్ద, పాదాల వద్ద వంపు చూపే స్థితి. |

| | |
|---|---|
| ఆలీఢమూర్తి | ఒక కాలుముందుకు వేసి బాణం వేస్తున్నట్లు నిలబడ్డరూపు |
| నృత్యమూర్తి | నాట్యం చేయుచున్నట్లు చూపే స్థితి |
| లాస్యం | శృంగార భరితమైన నాట్యం |
| తాండవం | రౌద్రస్ఫూర్తితో ఉన్న నాట్యం |
| ధావన్మూర్తి | పరుగెత్తుచున్నట్లున్న ప్రతిమా విశేషం |
| మంత్రం | దేవతల అక్షర రూపం |
| తంత్రం | ఆచరణ పూర్వకమైనవిధి |
| యంత్రం | స్థానపరమైన విధి |
| ఆగమం | సాంప్రదాయిక శాస్త్ర జ్ఞానం |
| విద్యాశక్తి | ప్రతిమలకు చెందిన శక్తి |
| కుండలినీ శక్తి | యోగానికి చెందిన శక్తి |
| మంత్రశక్తి | అక్షరానికి స్వరానికి చెందిన శక్తి |
| మృణ్మయమూర్తి | మట్టితో చేసిన ప్రతిమ |
| శిలామయమూర్తి | రాతితో చేసిన ప్రతిమ |
| మహమయ మూర్తి | లోహంతో చేసిన ప్రతిమ |
| ప్రతికృతి | బదులుగా చేసిన రూపం |
| టోటెమిక్ మతములు | సంకేతాత్మకమైన మతాలు |
| సంహారమూర్తులు | చంపుతున్న స్థితిలో గల రూపులు |
| కళ్యాణమూర్తులు | వివాహమాడుతున్న స్థితిలో గల రూపు |
| జ్ఞాన మూర్తులు | ప్రవక్తవలె వ్యవహరించిన మూర్తి |
| యోగమూర్తులు | తపోదీక్షను వాంఛించిన మూర్తులు |
| భోగమూర్తులు | శారీరక సౌఖ్యాన్ని వాంఛించిన మూర్తులు |
| వీరమూర్తులు | తమో భావాన్ని సూచించిన మూర్తులు |
| అభిచారిక మూర్తులు | వినాశనాన్ని సూచించిన మూర్తులు |
| కట్యావలంబితముద్ర | నడుముపై చేయి ఉంచుకొన్నట్లు చూపడం |
| అభయముద్ర | రక్షిస్తున్నట్లు చూపే చేయి |
| వరదముద్ర | ధారపోస్తున్నట్లు భూముఖంగా చూపిన చేయి |
| సింహకర్ణముద్ర | చూపుడువేలిని, చిటికెనవేలిన ఎత్తిమడిచి, మధ్యవేలిని ఉంగరపు వేలిని రెండు వేపుల తాకుతూ ఉంచడం. |

| | |
|---|---|
| సూచీహస్తం | చూపుతున్నట్లు చూపుడు వేలిని ఉంచడం. దీనినే తర్జని అనీ అంటారు. |
| గోవాల హస్తం | చేతిని ఆవు తోకవలె స్వేచ్ఛగా వదలడం |
| అంజలి ముద్రలేక హస్తం | రెండు చేతులు మోడ్చి మనస్కరిస్తున్నట్లుండడం |
| ధనుర్హస్తం | చేతిలో విల్లు దాల్చి ఉండడం |
| పుస్తకహస్తం | చేతిలో పుస్తకాన్ని దాల్చి ఉండడం |
| భూస్పర్శముద్ర | చేతివేళ్ళు భూమికి తగిలేటట్లుండడం. |

# ఉపయుక్త గ్రంథసూచి


1. గోపీనాధరావు టిఏ — ఎలిమెంట్స్ ఆఫ్ హిందూ ఐకానోగ్రఫీ
2. త్రివేది ఆర్.డి. — ఐకానోగ్రఫీ ఆఫ్ పార్వతి
3. శ్రీనివాసన్ టి ఎన్. — ఎ హాండ్ బుక్ ఆఫ్ సౌత్ ఇండియన్ ఇమేజెస్
4. సోమనాథ ముఖోపాధ్యాయ — చండి ఇన్ ఆర్ట్ అండ్ ఐకానోగ్రఫీ
5 రాజేశ్వరి డి ఆర్? — శక్తి ఐకానోగ్రఫీ
6. తివారీ ఎస్ పి — హిందూ ఐకానోగ్రఫీ
7 చంపకలక్ష్మి ఆర్ — వైష్ణవ ఐకానోగ్రఫీ ఇన్‌ది తమిళ్ కంట్రీ
8. శివరామమూర్తి. సి. — శతరుద్రీయ విభూతి ఆఫ శివాస్ ఐకానోగ్రఫీ
9. భట్టాచార్య డి సి — స్టడీస్ ఇన్ బుద్ధిస్ట్ ఐకానోగ్రఫీ
10. మొహపాత్ర ఆర్ పి. — జైనమాన్యుమెంట్స్ ఇన్ ఒరిస్సా
11. గోపాలకృష్ణ మూర్తి ఎస్. — జైనావెస్టిజెస్ ఇన్ ఆంధ్రదేశ
12. పెర్సీ బ్రౌన్ — ఇండియన్ ఆర్కిటెక్చర్స్, హిందూ, బుద్ధిస్ట్, జైన్
13. బెంజమిన్ రోలాండ్ — ఇండియన్ ఆర్ట్ అండ్ ఆర్కిటెక్చర్స్
14. రాధాకృష్ణ శర్మ. ఎం. — టెంపుల్స్ ఆఫ్ తెలంగాణా
15. కామేశ్వరరరావు. ఎ.ఎస్ — టెంపుల్స్ ఆఫ్ రాయలసీమ
16. రాజేంద్రప్రసాద్. బి — ఆర్ట్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ సౌత్ ఇండియా
17. రాజేంద్రప్రసాద్. బి — టెంపుల్స్ స్కల్ప్చర్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్
18. రామచంద్రరావు ఎస్.కె — ప్రతిమాకోశం
19. సత్యమూర్తి కె — హాండ్ బుక్ ఆఫ్ ఇండియన్ ఆర్కిటెక్చర్

**8:2:10: శీతలనాథుడు :**

**8:2:10:1** ఇతడు పదవ తీర్థంకరుడు. విచారమనే ఉష్ణాన్ని తొలగించడం వల్ల, జ్వరితులైన రోగులకు ఉష్ణముపశమింపచేసి, చల్లదనాన్ని కలిగించడం వల్ల ఇతడిని శీతలనాథుడని వ్యవహరించినట్లు జైన సాంప్రదాయం వలన తెలుస్తుంది. ఇతడు విల్వ (బిల్వమారేడు) వృక్షం కింద కేవలుడైనాడు. ఇతడు శ్రీవత్సలాంఛనాలంకృత శరీరం గలవాడు. ఇతని చిహ్నం వజ్రం. ఇతనికిరువైపుల చామరగ్రాహిణులు,శిరస్సుపై త్రిరేఖాచ్ఛత్రం, అదృశ్యులు మోయిస్తున్న తాళాలు, కోలగాఉన్న ప్రభా మండలం, మాలహస్తులైన విద్యాధరులు చూపబడ్డారు. సాంప్రదాయికమైన వీనితో బాటుగా మహావీర గుంఫాలోని ఉదాహరణలో గల చిహ్నానికి పీఠంపై ఇరువైపుల వస్తువులైన ఉంచిన చిమ్మనకోలలు, మకరతోరణం, చిలుకలు, నందిపాదముద్రలు, నాగమూర్తులు అసాంప్రదాయికమైన అలంకరణలు.

**8:2:11 శ్రేయాంసనాథుడు :**

**8:2:11:1** ఇతడు పట్టుదలతో, వెనుకడుగులేయనివాడుగా గుర్తింపు పొందిన తీర్థంకరుడు ఖడ్గమృగం (Rhinoceros) ఇతని లాంఛనం. ఇతని ప్రతిమలను ఆసీనుడుగా ధ్యానముద్రలోను, స్థానక మూర్తిగా కాయోత్సర్గముద్రలోను చూడగలం. తిండికావృక్షం కింద ఇతడు కేవల జ్ఞానం పొందాడు. ఇతడు నిలబడిన పీఠిక సింహాలతో మోయపబడినట్లు చూపబడింది. చామర గ్రాహిణులు, త్రిరేఖాచ్ఛత్రం, అదృశ్యులు మోయిస్తున్న తాళాలు మొదలైన సాంప్రదాయిక అలంకరణలున్నాయి

**8:2:12 వసుపూజ్యుడు**

**8:2:12:1** ఇతని లాంఛనం మహిషం. ఇతడిని యోగాసనముద్రలోను, కాయోత్సర్గముద్రలోను కూడా చూపడం జరిగింది ఇతడు పాటలిక వృక్షం కింద కేవలత్వం పొందినట్లు తెలుస్తుంది. ఇతని పీఠిక పద్మాలంకృతం. పై భాగంలో త్రిరేఖచ్ఛత్రాన్ని, కుడి ఎడమల చామర గ్రాహిణులను కూడా చూడగలం మహావీరగుంఫాలో కనపబడిన ప్రతిమ పైభాగంలో అంశాలు, చిమ్మనక్రోవులు, లతలు, తిరుగబడ్డట్లుగా చిలుకలు మొదలైనవి ఆలంకారికి ప్రక్రియలో భాగాలుగా చూపడం జరిగింది.

**8:2:13 విమలనాథుడు :**

**8:2:13:1** ఇతని లాంఛనం వరాహం ఇతడు జంబూ (నేరుడు) వృక్షం కింద కేవలత్వం పొందినవాడు భారభుజిగుంఫాలోను, మహావీరగుంఫాలోను ఇతని ప్రతిమలున్నాయి

**8:2:14 అనంతనాథుడు**

**8:2:14:1** ఈ పదునాల్గవ తీర్థంకరుని తల్లి స్వప్నంలో అనంతమైన ముత్యాల హారాన్ని చూసినందువల్ల ఇతణ్ణి అనంత నాథుడని పిలవడం జరిగింది అయోధ్యలోని ఒక శక్తిహీనమైన అనంతమైన త్రాడు ఇతడు జన్మించడంతోనే శక్తివంతమైనందువల్ల ఇతనిని అనంత నాథుడనడం జరిగిందని జైన సాంప్రదాయం వల్ల తెలుస్తుంది నెమలి ఇతని లాంఛనం ఇతడు అశ్వత్థవృక్షం